సంపుటి : 7 సంచిక : 10

ఆగస్టు, 1963

శ్రావణ - భాద్రపద

1885 శకం

# ఆంధ్రప్రదేశ్



సంచికలో....

# ఆంధ్రప్రదేశ్

ఆగస్టు : 1963

## విషయ సూచిక



సంవత్సర చందా — రు. 3—00.

విడి ప్రతి రు. 0—25 నయాపైసలు.



అయోనియన్ స్కూలుకు చెందిన ప్రాచీన గ్రీకు శిల్పం

(చూ. వ్యాసం : 13వ పేజీ)



ముఖచిత్రం : హైద్రాబాదులో కృష్ణాష్టమి వేడుక; 4వ అట్ట: పరినాటు; 2వ అట్ట : రామచంద్రాపురంలోని భారీ విద్యుత్పరికరాల ర్మాగారంలో ప్రారంభించబడిన సాంకేతిక శిక్షణ పాఠశాలలో 'మ పనిలో నిమగ్నులై వున్న శిక్షితులు.

# "ఆంధ్రప్రదేశ్" అభ్యుదయంపట్ల 'బర్మా' ఆంధ్రుల ఆసక్తి

"ఆంధ్రప్రదేశ్" మాస పత్రిక ఇప్పటికి సుమారు 2½ సంవత్సరములనుండి ప్రతి నెలా అందుచున్నది

బర్మాలోని మూడు ప్రధాన నగరాలలో ఒకటైన మోల్మేన్‌లో ఉన్న ఆంధ్రులు "ఆంధ్రప్రదేశ్" ద్వారా, ఆంధ్ర ప్రభుత్వం కొనసాగిస్తున్న అఖండ విజయాలను తెలుసుకొంటున్నారు

మాసమాసానికీ సరిక్రొత్తపోకడలతోనూ ఎన్నికైన రచయితల రచనలతోనూ, భావ గీతాలతోనూ "ఆంధ్రప్రదేశ్" పత్రికను సర్వాంగసుందరంగా వెలువరిస్తున్నందుకు మా అభివందనలు

ఇట్లు
నక్కెళ్ళ కోదండకుమార్
పాస్‌పోర్ట్ కన్‌సాల్టెంట్
మోల్మేన్, "బర్మా"

జూన్ 1963 సంచిక ఆంధ్రప్రదేశ్, లలనావనంలోని "స్త్రీలపాలిటి బలిపీఠం" వ్యాసం, స్త్రీల కొక అపూర్వ సందేశం




ఇలాంటి అమూల్యమయిన వ్యాసాలద్వారా స్త్రీలోకాన్ని మేలుకొల్పాలని రచయితలను హృదయపూర్వకంగా కోరుతున్నాను ఉన్నతాశయాలతో సందేశాలనిచ్చే యిట్టి రచయితలకు ధన్యవాదాలు

ఇట్లు
పెమ్మరాజు శేషు
కాకరపర్రు

ప్రియ మిత్రమా,

గత ఒక సంవత్సరంనుంచి మీ పత్రిక సంతృప్తికరంగా అభివృద్ధి చెందుతున్న దని తెలపడానికి నాకు ఆనందంగావుంది ఈ పత్రిక విషయ వివరణలోనేగాక ప్రబోధాత్మకంగాకూడా విలువైనదిగా వుంది "మహాకవి" వంటి రచనలు నన్నెంతో ఆకర్షించాయి మన ప్రాచీన చరిత్రకు సంబంధించిన విషయాలను స్పష్టంగా తెలుసుకోవడానికి వీలుగా మున్ముందుకూడా ఇలాంటి రచనలను ప్రచురిస్తూవుండగల రని ఆశిస్తున్నాను

భవదీయుడు
విజయరంగారావు
ఎం ఎల్ ఏ
అధ్యక్షుడు జిల్లా పరిషత్తు,
కరీంనగరం

---

## రచయితలు

శ్రీ బోయి భీమన్న ట్రాన్స్‌లేషన్ డిపార్టుమెంట్, హైదరాబాద్
శ్రీ పి వి నరసింహారావు, న్యాయ, సమాచారశాఖల మంత్రి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం, హైద్రాబాద్
శ్రీమతి క దివ్యజ్ఞాన సరోజినీదేవి, అశోకారోడ్, న్యూఢిల్లీ
శ్రీ కె వి భాస్కరరావు, పబ్లిక్‌రిలేషన్స్ ఆఫీసర్, హైద్రాబాద్
శ్రీ షట్టి కృష్ణమూర్తి, జిల్లాపరిషత్ హైస్కూల్, కొండపల్లి (పోస్టు), కృష్ణాజిల్లా
శ్రీ పి ఎల్ సంజీవరెడ్డి, లెక్చరర్, ఆంధ్రా యూనివర్శిటీ, వాల్తేరు
శ్రీ లకంసాని చక్రధరరావు, తెలుగు డిపార్టుమెంట్, ఆంధ్రా యూనివర్శిటీ, వాల్తేరు
శ్రీ కె వి సుబ్బారావు, తిర్‌మల్‌గిరి, సికింద్రాబాద్
శ్రీ "చిత్రభాను", జర్నలిస్టు, కోరాడ స్టేషన్, విజయనగరం—2
శ్రీ పోతుకూచి సాంబశివరావు, బోయిగూడ, సికింద్రాబాద్
శ్రీ దివాకర్ల వేంకటావధాని, తెలుగురీడర్, ఉస్మానియా యూనివర్సిటీ, హైద్రాబాద్
శ్రీ పి వెంకటేశ్వరరావు, చిక్కడపల్లి, హైద్రాబాద్
శ్రీ శ్రీనివాస చక్రవర్తి, విజయవాడ, కృష్ణా జిల్లా
శ్రీ బి రామరాజు, తెలుగురీడర్, ఉస్మానియా యూనివర్సిటీ హైద్రాబాద్
శ్రీమతి ఆశాపూర్ణాదేవి, కలకత్తా
శ్రీ దండమూడి మహీధర్, ఆకాశవాణి, హైద్రాబాద్
శ్రీమతి అవుల జయప్రదాదేవి, హిమాయత్ నగర్, హైద్రాబాద్
డాక్టర్ వేమిరెడ్డి రాజేశ్వరమ్మ, నీలోఫర్ హాస్పిటల్, హైద్రాబాద్
శ్రీ యోగేశ్వరరావు, శ్రీ సత్యనారాయణ, హైద్రాబాద్
శ్రీ వాసిరాజు ప్రకాశం, చిక్కడపల్లి, హైద్రాబాద్
శ్రీ వేటూరి ఆనందమూర్తి, తెలుగు లెక్చరర్ — నైట్‌కాలేజీ — హైద్రాబాద్
శ్రీ వింజమూరి శివరామారావు, ఆకాశవాణి, విజయవాడ—2

* ప్రాచీన గ్రీకుశిల్పాల ప్రతికృతులు
— శ్రీ శీలా వీర్రాజు.

* 61 వ పుటనుండి 69 వ పుటవరకూ ఉన్న ఆంధ్రదేశ నృత్య విశేష వ్యాసాలు రెండూ "మన చరిత్ర - సంస్కృతి" శీర్షిక క్రిందివిగా గుర్తించ గోరుతున్నాము — ఎడిటర్.

# ముఖ్యమంత్రి లేఖ

ప్రియమైన చదువరీ !

ప్రధానమంత్రితో కలిసి రాష్ట్రంలో జరిపిన చరిత్రాత్మకమైన పర్యటన ముగించుకొని నేను ఇప్పుడే తిరిగి వచ్చాను ఈ పర్యటనలో మేము, మన రాష్ట్రంలోని రెండు ప్రధాన నదులైన కృష్ణా, గోదావరులను సందర్శించాము శ్రీశైలంవద్ద కృష్ణానదీ తీరంలో ప్రధానమంత్రి శ్రీశైలం జలవిద్యుత్ ప్రాజెక్టుకు శంకుస్థాపన చేశారు నేను క్రిందటి లేఖలో ఈ ప్రాజెక్టు విషయమై ప్రస్తావించడం జరిగింది ఈ ప్రాజెక్టుకు మన ప్రధానమంత్రియే స్వయంగా శంకుస్థాపన చేసినందుకు నాకు చాలా ఆనందంగా వుంది దూర ప్రాంతంలోనున్న ఈ ప్రాజెక్టు స్థలంలో కూడా వేలమంది ప్రజలు శంకుస్థాపనోత్సవంలో పాల్గొని శ్రీ నెహ్రూ దర్శనం చేసుకున్నారు ఈ ప్రాజెక్టు[1] పనులను మనం మంచి తరుణంలో ఆరంభించాము

తరువాత రెండు రోజులకు మేము పోచంపాడుకు వెళ్ళాము ఇది మరో ముఖ్యమైన ప్రాజెక్టు ఈ ప్రాజెక్టుకు మంజూరీ ఇవ్వవలసిందిగా నేను కొంతకాలంగా భారత ప్రభుత్వానికి విజ్ఞప్తిచేస్తూ వచ్చాను నిజామాబాదు జిల్లాలో గోదావరి నదిపై నిర్మించబడే ఈ ప్రాజెక్టు తెలంగాణా ప్రాంతాన్ని ముఖ్యంగా కరీంనగరం జిల్లాను సుభిక్షం చేయగలుగుతుంది ఈ ప్రాజెక్టు పూర్తికావడంతో మన జాతీయాదాయంలో[2] వార్షికంగా రూ 8 కోట్ల పెరుగుదల ఏర్పడుతుంది ఈ ప్రాజెక్టు స్థలంవద్ద కూడా సుమారు లక్షమంది ప్రజలు శంకుస్థాపనోత్సవంలో పాల్గొని ప్రధానమంత్రిని దర్శించుకున్నారు ఆయన ప్రసంగాన్ని శ్రద్ధగా విన్నారు

ఈ సంఘటనలు నాకు చాలా ఆనందం కలిగించాయి చరిత్ర ప్రసిద్ధుడైన మహాపురుషుడు, చరిత్రాత్మకమైన రెండు నదీతీరాలలో చారిత్రకమైన రెండు ప్రాజెక్టులకు శంకుస్థాపనోత్సవం జరపడం సంతోషకరం నిజానికి మనందరికీ ఇది గర్వకారణం నాలుగు సంవత్సరాల క్రితం, పండిట్‌జీ నాగార్జున సాగర్‌కు వచ్చినప్పుడు ఒక కార్మికుడు ఆయన వద్దకు వెళ్ళి, "ఇది మీరు వెలిగించిన దీపమే" నని ఆ ప్రాజెక్టును గూర్చి అన్నాడు ఇప్పుడు ప్రధానమంత్రి మరో రెండు జ్యోతులను వెలిగించారు ఇవి మన రాష్ట్రంలో నాలుగు చెరుగులా వెలుగులను ప్రసరింప జేస్తాయి వారు వెలిగించిన ఇన్ని జ్యోతులు మరేదైనా "గృహం"లో వున్నాయో లేవో నాకు తెలియదు కాని ఆంధ్ర ప్రజలు తరతరాల వరకు వారు వెలిగించిన ఈ జ్యోతులను ప్రవర్ధిల్ల జేయగలరు కష్టించి పని చేయడానికి ఇవి మన ఉత్సాహాన్ని పెంపొందింప జేస్తాయి

అన్ని ప్రదేశాలలోనూ ప్రధానమంత్రి ప్రసంగాన్ని వినడానికి అశేష ప్రజానీకం రావడాన్నిబట్టి ఆయన కలలు ఇంకా ప్రజానీకం కంటున్న కలలే ననీ, ఆయన ఇక్కడికివచ్చి వారిని ఉద్దేశించి ప్రసంగించి నప్పుడు భవిష్యత్తుకై కృషి చేయడానికి వారిలో నూతనోత్తేజం కలుగుతుందనీ వెల్లడవుతున్నది

ఈ ప్రాజెక్టుల విషయమై నేను మొట్టమొదట పేర్కొనడానికి, నాలో వీటిని గురించిన ఆలోచనలు అధికంగా వుండడం, వీటి ప్రారంభోత్సవం వల్ల నేను ఎంతో ఆనందం పొందడమే కారణం రామచంద్రాపురం వద్ద నిర్మించబడుతున్న భారీ విద్యుత్పరికరాల కర్మాగారం విషయమై నేను వీటికంటే మొదటే ప్రస్తావించవలసింది ఎందుచేతనంటే గత నెల 8 వ తేదీననే ఈ కర్మాగారపు శిక్షణా పాఠశాలకు నా మిత్రులు మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కామరాజ్ ప్రారంభోత్సవం చేయడం జరిగింది ఈ కర్మాగారం 1965 వ సంవత్సరం నుంచి టర్బైన్ల ఉత్పత్తిని ఆరంభిస్తుంది ఈనాడు దేశంలోని పూర్తి స్థాపిత ఉత్పాదక శక్తిలో ఏటా దాదాపు ఏడవ వంతు మేరకు ఈ కర్మాగారం పరికరాలను ఉత్పత్తి చేయగలుగుతుంది

[3]యీరకం ప్రాజెక్టు దేశంలో ఇదే మొదటిది కాదనే విషయం మనకు తెలిసినప్పుడు వచ్చే కొద్ది సంవత్సరాలలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తి ఎంత ఎక్కువ అవుతుందో మనం తెలుసుకోవచ్చు పారిశ్రామికాభివృద్ధికి విద్యుచ్ఛక్తి మూలాధారమనే విషయం మీకు తెలుసు మన రాష్ట్రంలో గత రెండు ప్రణాళికలలో యీ విషయంలో మనం ఎక్కువ శ్రద్ధ వహించలేక పోయాం అందువల్ల ఆశించినవిధంగా పారిశ్రామికాభివృద్ధి జరగలేదు యీ సందర్భంలో గత లేఖలో నేను పేర్కొన్న కొత్తగూడెం థర్మల్ విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు, దానికి అంతర్జాతీయ అభివృద్ధి సంస్థ ఇచ్చిన సహాయాలను గూర్చి మీరు జ్ఞప్తికి తెచ్చుకోవచ్చు; మరొక మన ప్రాజెక్టుకు

---

1 ఈ పథకానికి సంబంధించిన వ్యాసం యీ సంచిక 59 వ పుటలో ప్రచురించబడింది.

2. ఈ ప్రాజెక్టును గూర్చిన వ్యాసం ఆంధ్రప్రదేశ్ జూలై సంచికలో ప్రచురించ బడింది. చూ. 66 పుట.

3 ఈ ఫ్యాక్టరీని గురించిన వ్యాసం యీ సంచిక 22వ పుటలో ప్రచురించ బడింది.

ఇటువంటి సహాయం లభించిందని చెప్పడానికి నేను ఎంతో ఆనందిస్తున్నాను

అమెరికా ప్రభుత్వ ఏజన్సీ అయిన అంతర్జాతీయాభివృద్ధి సంస్థ రామగుండం థర్మల్ పవర్ ప్రాజెక్టు విస్తరణకై 8 4 మిలియన్ డాలర్ల ఋణాన్ని మంజూరు చేసింది

దీనికి సంబంధించిన ఒప్పందంపై 1963 మే 21 వ తేదీన సంతకాలు జరిగాయి రామగుండం థర్మల్ ప్రాజెక్టులో 60 మెగా వాట్ల శక్తిగల థర్మల్ జనరేటర్ యూనిట్‌ను నెలకొల్పడానికి యీ ఋణాన్ని వినియోగించడం జరుగుతుంది 61 అర్ధ వార్షిక వాయిదాలలో యీ ఋణాన్ని తిరిగి చెల్లించడం జరుగుతుంది యీ ఋణానికి సంబంధించిన మొదటి వాయిదా చెల్లింపు జరిగిన 9½ సంవత్సరాల తర్వాత తిరిగి చెల్లింపు ప్రారంభ మవుతుంది

యీవిధంగా తగినంత విద్యుచ్ఛక్తి సరఫరాతోపాటు మనం కల్గించే ఇతర సౌకర్యాలుకూడా త్వరితగతిని పారిశ్రామికాభివృద్ధికి మనకు తోడ్పడుతాయి

మన రాష్ట్రంలో ఇతోధికంగా పరిశ్రమలు ఏర్పడినంత మాత్రాన ప్రధానమైన వ్యవసాయోత్పత్తి కృషికి నష్టం వాటిల్లదు యీ రంగంలోకూడా అధికోత్పత్తికై నిరంతర కృషి జరుగుతున్నది యీ విషయంలో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు కలిసికట్టుగా పని చేస్తున్నాయి అధికాహారోత్పత్తి పథకాలు వగైరాల విషయంలో మనం ఆశించిన విధంగా దేశంలో వ్యవసాయోత్పత్తులలో అభివృద్ధిని సాధించడం జరగడం లేదని ఇటీవల జరిగిన పంచవర్ష ప్రణాళికల పరిశీలనవల్ల ద్యోతకమయిన విషయం మీకు తెలిసిందే అందువల్ల అధికోత్పత్తిని సాధించడానికి తీవ్ర కృషి జరగాల్సి ఉంది యీ ఉద్దేశంతోనే నిర్ణీత ప్రాంతాలలో 'సాంద్ర వ్యవసాయ పథకాల'ను ప్రథమంగా ప్రవేశపెట్టడం జరిగింది శాస్త్రీయ పద్ధతులలో ఉత్పత్తిని అధికం చేయడానికై తీవ్ర కృషి జరపడానికి యీ పథకం ఉద్దేశించబడింది మన రాష్ట్రంలో పశ్చిమ గోదావరి జిల్లాలో యీ పథకాన్ని అమలుపరిచారు తద్వారా 40 శాతం అధికోత్పత్తిని సాధించడం జరిగింది సాధ్యమయినన్ని ఎక్కువ ప్రాంతాలలో యీ పథకాన్ని అమలు చేయాలని కేంద్ర ప్రభుత్వం భావిస్తున్నది అందువల్ల సవరింపబడిన సాంద్ర వ్యవసాయ పథకాన్ని ప్రవేశపెట్టడానికి దేశంలో అనేక జిల్లాలను ఎన్నిక చేయడం జరిగింది మన రాష్ట్రంలో 10 జిల్లాలలో యీ పథకాన్ని అమలు జరుపుతున్నారు ఇతర జిల్లాలలోకూడా యీ పథకాన్ని ప్రవేశ పెట్టడం జరుగుతుంది ఇటీవలనే గుంటూరు జిల్లా తెనాలిలో యీ పథకం అమలుకు ప్రారంభోత్సవం జరిగింది అనాదిగా సాంప్రదాయక పద్ధతులకు అలవాటుపడిన రైతులకు క్రొత్త విధానాలను తెల్పడం, వారి ఆదాయాలను అధికం చేసుకోవడానికి వీలుగా క్రొత్త వ్యవసాయ పద్ధతులను నేర్పడం యీ పథకం ముఖ్య ప్రయోజనాలలో ఒకటి ఉదాహరణకు పశ్చిమ గోదావరిలో రెండవ పంటగా ప్రత్తిని వేయడాన్ని రైతులకు నేర్పడం జరిగింది తద్వారా వారికి ఎకరాకు రు 400/ నుంచి 500/ ల అదనపు ఆదాయం కలిగింది యిటువంటి పనులను ఇప్పుడు తెనాలిలోనూ ఇతరచోట్లకూడా చేయవచ్చు

దేశంలో ఏర్పడిన అత్యవసర పరిస్థితిని గూర్చి యీ లేఖలలో పేర్కొని చాలాకాలమైంది అంతమాత్రాన జాతీయావసరాలగూర్చి ప్రజలకు తెలియదనిగానీ, అత్యవసర పరిస్థితి అవసరం తీరిందని వాదిస్తున్న కొన్ని వర్గాలవారి అభిప్రాయాలతో నేను ఏకీభవిస్తున్నట్టుగాగానీ అర్థంకాదు ప్రత్యేకంగా కమ్యూనిస్టులు, ఇతర పార్టీలవారు యీ అభిప్రాయంతో ప్రజలను, ప్రత్యేకించి కార్మిక వర్గాలను, రక్షణ కృషికై భారత ప్రభుత్వం తీసుకుంటున్న కొన్ని చర్యల విషయంలో పెడత్రోవ పట్టించే ప్రయత్నాలు చేస్తున్నారు క్రొత్త పన్నులకు వ్యతిరేకంగా వారు తమ గొంతులు చించుకుంటున్నారు అంతేగాక ప్రదర్శనలు జరిపి 'మహా విజ్ఞాపన' పత్రం అనేదాన్ని పార్లమెంటుకు సమర్పించాలని కూడా ప్రతిపాదించారని మాకు తెలియవచ్చింది క్రొత్త పన్నులవల్ల ప్రజలకు కొంత యిబ్బంది కలిగిందనే విషయాన్ని ఎవ్వరూ కాదనరు, అయితే జాతి అవసరాలను, దీర్ఘకాలిక ఉద్దేశాలను విస్మరించి యీ విషయాలను రాజకీయ ప్రయోజనాలకు వినియోగించుకోవడానికి ప్రయత్నించడం నిజంగా క్షమించరాని విషయం చైనా దురాక్రమణ ప్రమాదాన్ని ఎదుర్కోవడానికి మన ప్రజలు చూపిన చైతన్యాన్నీ, క్రొత్త బాధ్యతలు, త్యాగాలను స్వీకరించిన విధానాన్నీ గూర్చి విదేశాల వ్యాఖ్యాతలు కూడా శ్లాఘించారు ప్రస్తుతం కమ్యూనిస్టులు చేస్తున్న ఆందోళన కారణంగా ప్రజలలో చైతన్యం తగ్గిపోదనీ, క్రొత్త పొదుపు పథకాలను, పన్నుల పథకాలను అమలు జరపడంలో వారు తమ పూర్తి సహాయ సహకారాలను అందజేస్తారనీ నేను విశ్వసిస్తున్నాను

'జైహింద్'

భవదీయుడు

నీలం సంజీవరెడ్డి

ఆంధ్ర ప్రదేశ్

# విజయ విప్లవం

—బోయి భీమన్న

( ఆగస్టు తొమ్మిదవ తేదీని స్వాతంత్ర్య విప్లవం ప్రారంభమై ఆగస్టు 15 వ తేదీని స్వాతంత్ర్యం లభించింది దేశానికి ఆగస్టు తొమ్మిదికీ, ఆగస్టు 15 కీ మధ్య వాస్తవంగా గడిచినకాలం ఐదు సంవత్సరాలైనా, ఔపచారికంగా అవి ఏడురోజులే అదే విజయ విప్లవ సప్తాహం నిజానికి భారత్ జరుపుకోవలసిన సప్తాహాలన్నిటిలోకీ ఈ విప్లవసప్తాహమే అతి ప్రధానం ఈ సప్తాహోత్సవం ఎంత ఉత్సాహంగా జరుపుకుంటే అంత అభ్యుదయం సిద్ధిస్తుంది దేశానికి ఐదుసంవత్సరాల భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర ఏడు రోజుల పండుగగా చిత్రిస్తున్న ఏకాంకిక ఈ రచన )

బృందగానం

జయ జననీ ! జయ జననీ !
జయ జయ భారత జననీ !
జయ సమస్త నరమానవ
జాతుల కేకైక జనీ !
వాత్సల్యములోన స్వపర
వైఖరి దాటిన మేటీ !
కూర్మి చూపుటలో స్వేచ్ఛ
కోల్పోయిన బోటీ !
ప్రేమతోనె జయింతు మిక
పెరసైన్యము సర్వం !
హృదయమ్ములు మారనిచో
వదిలింతుము గర్వం !

( త్రివర్ణ పతాకం ధరించి, బృందగానం చేస్తున్న యువతీ యువకులపై హఠాత్తుగా తెల్లసైనికులు విరుచుకుపడతారు లాఠీ చార్జీచేస్తారు, స్వాతంత్ర్య యోధినీ యోధులు ఆ దెబ్బలకు నేల కొరుగుతారు ఎవ్వరూ పారిపోరు పతాక ధరించివున్న యువతి కోపంతో ఉగ్రకాళీరూపం ధరిస్తుంది రంగం రక్త కాంతితో జిగేలు మంటుంది తెల్లసైనికులు హఠాత్తుగా ఆగి, బెదిరి, వెనుకకు పోతారు. )

*తెరలో ఒకకంఠం*

మా టొకటి చాలు మనసున్న మానవుడికి,
పశువు కైనచో దెబ్బ తప్పదెటులైన,
క్రూరజంతువు నొంపగా గోరెదేని
మరతుపాకిని పట్టుట మరచిపోకు !

*తెరలో మరోకంఠం*

తగిలినది నేలో, కొండో ! స్వాతంత్ర్య నౌక
ఒడ్డు చేరుటో, మున్గుటో ! యువకులార !
బ్రతుకుటో, చచ్చుటో - తేలవలసినట్టి
సమయ మేతెంచె ! భారతజనని పిల్చె !

*తెరలో ఇంకోకంఠం*

పిలిచినవాడు గాంధి ! మన
పెద్దల దీమన మెల్ల, భావికాం
తుల బల మెల్ల దమ్ము గొని,
శత్రువులన్ గెలువన్వలెన్ త్వరన్,
అలసత మోస మౌను, ధర
తావని బుట్టిన స్త్రీలు, పూరుషుల్,
చలమున లెండు ! తాకు డచ
లమ్ముల వోలె సమస్త వైరులన్ !

[పతాక ధారిణి చలిస్తుంది పతాకను గిరగిరా త్రిప్పుతుంది పడిపోయివున్న యువతీ యువకులంతా నిద్రలోనుంచివలె లేచి నిలబడతారు — ఉత్తేజంతో]

*పతాక ధారిణి*

సత్యము అహింస అస్త్రశస్త్రములు కాగ,
తరుముకొని వచ్చినామింతవరకు పగర,
హింసతోగాని హింస నశించునట్లు
లేదు, సాయుధులై యింక లెండు ప్రజలు !

కర్రలో కత్తిపిటలో — కలిగినట్టి
వెట్టివో — చేతగొని నిల్తుమేని మనము,
శత్రుదేశ మదెట్టి పిశాచమైన
తోక ముడవదె ? పొలిమేర దూకిపోదె ?

(జై భారతమాతకు, జై మాహాత్మాగాంధీకి, జై ఆగస్టు విప్లవానికీ, వందేమాతరం — అనే నినాదాలతో వలంటీర్ల బృందం ఒక ప్రక్కకు నిష్క్రమించగా, రెండో ప్రక్కనుంచి ఒక కాంగ్రెసు యువకయోధుడు ప్రవేశిస్తాడు — ఉగ్రంగా )

*యోధుడు*

తరముల్ పెక్కులు పారతంత్ర్య విరయ
ధ్వాంతమ్మునన్ బందియై
భరతోర్వీ జనయిత్రి నేడు పిలుచున్
బాపూజి కంఠమ్ముతో !
త్వరగా పోవలె, కాలయాపన విషా
దాంతమ్ము కావచ్చు, ఆ
ఖరి యత్నమ్మిది ఆర్ష పౌరుష పరీ
క్షా హోమ కుండమ్మునన్ !

*మరొక యోధుడు (ప్రవేశించి)*

బాపూజీ పిలు పాలకించి, మురళీ
వాదమ్మునన్ బోవు గో
గోపవ్రాతము వోలె సాగుడిక త్యా
గుల్ భోగు లేకస్థులై !
రేపన్నట్టిది లేదు దేశహిత కా
ర్యైద్ధ ప్రయత్నమ్మునన్ !
వ్యాపింపన్దగు నేడె వ్యూహరచనా
ప్రాగల్భ్య మాశాంతముల్ !

*వేరొక యోధుడు (ప్రవేశించి)*

"ధర్మంబా ? ఇక వైదొలంగు డనుచున్
తా మొక్క "క్విట్ ఇండియా"
తీర్మానంబును చేసినందులకె గాం
ధీవంటి లోకోత్తరున్
నిర్మాణోత్తమ కార్యశూరు నెటనో
నిర్బంధితున్ జేసి, రీ
కర్మం బింక సహింపజాల, మని లో
గర్జించి నిర్జింపరే !

(తెరలో కల్లోలం రంగంలోని యోధులు ఇటూ అటూ పోగా, మరికొందరు యువకులు ఇటునుంచీ అటునుంచీ ప్రవేశిస్తారు )

*ఒక యువకుడు*

ఆంధ్ర సర్క్యులర్ ప్రజలకు అందజేసి
తా నరస్టయ్యె మన కళా ! ధరణి యెల్ల
దద్దరిల్లెను భారతౌద్ధత్యపటిమ !
ఎత్తివచ్చెను నేతాజి హిందుపౌజు !

*మరొక యువకుడు (ప్రవేశించి)*

తిరుగబడిరి విదేశరాజరికముపయి
స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధజనులు,
నావికులుకూడ క్విట్ ఇండియా వరింప
తెల్లవారి తుపాకీలు తెల్లబోయె !

*ఇంకొక యువకుడు (ప్రవేశించి)*

ఆంగ్లభువినెకా, దద్దాని అబ్బనైన
మాటుయుద్ధాలు సాగించి మాపగలము !
ఉద్యమమ్ము పరాకాష్ఠ నొందె నేడు,
గెలుపు మన దిక, స్వాతంత్ర్య ఫలముమనది !

*వేరొక యువకుడు (ప్రవేశించి)*

బ్రిటిషుసింహాపు గుండెలో రేయిపవలు
బాకువలె గ్రుచ్చుకొనసాగె భారతమ్ము,
భారతమ్మును భారత ప్రజల కొసగ
పంపినది రాయబారము పార్లమెంటు !

(తెరలో హర్షధ్వానాలు రంగంమీది యువకులు ఇటూ అటూ పోగా, క్రొత్త వలంటీర్లు ఇటునుంచీ, అటునుంచీ ప్రవేశిస్తారు : )

*ఒక వలంటీరు*

విడుదలైనారు నాయకుల్, వెంట వెంట
జరిగినవి యెన్నికలు సార్వజనిక ఫణితి !
గెల్చినారలు ప్రజలు, కాంగ్రెసుప్రభుత్వ
ఘనరథమ్ముకు సారథ్యమును వహించె !

*మరొక వలంటీరు*

సీమదొర బూటు కాలరాసిన పతాక
మూడుకన్నుల దైవాని మాడుదన్నె !
ఆశ లడుగంటి, సాష్టాంగ మాచరించి,
మనది మన కిచ్చి మెల్లన చనియె నతడు

*ఇంకొక వలంటీరు*

దేశము రెండుముక్కలయి
తేజము తప్పిన బాధతోడ ఆ
వేశము నొంది యింకను భ
విష్యము త్రుంపగవద్దు, ఎంతయో
క్లేశము పొంది ముక్క లతి
కించిన విస్తరి యిద్ది ! శ్రద్ధతో
దేశజులార ! దీని సరి
దిద్దుక సాగు డఖండ లబ్ధికై !

*తెరలో ఒకకంఠం*

ఆగస్టు తొమ్మిదిని కాంగ్రెసు చేసిన క్విట్ ఇండియా తీర్మానాన్నీ, బాపూజీ ఇచ్చిన చావో - స్వాతంత్ర్యమో ఆదేశాన్నీ పురస్కరించుకొని, ప్రజ్వరిల్లిన స్వాతంత్ర్య విప్లవం విజయవంతమై, ఆగస్టు 15 వ తేదీన భారతకు సంపూర్ణ స్వరాజ్యం సిద్ధించింది శతాబ్దాల తరబడి ఆవరించి ఉన్న దాస్య తమస్సులు విడిపోయినై సంపూర్ణ స్వాతంత్ర్య భానూదయ మయింది ఢిల్లీ రాజధానిపై త్రివర్ణపతాక ప్రతిష్ఠిత మయింది

(రంగంమీద హర్షధ్వానాలు, జై జై నినాదాలు, త్రివర్ణ పతాకాలతో అనేకులు రంగంలోకి వస్తారు రంగంనిండా రంగు రంగుల దీపతోరణాలు ప్రకాశిస్తై పతాకధారిణి వేదికముందుకు వస్తుంది - భారతమాత రూపంలో)

*పతాక ధారిణి*

వేల సంవత్సరాల దాస్యాలనుండి
ముక్తి నొందెను భారతభూమి యెల్ల
నిలుపుకొను డింకనైనను కులము, మతము,
ప్రాంతమను దొంగబుద్ధులు పగుల గొట్టి !
ఇంత విజయోదయము వెన్క - ఎంతత్యాగ,
మెంత యువరక్త మింకెనో - ఎల్ల రెరిగి,
ఎల్లరకు మేలుగా భూమి నేలుకొండు !
ప్రాణములుపోసి నేల కాపాడుకొండు !
నెహ్రూనాయకత్వము లభించినది కనుక,
పంచవర్ష ప్రణాళికల్ పెంచుకొండు !
లోకమున భారతమ్మె ఏకైక శాంతి
సౌఖ్య శోభానిలయ మనసాగిపొండు !

(జయజయధ్వానాల, హర్షోత్సాహాలమధ్య ఏదో హేలి, రంగం పొగమబ్బులతో నిండిపోతుంది తెరలో కలకలం) ,

*తెరలో ఒకకంఠం*

మిత్రత నటించి, యెన్నియో మేళ్ళుపొంది,
ద్రోహమున్ జేసినాడు చీనా ఘాతకుడు !
మన మహాభారతకు రత్నమకుటమైన
హిమనగోప్రాంతమును ముట్టడించినాడు !

(రంగంపై పొగతగ్గిపోతూ వుంటుంది వెనుక కొద్దిమంది వలంటీర్లు బారుతీరి వుండగా, పతాకధారణి దీనవదనంతో నిలబడి వుంటుంది )

*తెరలో మరొక కంఠం*

వేలకొలదిగ భారతవీరు, లరిని
పంచప్రాణాలు పెట్టి నిర్జించినారు !
రాయలను బోలు తెన్గువీరాగ్రమణులు
తల్లిపాదాలకడ నిత్యహల్లకములు!

(అంత మిలటరీ దుస్తులతో ఇద్దరు వీరులు సాయుధులై, చెరొకవైపునుంచి గంభీరంగా ప్రవేశించి, పతాకధారిణికి వందనం చేసి నిలబడతారు అంతా సావధానులవుతారు )

*ఒక వీరుడు*

భగవత్సింగులవంటి యోధుల ననిన్
బల్వెట్టి, నేతాజి వం
టి గుణాధిక్యుల గోలుపోయి, మరి, గాం
ధీ వంటి లోకోన్నత
ప్రగతి ప్రాభవమూర్తి జంపుకొని, ని
ల్వన్ గంటి మేదీప్తికై ?
జగతీ ! నీ మకుటాగ్ర రత్నహిమవత్
శైలమ్ము పోనిత్తుమే ?

*రెండో వీరుడు*

రాయలువంటివారు పది
లక్షలె ? నల్వదికోట్లు నీపద
చ్ఛాయల ! ఇప్పుడే వెడలి,
చైనుల గొట్టెద మాజ్ఞయిమ్ము ! నూ
త్నాయుధకోటి గల్గు నిపు
డాత్మభయ వ్యధలేదు, తల్లి ! నీ
గాయము మాని, విశ్వశుభ
గత్యము చేకురు భద్రరాజ్యతన్ !

(మబ్బులు పూర్తిగా విడిపోతై వందేమాతరం నినాదాలుమిన్ను ముట్టుతై జాతీయ గీతాగానతరంగాలు దశదిశలకు వ్యాపిస్తై ) ★




## ఆలిండియా రేడియో-వాయిస్ ఆఫ్ అమెరికా ఒప్పందం

ఆగ్నేయాసియా దేశాలలో చైనా ప్రచారాన్ని ఎదుర్కొనడానికి వీలుగా కలకత్తా సమీపంలో 1000 కిలోవాట్ల రేడియో ట్రాన్స్మీటర్‌ను నెలకొల్పడానికై ఆలిండియా రేడియో-వాయిస్ ఆఫ్ అమెరికాల మధ్య ఒప్పందం జరిగింది

ఈ విషయంపై దేశంలో వాద ప్రతివాదాల దుమారం రేకెత్తింది ఈ ఒప్పందం ప్రకారం దిగువ పేర్కొన్న షరతులకు లోబడి వాయిస్ ఆఫ్ అమెరికా యీ ట్రాన్స్మీటర్‌ను ఇస్తుంది (అ) వాయిస్ ఆఫ్ అమెరికాకు తమ ప్రసారాలను రిలే చేయడానికి వీలుగా ప్రతిరోజూ 3 గంటల వ్యవధి ఇవ్వడం, (ఆ) పాకిస్తాన్ భాషలయిన బెంగాలీ, ఉర్దూలలో యీ ట్రాన్స్మీటర్ నుంచి ప్రసారాలను అనుమతించకపోవడం

ముందుగానే తెలియకపోవడం కారణంగా యీ ఒప్పందంవార్త దేశంలో కొద్దిగా ఆశ్చర్యాన్ని కలిగించింది

తత్కారణంగా అనేక వర్గాలనుంచి యీ ఒప్పందంపై విమర్శలు, వ్యాఖ్యలు జరిగాయి ఒప్పందం సరిఅయినదని చెప్పడానికి కూడా కొన్ని ప్రయత్నాలు జరిగాయి అయితే ఇది అపోహలకు, అసంతృప్తికి దారితీసిందని ఒప్పుకోవాలి తుదకు యీ ఒప్పందం విషయం యేమవుతుందో సరిగా తెలియరావడం లేదు

ఈలోగా ఒప్పందానికి అనుకూలంగానూ, ప్రతికూలంగానూ సబబైన వాదనలు జరుగుతున్నాయి చైనా టిబెటులో నెలకొల్పిన ట్రాన్స్మీటర్ ద్వారా మన దేశంపై దుష్ప్రచారం సాగిస్తున్న దృష్ట్యా దానికి విరుగుడుగా మన ప్రచార ప్రసారాలకై శక్తివంతమైన ట్రాన్స్మీటర్ ఉండడం ఎంతో అవసరమని వాదిస్తున్నారు ఇప్పుడు వాయిస్ ఆఫ్ అమెరికాతో కుదుర్చుకున్న ఒప్పందం ద్వారా తప్ప అటువంటి ట్రాన్స్మీటర్‌ను సేకరించడం సాధ్యం కాదనేది సుస్పష్టం ఈ ఒప్పందమే జరగని పక్షంలో ఇటువంటి శక్తివంతమైన ట్రాన్స్మీటర్‌ను భారతదేశం 5-7 సంవత్సరాలకాలంలో కూడా పొందగలగదు అది లభించేవరకూ చైనా దుష్ప్రచారాన్ని ఎదుర్కొనే అతిముఖ్యమైన సమస్య అనిశ్చితంగా మిగిలిపోయేది దీని ఫలితంగా ప్రచారరంగంలో భారతదేశం బలహీనమవుతుందనే విషయం సుస్పష్టం తద్వారా ప్రత్యేకంగా చైనాతో వచ్చిన సరిహద్దు వివాదంలో భారతదేశం తన వాదన విషయంలో మరీ బలహీనమయ్యేది మన వద్దఉన్న ట్రాన్స్మీటర్లు మన ప్రసారాలను మన సరిహద్దు ప్రాంతాలవరకే తీసుకెళ్ళలేనప్పుడు, ఆగ్నేయాసియాదేశాల ప్రజలపై చైనా చేసే ఏకపక్షప్రచారం ప్రభావం ఎంతగా ఉంటుందో తేలికగా ఊహించుకోవచ్చు ఇటువంటి స్థితిలో వాయిస్ ఆఫ్ అమెరికాతో జరిగిన ఒప్పందం సహేతుకమైనదే కాక ఆచరణ యోగ్యమైంది కూడా అంతేకాక ఎట్టి పరిస్థితులలోనూ ఇది తటస్థ విధానానికి భంగకరం కాదు ఈ సందర్భంలో మరో తటస్థ దేశమైన సిలోనును తీసుకోవచ్చు ఈ దేశానికి కూడా యిదే విధమైన ఒప్పందం వాయిస్ ఆఫ్ అమెరికాతో ఉంది అంతమాత్రాన దాని తటస్థవిధానానికి యే విధంగానూ భంగం వాటిల్లలేదు ఇదీ యీ ఒప్పందాన్ని సమర్థించేవారు చేసే వాదన ఈ ఒప్పందంవల్ల దేశ తటస్థ విధానాన్ని స్పష్టంగా విడనాడడమే అవుతున్నదని ఒప్పందాన్ని వ్యతిరేకించేవారి వాదన ఈ ట్రాన్స్మీటర్ వల్ల ఎటువంటి ప్రచార లాభాలు ఒనగూడినప్పటికీ భారతదేశ అలీనవిధానం పటిష్ఠమైంది కాదనే చైనా ఆరోపణ యీ ఒప్పందంవల్ల మరింత బలపడుతుందని కూడా వారు వాదిస్తున్నారు అంతేగాక అమెరికా సామ్రాజ్య వాదులతో భారతదేశం కూడా వాస్తవంగా భాగస్వామేననీ, అందువల్ల ఆగ్నేయాసియా దేశాలు భారతదేశాన్ని స్నేహితునిగా, కామ్రేడుగా చూడకూడదనీ చైనా ప్రచారం చేసే ఆస్కారం యీ ఒప్పందంవల్ల కలుగుతుంది వాయిస్ ఆఫ్ అమెరికా ప్రసారాలను యీ ట్రాన్స్మీటర్ రిలే చేయడంపై ఎటువంటి పరిమితులు, నిర్బంధాలు లేకపోవడం వల్ల అదే స్టేషన్‌నుంచి వాయిస్ ఆఫ్ అమెరికా, ఆలిండియా రేడియోలు పరస్పర విరుద్ధమైన ప్రసారాలు చేసే అవకాశం కూడా ఏర్పడవచ్చునని వీరి వాదన ఇది అసంతృప్తికరమైన వ్యవహారమనీ, సర్వస్వతంత్ర ప్రతిపత్తిగల దేశం సహించరానిదనీ వారి వాదన సిలోన్‌ను గూర్చి ఎక్కువగా వ్యాఖ్యానించకుండా-విధానాలకుతోడు ప్రత్యేక సందర్భంలో ప్రత్యేక దేశపరిస్థితిని గూర్చి పరిశీలించడమే వాస్తవిక విషయమనీ, ఒక దేశ సారూపసామ్యాలు మరో దేశానికి వర్తించనూ వచ్చు, వర్తించకపోనూ వచ్చుననీ వారి వాదన వాయిస్ ఆఫ్ అమెరికాతో జరిగిన ఒప్పందంవల్ల భారతదేశ అలీన

విధానంలో కొంతమార్పు గోచరిస్తున్నదని అమెరికా బ్రిటన్‌లోని అనేక పత్రికలు చేసిన వ్యాఖ్యానాలను కూడా వీరు ఉదహరిస్తున్నారు

విదేశ పత్రికలలో కలిగింపజేసిన యీ ప్రభావం ప్రాతిపదికగా పశ్చిమరాజ్యాల దృక్పథంలోనూ, రష్యా దృక్పథంలోనూ భారతదేశ అలీన విధానం గూర్చి తప్పని సరిగా మార్పు వస్తుంది కాబట్టి యీ ఒప్పందాన్ని రద్దుచేయడమే ఏకైక మార్గమని వారి వాదన

వాయిస్ ఆఫ్ అమెరికాతో జరిగిన యీ ఒప్పందం వ్యవహారం మనకు తీవ్ర అసంతోషకర పరిస్థితిని కల్పించిందని అంగీకరించక తప్పదు అలీనవిధానం నిస్సందేహంగా అతిక్లిష్టమైన మార్గం ఇది వేరు విధంగా ఉంటుందని ఎవ్వరూ భావించలేరు.

ఈ వ్యవహారం అతిసున్నితమైనది. దీనిని అతిరహస్యంగా గానీ, యాదృచ్ఛికంగా గానీ నిర్వహించాలనడంలో సందేహంలేదు విధానాల విషయంలోనూ, వాటి ప్రయోజనాల విషయంలోనూ మనం శీఘ్ర గ్రాహ్యులమే ఈ ఒప్పందం విషయంలో అప్పుడే పునరాలోచన జరుగుతున్నట్లు తెలుస్తున్నది ప్రస్తుతం ఉన్న రూపంలోనే ఒప్పందాన్ని అంగీకరించడం, లేక ఒప్పందం మొత్తాన్ని రద్దుచేయడం వంటి తీవ్రచర్యలు తీసుకోవడాన్ని బహుశా జరపరాదనేది విశదమే ఈ ఒప్పందాన్ని తగు విధంగా మార్చడమే మనకు ఉన్న ప్రత్యమ్నాయ మార్గం వాయిస్ ఆఫ్ అమెరికా అంగీకరించే పక్షంలో భారతదేశం ఆ ట్రాన్సిమీటర్‌ను పూర్తిగా కొనుగోలు చేయవచ్చు అయితే యిది సాధ్యం కాదనే వార్తలుతెలుపుతున్నాయి యీ క్రొత్త ఎ. ఐ. ఆర్. ట్రాన్సిమీటర్ ద్వారా వాయిస్ ఆఫ్ అమెరికా రిలే చేసే ప్రసారాల తీరును గూర్చి అంగీకారానికి వచ్చే మసాధ్యమైన మార్గం మరొకటి కేవలం ఆగ్నేయాసియాలో చైనా దుష్ప్రచారాన్ని ఎదుర్కోడమే యీ ట్రాన్సిమీటరు, ప్రసారాల ముఖ్య ఉద్దేశం అయినప్పుడు ప్రసారాల తీరు పరిమితుల విషయంలో అంగీకారానికి రాలేకపోడంలో కారణం కనిపించదు ఉద్దేశంలో ఏకీభావం ఉన్నదని నమ్మకం కలిగినప్పుడు, అనుసరించే మార్గంలో కొద్దిపాటి తేడాలు ఉన్నా అంగీకారానికి రావడం సాధ్యమే. అతిత్వరలోనే యీ విధమైనట్టి పరిష్కారం కుదురుతుందనే ఆశించబడుతున్నది

ఈ ఒప్పందాన్ని యే మాత్రం మార్చే ఉద్దేశంలో అమెరికా లేదనీ, పై పెచ్చు భారతదేశం అటువంటి ప్రయత్నం చేస్తే అమెరికా ఇచ్చే ఇతర సహాయాలపై దీని ప్రభావం ఉంటుందనే వార్తలు వినవచ్చాయి. ఈ వార్తలు అమెరికన్ అధికారుల మనస్తత్వాన్నే వాస్తవంగా ప్రతిబింబింప జేసే పక్షంలో అవి సహాయకారికావనే అంగీకరించాలి ఏ ప్రజాస్వామ్య దేశంలోనైనా ప్రాథమిక సూత్రాలకు కట్టుబడి ఉండడం, ప్రజాభిప్రాయాన్ని మన్నించడం అతి ముఖ్యమైనవి ఈ విషయాలలో ఎంతటి మూల్యాన్నైనా చెల్లించి యీ కష్టాలను ఎదుర్కోవాల్సి ఉంటుంది వాయిస్ ఆఫ్ అమెరికా ఒప్పందంపై ఉత్పన్నమయ్యే ఈ విషయాలను అమెరికా ఆకళింపు చేసుకుంటుందనే ఆశించబడుతున్నది

## జాతీయ అత్యవసర పరిస్థితి స్వరూపం

గత కొద్దిరోజులనుంచి ఇండో - చైనా సరిహద్దు పొడవునా చైనా తన సేనలను సమీకరిస్తున్నదనే వార్తలు వస్తున్నాయి. ఇది అశుభకరమైన పరిణామం. జాతి జాగృతమైనది అమెరికాలో పర్యటిస్తున్న మన సాయుధ దళాధిపతి తన విదేశ పర్యటనా కార్యక్రమాన్ని రద్దుపరచుకుని స్వదేశానికి వచ్చారు. చైనా వారు తమ దుష్ట స్వభావాన్ని వదులుకోలేదని దీనివల్ల స్పష్టమవుతుంది ఏ క్షణంలోనైనా యుద్ధం చెలరేగవచ్చునని ఎవ్వరైనా ఆశించవచ్చు.

ఇటువంటి కలవరపాటు కలిగించే క్లిష్ట పరిస్థితులలో అత్యవసర పరిస్థితి అవసరమా కాదా అనే విషయంపై కొంత కాలంగా జరుగుతున్న రభస అప్రస్తుతమైనదీ, శోచనీయమైనదీ అని చెప్పవచ్చు. జాతీయ అత్యవసర పరిస్థితి దేనితోను సంబంధం లేనిదికాదు. అది ఆకాశంనుంచి ఊడిపడలేదు, గత 15 సంవత్సరాలనుంచి స్వతంత్ర భారతంలో జరుగుతున్న పరిణామాలను ఇది వాస్తవంగా సూచిస్తుంది.

మన స్వాతంత్ర్యం దానికదే మనగలుగుతుందనే అలసభావంతో మనం ఉన్నామనే విషయం మన గతాన్ని గూర్చి జాగ్రత్తగా మననంచేసుకుంటే వెంటనే తెలుస్తుంది. మనం బుద్ధి పూర్వకంగానే జాతి మనస్తత్వాన్ని శాంతికాల అభివృద్ధి వైపు మళ్ళించాం అంతేగాక విదేశీ దురాక్రమణ జరగదనీ, జాతి ఎల్లప్పుడూ సమైక్యంగా ఉంటుందనీ భావించాం గత 15 సంవత్సరాలుగా ఉన్నత జీవన స్థాయిని సాధించాలనే దీక్షతో కృషిచేస్తున్న మనకు ఒక్కసారిగా దీనికి విరుద్ధంగా వ్యవహరించాల్సిన అవసరం ఏర్పడడంతో మనలో కొంత సంచలనం కలిగింది యీ సంచలనం ఎంతో

కష్టంమీద గానీ సర్దుకోదు ప్రత్యేకంగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అనుభవిస్తున్న ప్రజాస్వామ్య దేశాలలో ఇది మరింత క్లిష్టమైనది అందుచేత ఆత్యయిక పరిస్థితిని ప్రకటించడం అనేది కేవలం రాజ్యాంగం క్రింద యాంత్రికంగా జరిగే చర్యకాదు కేవలం చైనా దురాక్రమణ కారణంగా వెనువెంటనే ప్రతిఫలించిన ఫలితమూకాదు దానికన్నా యింకా ఎక్కువే అర్థం వున్నది ఇది ప్రజల వైఖరిలోని ముఖ్యమైన మార్పును తెలియజేస్తుంది లేదా, కనీసం అలాంటి మార్పును తెలియ జేయవలసైనా వుంటుంది.

చైనా దురాక్రమణవల్ల మనకు స్పష్టపడినదేమిటంటే స్వేచ్ఛను పొందడంఅంటే నిజమైన అర్థం స్వేచ్ఛగా వుండడం కాదు మన సరిహద్దులు అబేధ్యమైనవేమీ కావుగదా. అందుచేత మనరక్షణబలాలను మనం పూర్తిగా పటిష్ఠం చేసుకుంటేనేతప్ప మనకు మరోఆలోచనగాని, వ్యాపకంకాని వుండకూడదు మనం విదేశీయుల పరిపాలనక్రింద వున్నప్పుడుస్వాతంత్ర్యాన్ని సాధించడమే మనకు ఏకైకధ్యేయంగా వుండేది ఇప్పుడు ఆ స్వేచ్ఛ మనచేతుల్లోనుండి జారిపోయే ప్రమాదం సంభవించింది ఆ స్వేచ్ఛను పరిరక్షించుకోవడానికి తిరిగి మనకు పూర్వపు ఏకాగ్రచిత్తం అవసరం ఈ ధ్యేయంనుండి మరోవైపుకు తొలగిపోవడం అంటూ వుండకూడదు దేశంయొక్క ఆత్యయిక స్థితి అంటే యిదే.

ప్రస్తుతపు యీ విదేశ దురాక్రమణ సవాలు ముఖ్యంగా రాజకీయ సైనిక విషయాలకు సంబంధించినది దేశం ఆపదలో వున్నప్పుడేగాక, ఆ ఆపద సమీపంగావున్నపుడుకూడా ఆత్యయిక పరిస్థితి ప్రకటించబడుతుంది. అయితే ప్రమాదం సమీపంగా వున్నదని ఎప్పుడు చెప్పబడుతుంది ? ఈ ప్రమాదం సన్నిహితంగా వున్నదన్న ఊహకుఅర్థం, ముందుముందు ఆ ప్రమాదం నిజంగామనకు సంభవిస్తుందనా ? ఒకవేళ ఏ కారణంచేతనన్నా అలా జరుగకపోతే శత్రుప్రమాదం సమీపంగా వున్నదన్న మనఊహ తప్పని అనడమా ? ఏ మాత్రం విజ్ఞత గలవాడైనా దీనికి అంగీకరించడు అందుచేత గతంలోపొందిన అనుభవాలు, దూరదృష్టిగల ఆలోచనలు, అంచనాలతో పాటు కొన్నిరాజకీయ, సైనిక విషయాలను బట్టే యీ ప్రమాదం దగ్గరగావున్నదీ లేనిదీ తెలుస్తుంది ఆ రంగంలో అనుభవశాలురైన వారి సలహాననుసరించి ప్రభుత్వమే యీనిర్ణయాన్ని చేపట్టాలి ప్రభుత్వం ఒక అభిప్రాయానికివచ్చి, ఆ విషయాన్ని దేశంలోని పార్లమెంటుకు మాత్రమే అనుమతికై పంపించాలి అంతేగాని యీ విషయం మారుమూల వీధుల్లోనూ, ప్రదర్శనల్లోనూ నిర్ణయించవలసినదికాదు ఇక్కడొక అంశం గమనార్హం. యధార్థమైన ఆక్రమణ, ప్రశాంతమైన సాధారణ పరిస్థితి–ఈ రెండింటికీ మధ్య అనేకదశలు ఉండే అవకాశం ఉంది వాటిలో 'సమీప ప్రమాదం' ఒకటి సంఘటనలనేవి, ఎప్పుడూ ఒక కొసనుండి మరోకొసకు హఠాత్తుగా చలించవు అందువల్లనే, 'జాతీయ అత్యవసర పరిస్థితి' అనేది వున్నదీ మరో విధంగా లేదుకూడా ఇది అతి సూక్ష్మమైనది విశదంగా వ్యక్తం చేయవలసినది, సాపేక్షమైనదీనూ అంతే తప్ప యిందుకు భిన్నంగా వుండడానికి వీలులేదు ఆత్యయిక స్థితిని అంతం చేయాలనేవారు యీ పై అంశాలను గుర్తిస్తున్నట్టు లేదు

ఆత్యయిక పరిస్థితిలో యిచ్చే సడలింపు, ఆ సమయంలో తొలగిన ఆపదను బట్టి వుంటుంది సమయాన్నిబట్టి సడలింపులు వున్నప్పటికీ సడలింపు పేరుతోగాని, మరో విధంగాగాని ఏమీ చేయరాదనే విషయం సుస్పష్టం ఎందువల్లనంటే దీనికి. ఆత్యయిక పరిస్థితిలో ఐకమత్యాన్ని, చురుకుదనాన్ని, ఏకాగ్రచిత్తాన్ని బలహీనపరిచే గుణంవుంది ఆ రకమైన చర్య ఏమైనా ఆత్యయిక స్థితిని మరింతగా క్లిష్టవంతం చేయవచ్చు ఉపఎన్నికలను జరిపించడంతో పాటు ఎన్నో నిర్ణయాలను యీ విషయాన్ని దృష్టిలో వుంచుకొనే నిర్ణయించవలసి వుంటుంది. దేశ ఆత్యయిక పరిస్థితిలో ప్రభుత్వ విధానాలను సవరించడం కూడదు నిజానికి ప్రభుత్వ విధానాల సమర్థతను పరిశీలించడానికి యీ ఆత్యయిక పరిస్థితి కేవలం ఒక కొత్త అన్వయం.

ఈ ఆత్యయిక పరిస్థితివల్ల ప్రత్యక్షంగా ఏమన్నా ఉపయోగం వుంటేనేతప్ప యీ పరిస్థితిని కొనసాగించడంలో అర్థంలేదు ఆత్యయికస్థితి, పరిస్థితుల నిజస్వరూపాన్ని ప్రతిబింబించేదేగాక ఆ పరిస్థితుల ఫలితాల నివారణకు సహాయకారిగాకూడా వుండాలి పైకి విరుద్ధంగా కన్పిస్తున్నట్టు, యీ ఆత్యయిక స్థితియొక్క ఉద్దేశ్యం, ఆ పరిస్థితినే తొలగించాలి అంటే ఆత్యయికస్థితి, అది చేయదలచుకొన్న కార్యాలను సాధించేందుకు తగిన వాతావరణాన్ని సృష్టించుకోవాలన్న మాట ఇదే జాతీయ ఆత్యయిక పరిస్థితి నిజస్వరూపమని నా అభిప్రాయం

ఇప్పుడు దేశంయావత్తూ యీ స్వరూపాన్ని గుర్తించగలిగేటట్లున్నదా లేదా అని మనలో మనం ప్రశ్నించుకుందాం దురదృష్టవశాత్తూ దీనికి సమాధానం 'లేదు' అని చెప్పాల్సివుంటుంది ప్రతి వ్యక్తీ శాంతి కాలంలోవలే ఎంతవరకూ తన

ఒక్కడివిగూర్చే ఆలోచిస్తూ స్వప్రయోజనాలకై ప్రయత్నిస్తూ వుంటాడో, అంతవరకూ జాతీయ ఆత్యయికస్థితి స్వరూపం తరచుగా వుంటూనే వుంటుంది అందుచేత, దేశంయొక్క భవిష్యత్తుకై ఎన్ని లక్షల మంది స్వప్రయోజనాలనో ఏకంచేయడమే ఆత్యయికస్థితిని అంటిపెట్టుకొనివున్న ముఖ్యోద్దేశం ఏ పార్టీకూడా దీనికి విరుద్ధంగా వుండడానికి వీలులేదు ఎంత గొప్ప వ్యక్తి అయినా, అతడెట్టి ఉన్నతపదవి నధిష్ఠించినా స్వార్థాన్ని రూపుమాపడానికి ప్రయత్నించాలి దేశ ఆత్యయికస్థితి ఈ విషయాన్నే తెలియజేస్తున్నది మన నిర్ణయాలను, చేతలను యీ స్వరూపాన్నిబట్టి పూర్తిగా సవరించుకోవలసివున్నది

## విమాన రక్షణ ఒప్పందం

బాగా శక్తివంతమైన రాడార్లు, కమ్యూనికేషన్ల యంత్ర సామగ్రి వాడకంలో భారత వైమానిక బలంతో సమిష్టి విమాన విన్యాస శిక్షణలను సాగించడానికి భారతప్రభుత్వంతో జరిగిన ఒప్పందం మేరకు అమెరికా, బ్రిటన్‌లు త్వరలోనే "ఉన్నత ప్రదర్శన" యుద్ధ విమానాలను పంపగలవు

ఈ విన్యాసాలు కొన్ని వారాలపాటు సాగుతాయి చైనా భారీ ఎత్తున విమాన బలంతో దండెత్తితే మన నగరాలను యీ ప్రమాదంనుండి రక్షించడానికై భారత విమాన దళాన్ని పటిష్టం చేసేందుకు యీ విన్యాసాలు ఉద్దేశించబడ్డాయి

భారతదేశం మీద చైనా దండయాత్రను గాని సాగించితే భారతదేశానికి తన రక్షణలో యీ దేశాలు సహాయపడాలనే కట్టుబడి యీ విన్యాసాలవల్ల ఏమీ లేదని అమెరికా, బ్రిటన్ దేశాలు స్పష్టపరిచాయి అయినా, అటువంటి అవసరమేగాని ఏర్పడితే భారత ప్రభుత్వంతో సంప్రదించడానికి ఒప్పుకున్నాయి. భారత ప్రభుత్వం విమాన రక్షణతో సహా తన దేశరక్షణ విషయంలో బాధ్యత పూర్తిగా తనదేనని వ్యక్తంచేసినది

ఈ వివరణలనుబట్టి యీ రక్షణ సహాయంమీద రాజకీయ తంత్రాల ప్రభావం ఏమీ వుండదనే విషయం వ్యక్తమవుతున్నది విదేశ దురాక్రమణను తనంత తానుగా ఎదుర్కొంటూ, తన ప్రాథమిక సూత్రాలకు కట్టుబడినట్టి ఇండియావంటి దేశానికి యీ సహాయం అవసరమే

## అణ్వస్త్ర పరీక్షల నిషేధం, నిర్యుద్ధ ఒడంబడిక సూచనలు

గత మాసంలో ప్రాక్పశ్చిమ దేశాల మధ్య ప్రచ్ఛన్న యుద్ధంలో చాలా అభివృద్ధికరమైన మార్పులు జరిగాయి సోవియట్ ప్రధాని కృశ్చేవ్, వాతావరణంలోనూ, సముద్ర గర్భంలోనూ అణ్వస్త్ర పరీక్షల నిషేధాన్ని గూర్చిన పశ్చిమ రాజ్యాల సూచనను అంగీకరించడానికి తన సమ్మతిని తెలియజేశారు అయితే రష్యా, 'నాటో' దేశాలమధ్య నిర్యుద్ధ ఒడంబడికకు పాశ్చాత్య దేశాలు అంగీకరించవలసి వుంటుంది స్థల పరిశీలనలవల్ల విదేశ గూఢాచారులకు తమ రహస్యాలు వెల్లడి అవుతాయి గనుక తన దేశం అలాంటి పరిశీలనలకు ఎంత మాత్రం అంగీకరించదు అని ఆయన అన్నారు రష్యా శాంతియుత సహజీవనాన్ని వాంఛిస్తున్నదని ఇది నిర్యుద్ధ ఒడంబడికవల్ల సాధ్యంకాగలదని ఆయన పునరుద్ఘాటించారు జర్మను సమస్య పరిష్కారంకూడా యూరపులో ప్రతిష్ఠంభనాన్ని తగ్గించి శాంతి స్థాపనకు దోహదకారికాగలదు రష్యాతో పాక్షిక అణ్వస్త్ర పరీక్షల నిషేధం ఒప్పందంపై అంగీకారానికి నాటో, వార్సా రాజ్యాలమధ్య నిర్యుద్ధ సంధిని ఒక షరతుగా వుంచుటకు ప్రెసిడెంటు కెన్నెడీ తన అసమ్మతిని తెలియజేశారు ఆ విధమైన 'కట్టిపడవేసే షరత్తు' నాటో రాజ్యాలకు సమ్మతమైనవి కావు

ఇంతలో ఇంగ్లండు, అమెరికా, రష్యా ప్రతినిధులు అణ్వస్త్ర పరీక్షల నిషేధంపై ఒక ఒప్పందానికి రావడానికి వీలయ్యే అవకాశాలను గూర్చి చర్చించేందుకై సుహృద్భావ వాతావరణంలో మాస్కోలో కలుసుకున్నారు కృశ్చేవ్ నిర్యుద్ధ ఒడంబడికను గూర్చి తన పూర్వపు సూచనలపై అట్టే పట్టుదల చూపుతున్నట్టు లేదు ఇటీవలి వార్తలనుబట్టి పాక్షిక అణ్వస్త్ర పరీక్షల నిషేధంపై ఒక ఒప్పందం జరగవచ్చునని తెలుస్తున్నది ఈ పత్రిక విడుదలయ్యే నాటికి ఆ ఒప్పందంపై సంతకాలు పూర్తి కావచ్చు ఈ ఒప్పందం, భూగర్భంలోని పరీక్షలకు తప్ప మిగిలిన అన్ని రకాల అణ్వస్త్ర పరీక్షల నిషేధానికి వర్తిస్తుంది

అయితే ఫ్రాన్సు ఈ అంశం విషయంలో భిన్నవైఖరి నవలంబించింది ఫ్రాన్సు తన అణ్వస్త్ర శక్తిని పెంపొందించుకోవడానికే నిశ్చయించిన దని ఫ్రాన్సు విదేశాంగమంత్రి పునరుద్ఘాటించినట్లు తెలుస్తున్నది అణ్వస్త్ర పరీక్షల నిషేధానికి వ్యతిరేకంగా ఫ్రాన్సు గైకొన్న నిర్ణయంవల్ల కలిగే సాధకబాధకాలకు ఉత్తరోత్తరా 'నాటో' రాజ్యాలు లోను కావల్సిరావచ్చు అయితే ప్రస్తుతానికి, మాస్కో ఒప్పందం సంపూర్ణ నిరాయుధీకరణ అనే గమ్యం వైపుకు పూనవారిని మరింత ముందుకు తీసుకొని వెళ్ళే ఒక మెట్టు అనవచ్చు ఈ ఒప్పందం స్వాగతం చెప్పదగినది. అయితే దీని సఫలత చాలా వరకు, దురాక్రమణకు వ్యతిరేకంగా ఒడంబడిక సహితంగా గానీ, ఒడంబడిక రహితంగా గానీ ఈ ఒప్పందం

వాస్తవంగా అమలు పరచబడే విధానంపై ఆధారపడి వుంటుంది పోతే అణ్వస్త్ర పరీక్షల నిషేధంపై చర్చలను ప్రారంభించిన దేశాలలో ఈ ఒప్పందంపై అనేక రకాల విమర్శలు జరగడం తథ్యం. ఈ ఒప్పందం పట్ల చైనా వైఖరి యేమిటో సుస్పష్టమే అమెరికాలో కూడా ఒప్పందం లోని ఏదో ఒక అంశంపై విమర్శలు జరగడం ఖాయం. ఏమైనప్పటికీ చిత్తశుద్ధి, సుహృద్భావంతో కూడిన వాతావరణాన్ని పెంపొందించినట్లయితే చైనావంటి యుద్ధోన్మాద దేశాలు వున్నప్పటికీ ప్రపంచానికి, అణ్వస్త్రాల ఉపద్రవం నుంచి విముక్తి లభిస్తుందనడంలో సందేహం లేదు

## మాస్కో చర్చలు

సిద్ధాంత విషయాలపై చర్చలు జరిపే నిమిత్తం గతనెలలో సోవియట్, చైనా కమ్యూనిస్టు పార్టీల ప్రతినిధులు మాస్కోలో సమావేశమయ్యారు సోవియట్ బృందానికి మైఖేల్ సుస్లోవ్, చైనా జట్టుకు టెంగ్ హిస్యావ్ పింగ్ నాయకత్వం వహించారు ఈ చర్చలు ఆసాంతం అతి రహస్యంగా జరిగాయి అయితే ఈ రెండు పార్టీల మధ్య విభేదాలు తీవ్రరూపం దాల్చాయనేది సుస్పష్టమే చైనా వారు మొండివాదనలతో ప్రచ్ఛన్న పోరాటానికి దిగడంతో వీటి మధ్య అంతరం మరింత విశాలమైపోయింది సోవియట్, చైనా కమ్యూనిస్టు పార్టీల ప్రతినిధుల మధ్య చర్చలు ప్రస్తుతానికి ముగిశాయి చైనా కమ్యూనిస్టు పార్టీ రష్యా కమ్యూనిస్టు పార్టీకి వ్రాసిన లేఖలోని రష్యాకు సంబంధించిన భాగాల ప్రతులను పంచిపెట్టడం ద్వారా విద్రోహక కార్యకలాపాలకు దిగినందుకుగాను ముగ్గురు చైనా అధికార్లను రష్యా ప్రభుత్వం బహిష్కరించవలసి వచ్చింది ఈ విధంగా రష్యాచే బహిష్కరించబడిన దౌత్య ఉద్యోగులకు పెకింగ్‌లో అఖండ స్వాగత మివ్వడం రష్యావారికి మరింత ఆగ్రహం కలిగించింది

భారతదేశంపై చైనా జరిపిన దాడిని రష్యా సమర్థించక పోవడం వల్ల, క్యూబా విషయంలో రాజీ జరగడంవల్ల చైనా పెచ్చు మీరిపోయి, రష్యాను తీవ్రంగా ప్రతిఘటించడం ప్రారంభించింది. అయితే అల్బేనియా, రుమేనియాలు మినహా తూర్పు యూరపు దేశాలన్నీ కూడా రష్యానే పూర్తిగా సమర్థిస్తున్నాయనే విషయాన్ని ఈ సందర్భంలో గుర్తుంచుకోవలసివుంది

మరో విచిత్రమైన సంగతేమంటే ఇటీవల చైనావారు కృశ్చేవ్‌ను "కామ్రేడ్" అని సంబోధించడంకూడా మానివేశారు అంతేగాదు ఆయనను వారు కెన్నెడీ, నెహ్రూల తరువాత తమ మూడవ శత్రువుగాకూడా పరిగణిస్తున్నారు వారి ఉన్మత్త స్థితి ఆ దశకు వెళ్ళింది పెల్లుబికిన వారి వెర్రిక్రోధానికి సంబంధించి చెప్పవలసిన ఆసక్తికరమైన విషయమేమిటంటే, చైనా రష్యాలమధ్య విభేదాలకు కారకుడుగా ప్రధాని శ్రీ నెహ్రూను వారునిందిస్తున్నారు ఎంత విద్వేషంతో, విస్పృహతో వారు మన ప్రధానమంత్రిని నిందిస్తున్నారో అవి నిజంగా గమనించ దగినవి సాధారణంగా ఏదైనా విధానపు మంచి చెడ్డలను శత్రువుల అభిప్రాయాలనుబట్టినిర్ణయించడం సమంజసంకాదు. అయితే ఈ విషయంలో మాత్రం, చైనా నాయకులు, విద్వేషం, విస్పృహలతో కూడిన తమ నిందారోపణలతోనే అయినా భారత దేశ విధానాన్నీ, రాజకీయజ్ఞతనూ అయిష్టంగానే మెచ్చుకోవలసివచ్చినట్లు కనిపిస్తుంది ఇది వాస్తవం అనలేనంత పొగడ్తగా వుందని కొందరు అనవచ్చు కాని చైనీయుల ఈ ఆగ్రహానికి ప్రేదైనా అర్థవంతమైన కారణాన్ని చూపగలిగే పర్యంతం దీనిని మనం కేవలం దూషణగానే త్రోసి పుచ్చడానికి వీలులేదు దీర్ఘంగా ఆలోచించినట్లయితే స్నేహానికీ, శాంతికీ కట్టుబడిన ఇండియా, యుద్ధోన్మాద దేశమైన చైనాలలో దేనిని ఎన్నుకోవాలా అన్న సమస్య రష్యాకు, ఎదురైనట్లు కనిపిస్తుంది ఈ విధంగా సిద్ధాంత విషయాలపై జరిగిన చర్చలు, కమ్యూనిజానికి మాత్రమే పరిమితంకాక ఆ పరిధినిదాటి చాలాదూరం వెళ్ళాయి వాస్తవంగా చెప్పాలంటే ఈ సిద్ధాంత చర్చలలో రాజనీతిజ్ఞతకు కూడా అంతుచిక్కని క్లిష్టమైన పెక్కు సమస్యలు ఇమిడి వున్నాయనవచ్చు. భారతదేశపు రాజనీతిజ్ఞతవల్ల మాత్రమే చైనా ఏకాకి కాలేదు కాగా యుద్ధం, శాంతి విషయాలలో భారతదేశం అనుసరిస్తున్న సహేతుకమైన విధానమే ఇందుకుకారణం కాని చైనా దీనిని అంగీకరించదు కనుకనే అది భారతదేశంపై నిందారోపణలకు దిగింది

## వ్యవసాయ రీఫైనాన్స్ కార్పొరేషను

వ్యవసాయ అభివృద్ధికి ఆర్థిక సహాయం చేసేనిమిత్తం నెలకొల్పబడిన వ్యవసాయ రీఫైనాన్స్ కార్పొరేషను అనే నూతన సంస్థకు కేంద్ర ఆర్థిక శాఖామంత్రి జూలై మొదటితేదీన ప్రారంభోత్సవం చేశారు దీనికి అనుమతించబడిన మూలధనం రూ 25 కోట్లు భూమిని సేద్యయోగ్యం చేసుకోవడానికీ ప్రత్యేక పంటలను అభివృద్ధి పరచుకోవడానికి, యాంత్రిక వ్యవసాయానికి పశుపోషణ, పాడిక్షేత్రాలు, మత్స్యపోషణ, కోళ్ళ క్షేత్రాలు మొదలైన వాటి అభివృద్ధికి ఈ సంస్థనుంచి ఆర్థిక సహాయంలభిస్తుంది.

అనుమతించబడిన రూ 25 కోట్ల మూలధనంలో కేంద్రప్రభుత్వంనుంచి, పొందే రు.5

(మిగతా 84 వ పేజీలో)




ప్రాచీన చిత్రకళలో అంతర్జాతీయ చిత్రకళయైన ఆదిమచిత్రకళ పిమ్మట జాతీయచిత్రకళ కళ మారంభమైనది గ్రీసు, ఈజిప్టు, ఆసియాలు ఈ ప్రాచీన చిత్రకళకు ఆటపట్టులైనవి గ్రీకు చిత్రకళ ఈజిప్టు చిత్రకళంత ప్రాచీనచిత్రకళ కాక పోయినను, ఆసియాలో చిత్రకళ అలరారినంత కాలము అలరారనప్పటికిని, పాశ్చాత్యులు ప్ర ప్రథమముగా ఈ చిత్రకళ ద్వారానే ప్రాచీన చిత్రకళలయొక్క విశిష్టతను గ్రహింపగలిగినవారగుటచే వారు ప్రాచీన చిత్రకళలలో ఈ చిత్రకళకే అగ్రతాంబూలమిచ్చిరి

గ్రీకు చిత్రకళ ప్రథమదశలో అన్ని ఆదిమ చిత్రకళలవలెనే యున్నను క్రీ పూ 1100 ల నాటికి తనదైన ఒక ప్రత్యేకతను యేర్పరచుకొనగలిగినది క్రీ పూ 3 వేల సంవత్సరములనాడు అలరారిన క్రీటు, మైసీనియాలు ఈ చిత్రకళకు జన్మస్థానములు

గ్రీకులకు చిత్రకళలో మిగుల అభిలాషయుండెడిది వారి దైనందిక జీవితములో అన్నవస్త్రములతోపాటు చిత్రకళను కూడా ఒక నిత్యావసరమైనదిగానే పరిగణించెడివారు చిత్రకళ వారికి ఒక వెలకట్టలేని వస్తువు ఇతర చిత్రకళలలోని విశిష్టతను గ్రహించి దానిని పరిగ్రహించి తమదిగా దానిని రూపొందించగలుగుటచే గ్రీకు చిత్రకారుల ప్రత్యేకత ప్రాచీన చిత్రకళ లన్నిటి యందువలెనె గ్రీకు చిత్రకళయందు కూడ మతమునకే ప్రధానస్థానము కలదు

అతి ప్రాచీన కాలములో గ్రీకులకు చిత్రకళలో నెంతటి యుదాత్తప్రావీణ్యమున్నదో సప్రమాణముగా గ్రహించుటకవకాశములేదు శిల్పమే తప్ప చిత్రకళ లభ్యముకాలేదు లభ్యమైన శిల్పకళను బట్టి నాటి చిత్రకళావైభవస్థాయిని మనమూహింపవచ్చును అలభ్యమైన చిత్రకళనుగురించి చర్చించుటకన్న లభ్యమైన శిల్పమును గురించి గ్రహించుట మంచిది కావున నీ వ్యాసమున శిల్పమును గురించి వివరించుట జరిగినది గ్రీకులు అన్ని చిత్రకళల యందును నేర్పరులేయైనను శిల్పమునందు వారిని ఇప్పటికిని ఎవరును మించలేరు వారి శిల్పము లన్నియు సాధారణముగ దేవతా ప్రతిమలే అయినను, ఈజిప్టియను విగ్రహములవలె గాక యెంతో సహజముగ జీవకళతో ఉట్టిపడుచు నుండును అంబర వీధిలో విహరిస్తున్న దేవతా విగ్రహములలో ప్రతి కండరపు కదలికను మనము చూడగలము కాని సహజత్వముతో పాటు,

క దివ్యజ్ఞాన సరోజినీదేవి

ఆ ప్రతిమలలో ప్రతిబింబించుచున్న దైవత్వము, నైర్మల్యము మనలను దిగ్భ్రాంతులను చేసి, అవి దేవతా స్వరూపులనెడి విషయము మనకు జ్ఞప్తిచేయును గ్రీకు శిల్పులు సాధారణముగ యువతీ యువకుల ప్రతిమలనే చెక్కెడివారు వృద్ధ, బాలక విగ్రహములందు వారి కభిలాష యుండెడిది కాదు అంతియే కాకుండ వారు యువతీయువక ప్రతిమలను అతి సుందర స్వరూపులుగా చిత్రించెడివారు ప్రపంచమున మానవులలో అంతటి సుందరస్వరూపులు కనిపించుట అతి అరుదు అయినను అది సహజత్వముతో కూడిన విరూపము గావున, అది హృదయానందమే కలుగచేయును [గ్రీకు శిల్పమునకు సంబంధించిన చిత్రాలను కొన్నిటిని యీ వ్యాసములో చూడవచ్చును ]

గ్రీకులు మొట్టమొదట ఈజిప్షియనుల వలెనె చెక్కపై నగ్నయువక రూపములను చెక్కెడివారు ఇవి నిర్జీవముగా కట్టెలవలె ఉండెడివి అటుపిమ్మట కొంతకాలమునకు కంచు విగ్రహములు చేయ నారంభించిరి కాని దురదృష్టవశాత్తు గ్రీకులపై దండెత్తి వచ్చిన శత్రువుల చేతులలో యివి చాలవరకు రూపుమాసినవి వారీవిగ్రహములను కరగబెట్టి ఆ లోహమును యుద్ధపరికరముల తయారీకై వినియోగించిరట ; గ్రీకులు ఎఱ్ఱమట్టితో కూడ విగ్రహములు చేసెడివారు వాటి కక్కడక్కడ వర్ణములు (రంగులు) సైతము వేసెడివారు అటుపిమ్మట మరికొంత కాలమునకు వారు సున్నపు రాతితో విగ్రహములు చేయమొదలిడిరి కాని వారు వారి పాలరాతి విగ్రహముల ద్వారానే ప్రపంచఖ్యాతి పొందిరి వారి దేశమున బహుఛాయల పాలరాళ్లు విరివిగా దొరకును కాని వీటిని చెక్కుట బహు శ్రమతోకూడిన పని క్రీ పూ 7 వ శతాబ్దమునవే గ్రీకులకు పాలరాతి శిల్పమునందు ప్రవేశ మున్నను, రెండువందల సంవత్సరముల అనంతరము కాని వాటిలో వారు పూర్తి నేర్పుగడింపలేక పోయిరి కాని చిత్ర

కారులు, చరిత్రకారులకు రెండు శతాబ్దముల కాలము బహుస్వల్పకాలము. కేవలము రెండు వందల సంవత్సరముల కాలములో వారు పాలరాతి శిల్పమునందు సాధించ గలిగిన నేర్పరితనము అమోఘము. దీనికి కారణము వారికిగల పూర్వశిల్ప చరిత్రయే కావచ్చును.

పాలరాతి ప్రవేశముతో పాటు గ్రీకు శిల్పమునందు మరియొక క్రొత్తదనము కానరామొదలిడెను. ఇదివరకున్న నిర్జీవత పోయి, దానిస్థానే గ్రీకు శిల్పములు ప్రపంచ ప్రసిద్ధిగాంచుటకు కారణభూతములైన క్రొంగ్రొత్త కవళికలు కానరాసాగినవి. మానవులలోని సహజత్వము, పుణ్య పురుషులలోని నైర్మల్యము దేవతలలోని దైవత్వము సమ్మిళితమై ఈ శిల్పములందు ప్రతిబింబింపసాగినవి, ఇదే గ్రీకు శిల్పము లందలి ప్రత్యేకత. ఆ కాలమునందే వీరు చిత్ర శిల్పమునందు 'రేఖాకృతి సూత్ర'మను ఒక కొత్తసూత్రమును ప్రవేశపెట్టిరి. సరైన ఆకృతులు చిత్రమునందు ఏక స్వనము కలిగించును కావున అట్టి యేకస్వనము కలిగించు ఆకృతులేవో వారు నిర్ణ యించిరి.

గ్రీకుశిల్పులు, పురుషులను బలవంతులుగాను, స్త్రీలను మృదుశరీరలుగాను చిత్రించెడి వారు. ఆ శిల్పుల మరియొక ప్రత్యేకత వారివస్త్రచిత్రీకరణ. దీనిని నేటికిని వివిధ దేశ చిత్ర కారులు అనుకరింప ప్రయత్నిం చుచున్నారు. గ్రీకు ప్రతిమలం దలి మరియొక విశేషము వాటి ఎత్తు. ఆరడుగులకన్న చిన్న ప్రతిమలు బహు అరుదు. ఎథినా దేవతా విగ్రహము 40 అడుగుల పొడవుండెడిదట. ఇది కేవ లము బంగారు,దంతములతో చేయబడినదట।

గ్రీకులు తమ పాలరాతి విగ్రహము లందు వర్ణములు ఉపయోగించెడివారు కాదని ఏలనో ఒక అపోహయున్నది. కాని అది యెంతమాత్రమును నిజముకాదు. మందిర ములలో, కాకుంటే ఆరుబైట ప్రతిష్ఠించిన విగ్రములు యెండ, గాలితాకిడిని తట్టు కొనుటకై వాటికి ఒక విధమైన లేతబంగారు వర్ణమును, కరిగిన మైనముతోకలిపి పూసెడి వారు. కనుబొమలు నీలివర్ణములోను,



4 వ శతాబ్దపు టెనగ్రా శిల్పం

పెదిమలు ముదురు ఎఱుపురంగులోను, తల వెంట్రుకలు ఎఱుపువర్ణముతో మిశ్రితమైన బంగారు ఛాయలోను చిత్రించెడివారు.

గ్రీకు ప్రతిమలవలెనే గ్రీకు కట్టడములు కూడ ప్రపంచ ప్రసిద్ధములే. ఆ కాలమున రోమనులు, ఈ కాలమున అమెరికనులు కూడ వీటిని అనుకరింప యత్నించిరి. గ్రీకులు తమ గృహములలో నెక్కువ కాలము గడిపెడివారు కాదు. వారెప్పుడును సభలలోను, క్రీడారంగస్థలముల(Stadiums) లోనే ఎక్కువకాలము గడిపెడివారట. అందుచే వారి గృహములు అతి సామాన్య ముగానున్నను, వారిఅంతఃపురములు, దేవా లయములు, సభా మందిరములు వారి కళా నైపుణ్యమును వేనోళ్ళ చాటుచుండును. వారి కట్టడములను మొదట సున్నపు రాతితోను, అటుపిమ్మట పాలరాతితోను నిర్మించెడివారు. కట్టడ నిర్మాణములో మట్టి, సిమెంటువంటి పదార్థములేవియు వాడలేదు. వారు రాళ్ళన్నియు ఒకదానిలోకొకటి దూర్చుకొని పోయి పటిష్టముగా నుండునట్లు నిర్మించిరి. వీరి దేవాలయములు చతురస్రాకారము కలిగియుండెడివి. వీరు వారి కట్టడములలో స్తంభముల నెక్కువగా నుపయో గించెడి వారు. ఈ కట్టడముల గోడల పైభాగమునను, కొన్ని దేవాలయములలో స్తంభముల మీదను, మాత్రమే అక్కడక్కడ చెక్కడపు పని చేసెడివారు. ఈ విధముగా వీరి కట్టడములను అతి సాధారణముగ నిర్మించినను, ఆ కట్టడముల ఆకృతులందు ఏక స్వనముండుటచే ఈ నాటికిని అవి ప్రసిద్ధిచెంది యున్నవి. వీరి కట్టడ ములకు కరిగిన మైనముతో కలిపిన ఒక విధమైన లేత పసుపువర్ణమును పైపూతగా పూసెడివారు. ఈ కట్టడముల లోపల, చిత్రములు చెక్కుటకుపయోగించెడి గోడల పైభాగమునందు, చిత్రముల వెనుకప్రక్క (Background) నీలి వర్ణము పూసెడివారు.

గ్రీకులకు చిత్రపట రచనయందున్న నైపుణ్యము గురించి విభిన్న అభిప్రాయ ములున్నవి. కొందరు వారికి శిల్పవిద్య యందుగల నైపుణ్యము చిత్రపట రచన

యందు కూడ కలదనియు, మరికొందరు వారి చిత్రపటములు వారి శిల్పములంత ఉన్నతమైనవి కావనియు అభిప్రాయపడుచున్నారు. కాని దురదృష్టవశాత్తు నేడు వారి చిత్రములు దాదాపన్నియు రూపుమాసియుండుటచే మనమీనాడు వారి చిత్రపటముల గూర్చిన నిజానిజములు తెలుసుకొనలేకుండ యున్నాము. ఈ గ్రీకు చిత్రపట చిత్రీకరణ క్రీ. పూ. మూడు నాలుగు శతాబ్దములలో అత్యున్నతస్థాయిలో వుండెడిదని అభిప్రాయపడుచున్నారు. వీ రెక్కువగా గోడలపైననే చిత్రించెడివారు. వారు వారి స్వగృహములందలి గోడలపైన కూడ అక్కడక్కడ చిత్రించియున్నారు. ఇందులో, బాలురు కుక్కలతోను, చిన్న బండ్లతోను, బొమ్మలతోను ఆడుకుంటున్నట్లును; స్త్రీలు పిచ్చాపాటి మాట్లాడుకొనుచున్నట్లును, వర్షములో నడుస్తున్నట్లును చిత్రింపబడియున్నారు. ఈ చిత్రములలో పురుషులు ఎక్కువగా కానరారు.

చిత్రపటముల చిత్రీకరణలో యెటులున్నను, గ్రీకులయితర (శిల్ప) చిత్రకళలలో బహు నేర్పరులు. వారి మృణ్మయ, కంచు, వెండి, బంగారు లోహాది పాత్రలు, వారి ఆభరణములు, కవచములు, వారి స్త్రీలు ధరించే వస్త్రములు, అన్నియు వారి కళాత్మక జీవితమునకు నిదర్శనములు. ఈ మృణ్మయ పాత్రలపై చిత్రింపబడిన చిత్రముల నటుంచి, కేవలమాపాత్రల వంపులను పరిశీలించినను, అందును వారి చిత్రకళా నైపుణ్యము గోచరించును. ఈ పాత్రల ఆకృతులను యిప్పటికిని ఐరోపియను కర్మాగారములు అనుకరించుచున్నవి. క్రీ. పూ. 2500 సంవత్సరముల నాటికే ఈ మృణ్మయ పాత్రలు, క్రీటు, మైసీనియా దేశములలో వాడుకలో నుండెడివి. ఈ పాత్రలపై మొట్టమొదట రేఖాకృతులు చిత్రించెడివారు. అటుపై వివిధ వృక్షజాతులు చిత్రింప నారంభించిరి. ఆ తరువాత దేవతా రూపములను, రణరంగములను వీటిపై చిత్రింప మొదలిడిరి. ఈ



ఎపెటి. లిసిప్పస్ స్కూలుకు చెందిన కంచుశిల్పం

మృణ్మయ పాత్రలమీద వారు వర్ణములను విరివిగా వాడిరి. క్రీ. పూ. 5, 6 శతాబ్దములలో వీరు మట్టిరంగులోనున్న ఈ మృణ్మయ పాత్రలపై నలుపు వర్ణముతో రేఖాచిత్రములు చిత్రించెడివారు. అటు పిమ్మట దాదాపు క్రీ. పూ. 5 వ శతాబ్దము నుండి వారీ మృణ్మయ పాత్రలకు పూర్తిగా నలుపువర్ణముపూసి, దానిపై తెలుపుతోను, ఎఱుపు, నారింజ మొదలగు మట్టి రంగులతోను చిత్రింప నారంభించిరి.

ఆ నాటి గ్రీకులు వెండి బంగారు పాత్రలను బంగారు నగలను, వాటియందలి లోహపు విలువకుగాక వాటి యందలి గలచిత్రకళకు ఎక్కువ ప్రాముఖ్య మిచ్చెడివారట. వారీ పాత్రలపైనను, నగలపైనను వృక్షజంతు రూపములను, అక్కడక్కడ దేవతా రూపములనుకూడ చిత్రించెడివారు. వారు విలువైన రాళ్ళు (వజ్రములు, కెంపులు మొదలగు అతి విలువైన రాళ్ళుకాదు. వీటికి వారెన్నడు విలువీయలేదు) చెక్కుటలో కూడ నేర్పరులే. వీటిని వారు సాధారణముగ ముద్రలు తయారు చేయుటకై ఉపయోగించెడివారు.

గ్రీకులు ఆ కాలము నాటికే నాణెములను కూడ వాడుచుండిరి. వీటిపై చిత్రింపబడిన చిత్రములు కూడ వారి కళానైపుణ్యమునకు చక్కటి నిదర్శనములు.

గ్రీకులు వారి జీవితములలో చిత్రకళకిచ్చినంత ప్రాముఖ్యత మరిదేనికిని, చివరకు రాజకీయములకు కూడ యివ్వలేదేమో! కళ కేవలము కళకోసమే అని వారు ఆరాధించిరి. కాని యిటువంటి మహోన్నత చిత్రకళ యేకారణముచేతనో క్రీస్తుశకారంభమునుండి మెల్లమెల్లగా నశింపనారంభించినది. బహుశః అలగ్జాండరు దండయాత్రలపిమ్మట ప్రపంచవ్యాప్తిపొందుటలో గ్రీకుచిత్రకళ దాని ప్రత్యేకతను పోగొట్టుకొని నిర్జీవమైనదేమో!

# వెలుగు బాటలు

కె. వి. భాస్కరరావు

భారతదేశం రష్యా వెళ్ళింది ఈ వాక్యం ఆశ్చర్యకరంగానే వుంటుంది కాని రష్యాలో ఏర్పాటైన భారత జాతీయ ప్రదర్శనం ఈ సత్యాన్ని నిరూపించింది భారత దేశపు సమగ్ర స్వరూపాన్ని, ఈ దేశంలో జరుగుతున్న పురోభివృద్ధిని అవగాహన చేసికొనేటందుకు ఈ ప్రదర్శన ఎంతో తోడ్పడింది అంతేకాక ఇతర దేశాలతో మన వ్యాపారాన్ని పెంపొందించేటందుకు కూడా దీనివల్ల వీలుకల్గింది భారతదేశం లోని వివిధరాష్ట్రాలు, స్వాతంత్ర్యానంతరం దేశంలోని అభివృద్ధి పథకాలు, సాంకేతిక, పారిశ్రామికాభివృద్ధి, పంచాయతీరాజ్య విధానం మున్నగుఅంశాలు ఈ ప్రదర్శనలో చూపబడ్డాయి ఇందువల్ల రష్యాలోని సామాన్య పౌరుడుసైతం భారత దేశాన్ని గూర్చి తెలిసికొనడానికి వీలుకల్గింది మన దేశంపట్లగల అనేక అపోహలు పటాపంచలయ్యాయి హంగరీ దేశపు ప్రధానిసైతం భారతదేశం ప్రాచీన నాగరికతకు చిహ్నమని తాను భావించే వాడిననీ, రష్యాలో ఏర్పాటైన ప్రదర్శన చూశాక తన అభిప్రాయం పూర్తిగా మారిందనీ, భారతదేశపు పురోభివృద్ధి తనకు ఆశ్చర్యం కల్గించిందనీ తెలిపారు రష్యా, హంగరీదేశాలు మనదేశంతో వ్యాపారాన్ని మరింత పెంపొందించడానికి ముందుకు వచ్చాయి ఒక విధంగా ఈ ప్రదర్శన మనదేశాన్నే ఇతర దేశాలకు తీసికొనిపోయినట్లయ్యింది

ఒక దేశాన్నిగూర్చిగాని, ఆ దేశపు పురోభివృద్ధినిగాని ప్రచారం చేసేటందుకు అనేక మార్గాలున్నాయి సాంకేతిక విజ్ఞానం పెంపొందిన ఈ తరుణంలో ప్రదర్శనలు, చలనచిత్రాలు, రేడియో, పత్రికలు మున్నగు సాధనాలు ఎంతో వుపకరిస్తాయి మనపంచవర్ష ప్రణాళికలలో ఈ సాధనాలన్నింటినీ కొద్దో, గొప్పో వినియోగిస్తూనే వున్నాం రెండు ప్రణాళికలు పూర్తిచేసి, మూడవ ప్రణాళికఅమలుపరుస్తున్న ఈ సమయంలో ఈ సాధనాలవినియోగాన్ని సమన్వయపరచి, మరింత పటిష్ఠం చేయడం ఎంతైనా అవసరం ఈ లక్ష్యంతోనే భారతప్రభుత్వ సమాచార ప్రసారశాఖవారు ఒక సంఘాన్ని నియమించారు దేశంలో పనిచేస్తున్న వివిధ ప్రచార సాధనాల పనిని సమీక్షించి, అవి మరింత సమర్థవంతంగా పనిచేయడానికి సూచనలివ్వడం ఈ సంఘం లక్ష్యం పార్లమెంటు సభ్యులు శ్రీ అమర్‌నాథ్ విద్యాలంకార్ ఈ సంఘానికి అధ్యక్షులు వీరు యిటీవల మనరాష్ట్రంలోని అనేక జిల్లాలు పర్యటించారు అధికార, అనధికారులతో చర్చలుజరుపడమేగాక, అభివృద్ధికేంద్రాలు, సమాచారకేంద్రాలు, యితర సంస్థలను సందర్శించారు ఈ సంఘంవారుసమర్పించే సూచనలు, సలహాలు భారత ప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వ ప్రచార సాధనాలను ప్రజలకు మరింత వినియోగపడేటట్లు చేయగలవని ఆశించవచ్చు

ఇప్పుడేఅందినవార్త (అంటే ఈ వ్యాసం వ్రాసే సమయానికి లెండి ) సోవియట్ రష్యా, అమెరికా, బ్రిటన్ దేశాలు అణ్వస్త్రాల వినియోగాన్ని భూగర్భంలో తప్ప మిగిలిన ప్రాంతాలలో నిషేధించేవిషయంలో అంగీకారానికి వచ్చాయి మానవజాతిచరిత్రలో యిది ప్రముఖ ఘట్టమేగాక, నాగరికతా పురోభివృద్ధిలో మరొక ముందడుగు ఈ నాడుప్రపంచంలో ఏమూల మంచి,చెడులు జరిగినా దాని ప్రభావం చెరువులోని అలల వలె అంతటికీ వ్యాపిస్తుంది అందువల్ల ఒక దేశపు బాగోగులు మరొకదేశపు బాగోగులతో ముడివడి వున్నాయి వసుధైకకుటుంబాన్ని ఆశిస్తున్న ఈ తరుణంలో ఈ మూడు రాజ్యాల ఒడంబడిక ఆశాజ్యోతిలావచ్చింది ఈ జ్యోతి దిన దినాభివృద్ధిచెంది మానవ పరిపూర్ణతకు దోహదం చేయగలదని ఆశిద్దాం

# నవోదయం

ఘట్టి కృష్ణమూర్తి

మేలుకొన్నది భరతఖండం మేలుకొన్నది భారతీయత
మేలుకొన్నది దేశభక్తి మేలు మేలయ్యేన్ -

భరతఖండమ్మొక్కమనిపై భవ్య భావోద్దీపితమ్మై
దివ్యతేజో రాజితమ్మై దీప్తి గాంచినది -

సమర రంగమ్మన్న నేడొక శైశవ క్రీడాంగణమ్మై
దేశవాసులలో జిగీషా దీక్ష పెంచినది -

అంతరించెను అలసతాగుణ మంతరించెను స్వార్థబుద్ధి
సంతరించెను సర్వశక్తులు సమగ్రసుఫార్తిన్ -

తేజరిల్లిరి త్యాగబుద్ధులు దేశరక్షణ భారమూనిరి
వీరపూజకు దేశమెల్లను వేడ్క పడియెనుగా ! -

దేశ స్వాతంత్ర్యమ్ము విలువయు దేశవాసుల కెరుకపడినది
క్షోభగుందిననాడె జాతికి శోభ వచ్చునొకో ! -

అంతరించెను కులముమతముల పంతములుమానసికశత్రులు
అంతటను వీచినవి గాలులు ఐక్యతా గరిమన్ -

భరతమాతకు వన్నె చిన్నెల భావవిన్యాసమ్ము వచ్చెను
తరతరాల జరాకృశాంగికి కరుణదాధికతన్ -

మంచుముసుగును చీల్చివైచెను మించి వెలుగు
ప్రబోధ సూర్యుడు
జడతగూరిన జాతికమలము జాగృతమ్మయ్యేన్ -

పంచశీలను భంగపరచిన వంచకులతో నెయ్యమందుట
ఎంచరాదు సహించరాదను నెలుగు వినబడియెన్ -

దేశనిర్మాణమ్ముకొరకై దీక్షనించిన దివ్యశక్తులు
కార్మికులలో కర్షకులలో కదలి యుప్పొంగెన్ -

మధ్యతరగతి మానిసుల మిథ్యాభిమానము లంతరించెను
పెద్దబాబుల శుద్ధఛాందస పద్ధతులు మారెన్ -

దేశరక్షణ దీక్షకై సందేశమిచ్చిన జహ్వారునకే
సాధు వాదము సర్వదిక్కుల జాతిలో చెలగెన్ -

పోరునష్టం పొందులాభం భీరువుల వాదమ్ము కాదని
నిరూపించిరి భారతీయులు నిఖిల లోకముకున్ -

త్యాగమయ జీవిత విధానము భోగలాలసతలను చంపెను
రాగమన్నది త్యాగమందే రాణకెక్కినది -

ప్రాణములకును విలువకట్టిన ప్రాజ్ఞులెవ్వరు లోకమందున
సమిధలైన విదేశరక్షణ సత్రయాగమునన్ -

నవసమాజ స్థాపనమ్మున నవ్య భావోద్దీపనమ్మున
భవ్యమౌ దేశీయ పద్ధతి భావ్యమనితోచెన్ -

భంగపాటున కెవ్వరైనను ప్రజ్వరిల్లుదు రనుచు దెలుపగ
శాంతికోరే భరతదేశం జైత్రయాత్రా శంఖమూదెను—

కడుపుచల్లని మేఘమందే పిడుగుదాగొనియున్న విధమున
భారతీయాధ్యాత్మికంబున వీరతయు నిలచెన్ -

అరయ భగవద్గీత నేటికి అవగతమ్మై నట్టులయ్యెను
భారతీయుడు శోకముడిగిన పార్థుడైనిలచెన్ —

కీడులోనే మేలు కలదను నుడికి తార్కాణమ్ముగానే
చైనా దురాక్రమణమ్ము కతమున జాగృతియుకలిగెన్-

( గత సంచిక తరువాయి )

అధికారిక లెక్కలనుబట్టి, చైనా జనాభా 1952 వ సం॥ లో 569 మిలియన్లు వుండగా 1957 వ సం॥ లో 634 మిలియన్లకు పెరిగినట్లు తెలుస్తున్నది అంటే 11 శాతానికి పైగా 65 మిలియన్లవరకు జనాభా పెరిగిందన్నమాట ప్రథమ ప్రణాళికా కాలంలో చైనా జనాభా ఏటా సుమారు 13 మిలియన్ల వంతున పెరిగింది ఆసియా, దూర ప్రాచ్యాల ఆర్థిక సర్వే — 1960 — లో వెల్లడించిన వివరాలనుబట్టి జనాభా పెరుగుదల తీవ్రంగా జరిగినట్లు విదితమవుతున్నది 1954 లో జనాభా 595 మిలియన్లు కాగా 1958 నాటికి 669 మిలియన్లకు పెరిగింది అంటే నాలుగు సంవత్సరాలలో 12 4 శాతం జనాభా హెచ్చిందన్నమాట ప్రస్తుత పరిస్థితి ఇలాగే కొనసాగినట్లయితే చైనా జనాభా 1980 నాటికి 1 బిలియన్‌కు పెరుగుతుంది

భారతదేశ జనాభా 1951 వ సం లో 357 మిలియన్లు కాగా 1960 నాటికి 408 మిలియన్లకు హెచ్చింది 1954 లో 377 మిలియన్లు వున్న జనాభా 58 లో 397 మిలియన్లకు పెరిగింది అంటే ఈ నాలుగేండ్లలో జనాభా 5 3 శాతం హెచ్చింది (ఇదే కాలంలో చైనా జనాభా 12 4 శాతం పెరిగింది )

ఇక ఆహారోత్పత్తుల విషయం—ధాన్యాల (సోయిచిక్కుడు, బంగాళాదుంపలతో సహా) ఉత్పత్తి 164 మిలియన్ మెట్రిక్ టన్నుల నుంచి 185 మిలియన్ మెట్రిక్ టన్నులకు (10 మిలియన్ టన్నుల సోయిచిక్కుడు మినహా) పెరిగింది అంటే మొత్తం వ్యవసాయోత్పత్తి సంవత్సరానికి సగటున 4 శాతం చొప్పున పెరిగిందన్నమాట అయితే ఇండియాలో 1953 లో 69 8 మిలియన్ టన్నులు వున్న ఆహారధాన్యాల మొత్తం ఉత్పత్తి 1958 లో దాదాపు 76 7 మిలియన్ టన్నులకు హెచ్చింది అంటే ఏటా దాదాపు 1 5 మిలియన్ టన్నుల చొప్పున ధాన్యాల ఉత్పత్తి అధికమైందన్నమాట

మనదేశంలో ఆహారధాన్యాల ఉత్పత్తిలో 1950–51 వ సం లెక్కంటె 1960–61వ సం॥ లో దాదాపు 42 శాతం పెరుగుదల ఏర్పడింది ఇది ప్రోత్సాహకరమైన విషయం

# తెలుపు నలుపు

పి యల్ సంజీవరెడ్డి

ఇండియా చైనా దేశాల పూర్తి వ్యయం, జాతీయాదాయం సైనిక వ్యయాలను గురించి మనం ఇప్పుడు తెలుసుకుందాం లెక్కలు లభ్యమైన సంవత్సరాలలో తారతమ్యాలు ఉదహరించబడినాయి

*1952 నుంచి 1957 వరకు రక్షణవ్యయం*

( బిలియన్ యన్‌లలో )

| సంవత్సరం | జాతీయ ఆదాయం | రక్షణ వ్యయం | జాతీయాదాయంలో రక్షణ వ్యయం శాతం | మొత్తం వ్యయంలో రక్షణ వ్యయం శాతం |
|---|---|---|---|---|
| 1952 | 59 13 | 4 28 | 7 24 | 26 2 |
| 1953 | 67 95 | 5 23 | 7 70 | 32 4 |
| 1954 | 69 91 | 5 81 | 8 31 | 23 6 |
| 1955 | 81 07 | 7 18 | 8 86 | 24 2 |
| 1956 | 85 03 | 6 12 | 7 20 | 20 1 |
| 1957 | — | 5 52 | — | 18 85 |

మన దేశంలో అభ్యుదయ ప్రణాళికల అమలు దృష్ట్యాను చైనా నమ్మక ద్రోహం చేస్తుందన్న అభిప్రాయం లేనందువల్లా రక్షణ విషయమై యింతకంటే యెక్కువగా వ్యయపరచలేకపోయాము

ఈ కాలంలో చైనా ఏటా సగటున 5 72 బిలియన్ యన్స్ లేక సుమారు 1144 కోట్ల రూపాయిలు ఖర్చు చేసింది (భారత దేశం దాదాపు 180 కోట్లు ఖర్చు చేసింది కాగా చైనా చేసిన వ్యయం దీనికంటే 6½ రెట్లు ఎక్కువ ) చైనా రక్షణ వ్యయం 1930 లో 2,852 మిలియన్ యన్స్ వుండగా 1955 నాటికి ఈ వ్యయం దీనికి 2 5 రెట్లు పెరిగింది 55 లో దీనిని 52 స్థాయికంటే 75 శాతానికి పైగా హెచ్చించారు

భారతదేశంలో 1950 వ సంవత్సరం నుంచీ జరుగుతున్న రక్షణ వ్యయాన్ని బట్టి ఇక్కడ సైనికబలాన్ని గురించి, సైనిక సన్నాహాలను గురించి తెలుసుకోవచ్చు జాతీయాదాయంలో రక్షణవ్యయం 2 శాతానికి తక్కువే అయినప్పటికీ కేంద్ర బడ్జెటులో విడిపద్దులలో ఇదే ప్రధానమైనదనడంలో సందేహం లేదు క్రొత్త ఎమర్జన్సీ బడ్జెటులో రక్షణవ్యయం క్రింద 867 కోట్లు చూపబడింది ప్రస్తుత మన జాతీయాదాయంలో ఇది 5 శాతానికి సమానం 1957—59 సగటు సంఖ్యలు ప్రాతిపదికలుగా గల యు ఎన్ సర్వేనుబట్టి వివిధ దేశాల సైనిక వ్యయం నిష్పత్తి వాటి మొత్తం జాతీయ ఉత్పత్తులలో దిగువ విధంగా వున్నట్లు తెలుస్తున్నది

| | | |
|---|---|---|
| అమెరికా | 9 8 | శాతం |
| రష్యా | 6 9 | .. |
| ఫ్రాన్సు | 6 2 | .. |

| | | |
|---|---|---|
| ఇండొనీషియా | ... 4 6 | శాతం |
| యుగొస్లావియా | 9 0 | ,, |
| చైనా | 4 4 | ,, |
| పాకిస్తాన్ | 3 0 | ,, |
| ఇండియా | 2 0 | ,, |

ఆయా దేశాలు తమ మొత్తం జాతీయోత్పత్తులలో రక్షణ కార్యక్రమాలకు చేస్తున్న ఖర్చు భాగాలను బట్టి ఆ దేశాలలో జరుగుతున్న సైనిక సన్నాహాలను గురించి సైనిక శక్తిని గురించి తెలుసుకోవడానికి వీలు కలుగుతుంది చైనా ఇటీవల కాలంలో ఏటా దాదాపు 1000 కోట్లు ఖర్చు చేస్తున్నది అయితే 1950–51 నుంచి భారతదేశం రక్షణ కార్యక్రమాలకు చేస్తున్న వ్యయం ఏడాదికి సగటున ఎక్కువలో ఎక్కువ రూ 221 కోట్లు మాత్రమే వుంటున్నది దీనిని బట్టి మనం రక్షణావసరాలను తగినంతగా తీర్చుకోవడం లేదనే విషయం వెల్లడవుతున్నది అయితే మన రాజకీయ, ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా దీనికి సబబైన కారణం లేకపోలేదు దారిద్ర్యం, నిరుద్యోగ నిర్మూలనకు ఏకదీక్షతో కృషి చేయడం మన దేశానికి అవసరమైంది ఆర్థికాభివృద్ధికి మనం అధికతర ప్రాధాన్యత ఇచ్చిన సంగతిని జాతీయాదాయం, తలసరి ఆదాయాలలోనూ వ్యవసాయ, పారిశ్రామికోత్పత్తులలోనూ ఏర్పడిన పెరుగుదలలను బట్టి తెలుసుకోవచ్చు

మన విదేశాంగ నీతికి అలీన విధానం మూలాధారం రాజకీయ సిద్ధాంతాల బేధభావం లేకుండా అన్ని దేశాలవారితోనూ స్నేహ సంబంధాలు వుంచుకుంటూ మన ఆర్థిక లక్ష్యాల సాధనకు కృషి సాగిస్తూ శాంతియుతంగా మనగలగదలిచాం ఇప్పుడు మనం గట్టిగా నమ్మిన మిత్రుడే మనకు ద్రోహం చేశాడు అతని సైనిక శక్తిని గురించిన అంచనా మనకు వుండడం అవసరం

ప్రజావిమోచనసైన్యం బలం (అంటే నౌక, పదాతి, వైమానిక దళాలలోని 2½ మిలియన్లమంది పురుషులు) దూరప్రాచ్యం, ఆగ్నేయాసియాలోని అన్ని కమ్యూనిస్టేతర దేశాల సమిష్టి సైనికబలాలకంటే కూడా అధికమని అంటారు పదాతిదళంలో 150 డివిజన్లున్నాయి ఒక్కొక్క దానిలో 10 మొదలు 12 వేల పురుషులుంటారు వీటిని సోవియట్ సైనిక డివిజన్ల పద్ధతిలో ఏర్పరిచారు ఇంతేగాక చైనా కమ్యూనిస్టులకు పబ్లిక్ సెక్యూరిటీ యూనిట్లలో ½ మిలియన్‌కు పైగా ట్రూపులు వున్నాయి చైనాకు బ్రహ్మాండమైన సైనిక బలగం వుండటమేగాకుండా దానికి 15–49 సంవత్సరాల మధ్య వయస్కులైన సుమారు 160 మిలియన్ల మంది పురుషులు వున్నట్లూ, మరో 80 మిలియన్ల మంది సైనికకార్యకలాపాల నిర్వహణకు శారీరకంగా యోగ్యులై వున్నట్లు అంచనా చైనాలో దేశవ్యాప్తంగా నిర్బంధంగా పురుషులను సైన్యంలో చేర్చుకునే పద్ధతిని 1955 లో ప్రవేశపెట్టారు దీని ననుసరించి 18 సంవత్సరాలు గల ప్రతివ్యక్తీ సైన్యంలో చేరవలసి వుంటుంది ఇది పెకింగ్ ప్రభుత్వానికి సైనికశక్తిని పెంపొందించుకోవడానికి విశాల ప్రాతిపదికను ఏర్పరచింది సైన్యంనుంచి విడుదల చేయబడినవారు (1959 లోనూ 58 ఆరంభంలోనూ దాదాపు 17 మిలియన్ల సైనికులు సైనికదళాలనుంచి విడుదల చేయబడినారు), పాక్షికంగా శిక్షణ పొందిన స్థానిక పురుషులు, ఉన్నత పాఠశాల కళాశాలల విద్యార్థులు కూడా వున్నారు వీరికి సైనికశిక్షణ, ప్రారంభ విషయాలలో నిర్బంధంగా శిక్షణ ఇస్తారు దేశవ్యాప్తంగా వ్యాయామ విద్యా కార్యక్రమాన్ని అమలు జరుపుతున్నారు గ్రామీణ జనాభా అంతటినీ ఇంచుమించు నిర్బంధంగా సైనిక పద్ధతిలో క్రమశిక్షణకు లోబరిచారు 57 ఎం ఎం తుపాకులు, భారీ ఫిరంగులు, రాకెట్ ప్రయోగసాధనాలు, 70 ఎం ఎం పొట్టి ఫిరంగులు, సొసైటీ టాంకులు మొదలైన ఆయుధ సామాగ్రి కూడా వారికి సమకూర్చారు ఈ విధంగా కమ్యూనిష్టు చైనా రెగ్యులర్ సైనికదళాలు కొరియా యుద్ధంఆరంభమైనప్పటినుంచీ పునర్నిర్మించబడుతూ వాటికి సాధన సామగ్రులు సమకూర్చబడుతూ పటిష్టమొనర్చబడుతున్నాయి

చైనా విమానదళంకూడా చాలా ప్రాముఖ్యత గలదే ఇంతటి పటిష్ఠమైన విమానదళం మరే ఆసియా దేశానికీలేదు చైనాకు 2,500 విమానాలున్నాయి కాగా వీటిలో 1800 లకు పైగా జెట్ విమానాలే ఇవన్నీ 30 విమాన డివిజన్లక్రింద విభజించబడినాయి అనేక జెట్ మిగ్ 155 లు కూడా చైనాకు వున్నాయి 1958 నుంచీ ఇది మిగ్ 17 లను సమకూర్చుకుంటున్నది

చైనా నౌకాదళం దూర ప్రాచ్యమంతటిలోకీ చాలాపెద్దది కనీసం ఒక తేలిక క్రూసెర్, 4 డెస్ట్రాయర్లు 13 సబ్‌మెరీన్లు, 15 ఫ్రిగేట్లు, 6 గన్‌బోట్లు, 52 టార్పెడ్ బోట్లు, 150 ఇతర రకాలబోట్లు చైనాకు వున్నాయి తమ విస్తీర్ణం, జనాభాదృష్ట్యా అణ్వాయుధాలకుకూడా చైనా దుర్భేధ్యమైనదని చైనా కమ్యూనిస్టులు విశ్వసిస్తారు అవసరమైతే తమ జనాభాలో 300 మిలియన్ల మంది ప్రజలనుకూడా అణ్వాయుధ పోరాటంలో బలి ఇవ్వగలమనే అభిప్రాయం చైనా నాయకులకు వున్నట్లు టిటో 1958 లో వెల్లడించారు

భారత సాయుధదళాల అధికారిక చరిత్రను బట్టి, 1945 అక్టోబరు మొదటితేదీ నాటికి భారత రక్షణ దళాల పూర్తిబలం 2 6 మిలియన్లయినట్లు తెలుస్తున్నది 1945, 1958–59 సంవత్సరాల మధ్య మొత్తం బడ్జెటు వ్యయాలలో జరిగిన మార్పులనుబట్టి – డబ్బుగొనుగోలుశక్తిలో వచ్చిన మార్పులను గమనిస్తూ – 1958లో భారతదేశంలో రక్షణ వ్యవస్థల పూర్తిబలం 5 69 లక్షలైనట్లు ఎవరైనా అంచనా వేయగలుగుతారు

రక్షణ వ్యవస్థలోని సివిలియన్ ఉద్యోగులు 2 60 లక్షలు 1958 వ సంవత్సరంలో సైనిక, నావిక, వైమానిక దళాల వేతనాల నిష్పత్తినిబట్టి మూడు విభాగాల బలాన్ని దిగువ విధంగా అంచనా వేయవచ్చు,

2 61 లక్షలు – సైన్యం—18 డివిజన్లు

0 18 లక్షల నౌకాదళం—ఒక్కొక్కదానిలో 15,000

0 30 లక్షలు విమానదళం– 2,70000

ఎట్టి సాయుధదాడినైనా నిరోధించగలిగేట్లుగా, తనసైనికశక్తిని పెంచుకోవడానికి భారతదేశం తక్షణమే చర్యలు తీసుకోవాలి శత్రువుకంటెనిశ్చయంగా తనదే పైచేయిగా వుండేట్లుగా ఈ సాయుధ బలగాలకు సాధన సామాగ్రిని సమకూర్చాలి

పూర్వకాలంలో రాజులు ముఖాముఖిగా పరాక్రమంగా పోరాటం చేసేవారు కొద్దిమంది సైనికులు మాత్రమే పరిమితమైన యుద్ధాలలో పాల్గొనేవారు మిగతా దేశ జనాభా అంతా యధారీతిగా ఉత్పత్తి వినియోగ రంగాలలో నిమగ్నులై వుండేవారు కాని ఈ నాడు యుద్ధం సంపూర్ణ జాతీయ కృషిగా ఎంచబడుతుంది వాస్తవ జాతీయాదాయంతోనే ఇది జరుగుతుంది మొత్తం జాతీయ ఉత్పత్తి అత్యధికంగా వుండి, సైన్యం, సైనిక ఉత్పత్తి రంగాలలో అధిక జనాభా నిమగ్నమైయుండి, తైలం, ఉక్కు, విద్యుచ్ఛక్తి, బొగ్గు, తేలిక ధాతువులు, సమృద్ధిగా లభించి రవాణా సదుపాయాలు చక్కగావుండి, శాస్త్రవిజ్ఞానం, పారిశ్రామిక రంగాలలో మిన్నగావున్న దేశంయుద్ధంలో విజయం పొందడం తథ్యం కాబట్టి ఈ అన్నిరంగాలలోనూ ఉత్పత్తులను పెంపొందించడానికి మనం దృఢ సంకల్పంతో కృషి చేయాలి ఆధునిక యుద్ధాలు కేవలం సమరాంగనంలోనే జరుగవు కర్మాగారాలలోనూ, వ్యవసాయక్షేత్రాలలోనూ ఉత్పత్తులను పెంపొందించడం అత్యావశ్యకం

నైతికంగానూ, రాజకీయంగానూ, ఆర్థికంగానూ విదేశ ఆయుధసామాగ్రిపైననే మనం పూర్తిగా ఆధారపడలేము, ఏదైనా సైనిక కూటమిలో చేరడానికి మన విదేశ విధానం ఒప్పుకోదు కాబట్టిమనస్వాతంత్ర్య పరిరక్షణకై మనం సాధ్యమైనంత వరకు స్వయం సమృద్ధులమై వుండాలి మన సాయుధ దళాల అంగబలాన్ని, సాధన సంపత్తిని అవసరమైనంత మేరకు పెంపొందించాలి ఈ కృషికి చాలా పెద్ద మొత్తం కావల్సివుంటుంది దీనినిమనం సాధించాలి 1939–45 లో వలెకాక ఇప్పుడు మనం మన స్వాతంత్ర్య పరిరక్షణకై పోరాడుతున్నాం మన ఈ ప్రయత్నాల సాఫల్యం చాలావరకు వ్యవసాయం, పారిశ్రామిక రంగాలలో ఉత్పత్తులు పెరగడం భారతీయులు పొదుపరితనాన్ని నిష్టగా ఆచరించి సాయుధదళాలకు, జాతికి అవసరమైన వాటన్నింటినీ సంతోషంగా వదలుకోవడానికి పూనుకోవడంపై ఆధారపడి వుంటుంది

జాతీయ రక్షణనిధికి ఉదారంగా విరాళాలివ్వడాన్ని, బంగారంబాండ్ల కొనుగోలునూ ప్రోత్సహించాలి దేహదార్ఢ్యంగల వ్యక్తులంతా సైనికశిక్షణ పొందాలి సాయుధ బలగాలలో చేరాలి దొంగచాటుగావున్న బంగారాన్ని రాబట్టడానికే బంగారం కంట్రోలు ఉత్తర్వును, బంగారం బాండ్లను ప్రవేశపెట్టారు ఈ బంగారంవల్ల విదేశాల నుంచి అవసరమైన సరుకులను దిగుమతి చేసుకోవడానికి వీలవుతుంది ప్రజలకు బంగారంపట్ల గల వెఱ్ఱివ్యామోహాన్ని తొలిగించడానికీ వారి అలవాట్లను మార్చడానికీ బంగారం కంట్రోలు ఉత్తర్వు మంచి సాధనంగా ప్రయోగించ బడింది

ఆర్థిక వనరుల సమీకరణకై పన్ను విధానం యుక్తమైనది ఇందువల్ల యుద్ధ సమయంలో ప్రజానీకం చేయాల్సిన త్యాగాలు సమానంగా పంపిణీ అవుతాయి ద్రవ్యోల్బణ పరిస్థితికూడా ఏర్పడదు ప్రజలు ప్రస్తుత తమ వస్తువాడకాన్ని త్యాగం చేయాలి విలాసవస్తువులు, ప్రాతిపదిక పదార్థాలు కాని వస్తువుల వినియోగాన్ని వాయిదా వేసుకోవాలి ప్రజానీకం ఇలా చేసినప్పుడే ఈ వస్తుసంపద అంతా సైనిక వస్తువుల ఉత్పత్తికి చక్కగా వినియోగం కాగలుగుతుంది మన గౌరవ ప్రతిష్ఠలకు, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు ఎదురైన సవాలును ఎదుర్కొగలగడానికై, అన్ని రంగాలలో గరిష్ఠ ఉత్పత్తి సాధించడం పొదుపరితనాన్ని నిష్టగా పాటించడం ప్రభుత్వ రక్షణ, ఆర్థిక విధానాలను సంపూర్ణంగా బలపరచడం తప్పనిసరిగా జరగాలి "స్వాతంత్ర్యం ఎట్టి ప్రయత్నంలేకుండానే ఎల్లకాలం వుంటుందనుకోరాదు'' దాని పరిరక్షణకు ప్రజలుసర్వదా సన్నద్ధులై వుండాలి అనేవిషయాన్ని మనం జ్ఞప్తికుంచుకోవాలి.

## భారత దేశ రక్షణ వ్యయం

(నికర రెవెన్యూ పద్దు) 1

| సంవత్సరం | రక్షణ వ్యయం (రూ కోట్లలో) | సాధారణమైన ధరలలో జాతీయాదాయం (రూ కోట్లలో) | జాతీయాదాయంలో రక్షణ వ్యయం శాతం | రెవెన్యూ పద్దుపై మొత్తం వ్యయం | మొత్తం వ్యయంలో రక్షణ వ్యయం శాతం |
|---|---|---|---|---|---|
| 1950_51 | 164 13 | 9530 | 1 72 | 351 44 | 46 70 |
| 1951_52 | 170 96 | 9970 | 1 72 | 387 27 | 44 14 |
| 1952_53 | 179 52 | 9820 | 1 83 | 396 18 | 45 31 |
| 1953_54 | 186 30 | 10480 | 1 78 | 407 48 | 45 72 |
| 1954_55 | 186 66 | 9610 | 1 94 | 422 62 | 44 10 |
| 1955_56 | 185 07 | 9980 | 1 73 | 489 36 | 37 81 |
| 1956_57 | 178 20 | 11310 | 1 58 | 627 40 | 28 40 |
| 1957_58 | 242 70 | 11390 | 2 13 | 845 40 | 28 71 |
| 1958_59 | 237 30 | 12600 | 1 88 | 944 60 | 25 12 |
| 1959_60 | 216 10 | 12940 | 1 68 | 1029 50 | 20 99 |
| 1960_61 | 232 60 | 14200 | 1 64 | 1141 90 | 20 37 |
| 1961_62 | 283 20 | 14630 | 1 93 | 1275 30 | 22 27 |
| 1962_63 | 322 60 | — | — | 1480 30 | 21 79 |
| 1963_64 | 709 00* | — | — | — | — |

1 కాపిటల్ అక్కౌంటుపై జరిగిన ఖర్చును దీనిలో చేర్చలేదు ఇది సగటున (1956_62 నుంచి) 36 కోట్లు వుంటుంది

* 1963_64 సం లో కాపిటల్ అక్కౌంటుకు రూ 159 కోట్ల వ్యయం చూపబడింది (ఈ రెండు పద్దులతోసహా రక్షణకు 868 కోట్లు అంటే ప్రస్తుత జాతీయాదాయంలో నూటికి 5 వంతులు ఖర్చు చేస్తారు)



# కమ్యూనిటీ రేడియో సెట్లు

రాష్ట్రంలోని దిగువ పేర్కొన్న గ్రామాలలో, సంస్థలలో 1963 మే నెలలో కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పారు

హైదరాబాదు జిల్లా జగ్గంగూడ (మెయిన్ సెట్టు), మీర్‌ఖాన్‌పేట (డి బి సెట్టు), నరికల్ (మెయిన్) మన్‌మరి (డి బి సెట్టు).

నిజామాబాదు జిల్లా కొండూరు, మసంపూర్, మడగాం, లింగంపల్లి, మహమ్మద్‌నగర్ (లోగడవున్న సెట్టు స్థానే మెయిన్ సెట్టు), నర్వ (లోగడవున్న సెట్టు స్థానే మెయిన్ సెట్టు,

కరీంనగర్ జిల్లా తీగల కుంటపల్లి గౌహెడశివారు,

వరంగల్ జిల్లా కొన్నె, పెద్ద పహాడ్, సిద్దంకి, సముద్రాల, అలీంపూర్, సూరేపల్లి, కోరుకొండపల్లి, రాయపర్తి, లియబెర్తి,

అనంతపురం జిల్లా గునిపల్లి, విద్రగట్ట,

నెల్లూరు జిల్లా చెన్నుగారిపాలెం,

కడప జిల్లా కల్లూరుపల్లి, కుమర కల్వ, వోగూరు, కొత్తూరు, వంకమాడ, నంద్యాలం పేట, నందిమండలం, జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాల, కోడూరు జిల్లా పరిషత్తు ఉన్నతపాఠశాల,

విశాఖపట్నం జిల్లా గన్నవరం (హరిజనవాడలో), ధర్మసాగరం, మల్లవరం, పురిటిపెంట, ముషిదిపల్లి – II, కింతాడ – II (పంచాయతీలు),

తూర్పుగోదావరి జిల్లా గద్దల పాలెం, కోటి,

గుంటూరు జిల్లా మదిపాడు,

కృష్ణా జిల్లా ములకలపల్లి, గూడవల్లి, తిప్పన్నగుంట – II, బల్లిపర్రు, జింజెరు, అభవదేవరపల్లి-III, పాగోలు-II, పురిటిగడ్డ,

ఖమ్మం జిల్లా రొంపేడ్,

నల్గొండ జిల్లా సర్వారం,

మహబూబ్‌నగర్ జిల్లా సతెర్ల, పద్మావరం, జాకారం, విశ్వనాధపురం, యదిర – II (రావిర్యాలలో), పెద్దూరు, తూడకుర్తి, పొల్కిపహాడ్



# భారీ విద్యుత్పరికరాల కర్మాగారం

రామచంద్రాపురం సమీపంలో భారీ విద్యుత్ పరికరాల కర్మాగారాన్ని నెలకొల్పడానికి భారత ప్రభుత్వం 1961 సెప్టెంబరులో ఆమోదించింది ఆ తరువాత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ కర్మాగారానికి కావలసి స్థలాన్ని స్వాధీనపరుచుకునేందుకు చర్యలు తీసుకున్నది కర్మాగారానికి నివేశన స్థలాన్ని ఉచితంగా ఇవ్వడానికి రాష్ట్ర ప్రభుత్వం ఉదారంగా అంగీకరించి 1961 డిశంబరు నుంచి దశలవారీగా భూమిని బదిలీచేయడం ప్రారంభించింది ఈ భూమి విస్తీర్ణం 6,000 ఎకరాలు దీనికి ఉత్తరాన హైద్రాబాదు-బొంబాయి జాతీయ రహదారి, దక్షిణాన రైలులైను వున్నాయి

మూడవ ప్రణాళికలో భారత - జెకోస్లవేకియాల ఆర్థిక సహాయ కార్యక్రమం క్రింద నెలకొల్పబడే నాలుగు భారీ పారిశ్రామిక కర్మాగారాలలో భారీ విద్యుత్పరికరాల యూనిటు ఒకటి

ఈ యంత్రాగారం సత్వర స్థాపనకై గైకొన్న ప్రారంభ చర్య లన్నింటిలో, ఇంజనీర్లు తదితర సాంకేతిక నిపుణుల శిక్షణ కొరకు చేసిన ఏర్పాట్లు చాలా ముఖ్యమైనవి సుమారు 250 మంది భారతీయ ఇంజనీర్లకూ, ప్రత్యేక సాంకేతిక నిపుణులకూ 24 నెలల వరకూ వివిధ కాల పరిమితులలో జెకోస్లవేకియాలో శిక్షణ గరపడానికి తొలుత జెకోస్లవేకియా సలహాదార్లు సూచించారు

డిజైను ఇంజనీర్ల శిక్షణకు చాలా కాలం పట్టుతుంది కాబట్టి 1962 మే నెలలో 54 మంది ఇంజనీర్లను ఎన్నికచేసి, నలుగురు జెకోస్లవేకియా బోధకుల సహాయంతో భూపాల్‌లో నిర్వహించిన పునశ్చరణ కోర్సులో వారికి ప్రవేశం కల్పించారు స్టీమ్ టర్బైన్లు, టర్బోఆల్టర్నేటర్లు, పంపుల డిజైను, సాంకేతిక విషయాలలో పునశ్చరణ కోర్సు శిక్షణ గరపడంతోపాటు జెక్ భాషను కూడా వీరికి బోధించారు పునశ్చరణ కోర్సు పూర్తయ్యాక 54 ఇంజనీర్ల తొలి జట్టు 1963 జూలైలో జెకోస్లవేకియాకు వెళ్ళింది రెండవ జట్టుకు హైద్రాబాదులో శిక్షణను ప్రారంభిస్తారు

## సాంకేతిక శిక్షణ పాఠశాల

జెకోస్లవేకియా నిపుణులతో సంప్రదించి రూపొందించిన శిక్షణ పాఠశాలకూ దాని అనుబంధ వర్క్-షాపుకూ జూలై 8వ తేదీన మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కామరాజ్ నాడార్ ప్రారంభోత్సవం చేశారు దీనిలో షిఫ్టుకు 400 మందిచొప్పున శిక్షణపొందడానికి అవకాశముంటుంది రెండు షిఫ్టులలో ఒకేసారి 800 మందికి శిక్షణ గరపడానికి వీలుంటుంది

శిక్షణ పాఠశాలను రెండంతస్థుల భవనంలో నెలకొల్పారు భవనం లోపలి విస్తీర్ణం 5,235 చదరపు మీటర్లు పర్యవేక్షక సిబ్బంది వసతి కొరకు దీనికి అనుబంధంగా ఒక విభాగం కూడా వుంది

రూ 40 లక్షలు విలువచేసే యంత్రాలు తదితర సాధన సామగ్రికి మంజూరీ లభించింది వీటిలో కొన్ని ఇక్కడికి చేరటం, వాటిని నెలకొల్పడం కూడా జరిగింది శిక్షితుల కొరకు 400 పడకల వసతిగల రెండు బ్లాకులను రూ 13 5 లక్షల వ్యయంతో నిర్మించారు వీటికి అన్ని సౌకర్యాలుగల ఒక సమిష్టి వంటశాల వుంది మనోల్లాసానికి కూడా ఇక్కడ సౌకర్యాలు కల్పించారు పారిశ్రామిక శిక్షణ సంస్థలలో అర్హత పొందిన వారిని దిగువ పేర్కొన్న వృత్తులలో శిక్షితులుగా చేర్చుకుంటారు -

(1) మెకానిక్‌లు, (2) ఫిట్టర్లు, (3) టర్నర్లు, (4) ఎలక్ట్రీషియన్లు, (5) షీట్ మెటల్ వర్కర్లు, (6) మౌల్డర్లు, డ్రాఫ్ట్స్‌మెన్

శిక్షణ 18 మొదలు 24 నెలల వరకు జరుగుతుంది శిక్షణను విజయవంతంగా ముగించిన వారిని ఫ్యాక్టరీలో 'బి' గ్రేడు ఆర్టిజాన్లుగా చేర్చుకుంటారు శిక్షితుల తొలి జట్టుకు శిక్షణ పూర్తికావడం ఫ్యాక్టరీలో ఉత్పత్తి ఆరంభం కావడం రెండూ ఒకేసారి 1965వ సంవత్సరంలో జరుగుతాయి

36 మంది బోధకులను 1962 నవంబరులో ఎన్నిక చేశారు వీరు ఆయా వృత్తి పనులలో క్రాఫ్ట్ ఇన్‌స్ట్రక్టర్ల శిక్షణను 1962 డిశంబరు నుంచి పొందుతున్నారు 1963 జూలై నెలాఖరులో కోర్సు ముగిశాక శిక్షణ పాఠశాలలో చేరుతారు

(తరువాయి 26 పేజీలో)

# ప్రాచీనతమ ద్రావిడభాష

లకంసాని చక్రధరరావు

నేడు వ్యవహరింపఁ బడుచున్న ఇరువది రెండు ద్రావిడ భాషలలో ఏది ప్రాచీన తమమనునదిప్రస్తుతాంశము[1] ఇతఃపూర్వము ద్రావిడ భాషా కుటుంబము, గూర్చి యత్యంతము కృషి యొనర్చిన కాల్డ్వెల్ మొదలగు వారికి ద్రావిడ భాషలు 22 ఉన్న వన్న విషయమే తెలియదు[2] ఇఁక వారికి తెలిసిన భాషలకే మూలభాష యొకటి యున్నదని అంగీకరించుచు అందేది ప్రాచీన తమ మను ప్రశ్నమునకు సమాధాన మొసగ కడగిరి ఇచట భాషలలో ఒక దానిని 'ప్రాచీన తమ' మని యే దృష్టితో వ్యవహ రింప జొచ్చిరో తెలుపవలసిన అవసర మున్నది మూలభాష నుండి విడివడిన మొదటిభాష యేదియో అది ప్రాచీన తమ భాషగా పరిగణింప వచ్చును మొదట మూలభాషనుండి విడివడిన భాషలో మూల భాషా గత లక్షణము లనేకములు కనబడును నేటి ద్రావిడ భాషలను పరిశీలించి యిందుగల భాషా లక్షణములను మూల ద్రావిడ భాషా లక్షణములతో పోల్చి యే భాషయందు మూల ద్రావిడ భాషా లక్షణము లున్నవో కనుగొనవలెను ఈ పరిశోధనమునకు ఋజుమార్గ మొకటియే సుగమము

ద్రావిడ భాషలలో ఏ యొకటియు ప్రాచీనతను ప్రతిబింబించుటకు ఆదర్శ ప్రాయముగా ఉండదనియు కాని యీ విషయమును నిరూపించుటకు ప్రతి భాషయు కొంతవరకు తోడ్పడు ననియు అట్లయ్యు తదితర భాషలకంటె 'తమిళము' అధికముగా తోడ్పడుననియు కావున ఇతర ద్రావిడ భాషలకంటె తమిళము ప్రాచీన నాగరిక భాషలలో బహు ముఖ్యమయిన దనియు ఏ యితర ద్రావిడ భాషయందును తమిళ మందువలె వాఙ్మయ వ్యవసాయము చేయని కాల్డ్వెలుగారి అభిప్రాయము[3] నేటికిని కొందఱు తమిళ పండితులు తమిళమే యితర ద్రావిడ భాషలకు మూలమను వారు కలరు తమిళము మూల ద్రావిడ భాషలో అభిన్నమని వారి ఉద్దేశము ఇట్టి వితండ వైఖరిని ఖండించు అభిప్రాయముతో శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు తమిళము కంటె ఆంధ్రాది భాషలలోనే మూలద్రావిడ భాషాగత లక్షణము లధికముగా కలవనియు గ్రియర్సన్ గారట్టి నిదర్శనముల నీయజాల కుండిరిగాన వారే కొన్ని ఉపపత్తులను ప్రదర్శించెదరనియు ప్రకటించిరి[4] తెలుగు తమిళముకంటె ప్రాచీన తరమని చెప్పుటయే వారి వాద ఫలితము ఇక పాశ్చాత్య భాషా శాస్త్రపండితులైన టటిల్ (Tuttle) యూల్ బ్లాక్ (Jules Bloch) మొదలగు వారు మధ్యద్రావిడ భాషలలో అనాగరక భాషలుగా పేరువడసిన గోండి, పర్జీ, కుఇ, కువి, మొదలగు ద్రావిడభాషలే భాషాతత్త్వ పరిశోధన సందర్భమున తమిళముకంటె అధికముగా సాహాయ్యకారులు కాగలవనియు ఆ కారణమున యీ భాషాశాస్త్రాధ్యయన మును తమిళాది నాగరక భాషా పరనముతో ఆరంభించుటకంటె అనాగరకాటవిక భాషా పరిశీలనముతో మొదలిడుట ప్రయోజనకారి

---

1 ఉత్తర ద్రావిడ భాషలు 1. బ్రహూఈ 2 కురుఖ్ 3 మాల్తో
మధ్యద్రావిడ భాషలు 1 కుఇ 2 కువి 3 కూబి 4 కోయ 5 పర్జీ 6 నాయికీ 7 ఒల్లారి 8 కోలామి 9 గోండి 10 గదబ 11 తెలుగు
దక్షిణ ద్రావిడ భాషలు 1 తమిళము 2. కన్నడము 3 మలయాళము 4 తుళు 5 కొడగు 6 బడగ 7 తోద 8 కోట

2 కాల్డ్వెలుగారు పేర్కొనిన ద్రావిడ భాషల సంఖ్య మొత్తము పండ్రెండు (బ్రాహూఈ ని విడిచిరి)
" The idioms which I designate as 'Dravidian' are twelve in number, exclusive of Brahmi
(1) Cultivated Dialects 1 Tamil 2 Malayalam 3 Telugu 4 Canarese 5 Tulu 6 Kudagu
(2) Uncultivated Dialects 1 Tuda 2 Kota 3 Gond 4 Khond 5 Orayan 6 Rajmahal
(Comparitive Grammar of the Dravidian Languages – Caldwell – 1913 Page 6 )

3 Refer to Pages 136, 137 of Caldwell

4 తెలుగు భాషమే అన్ని ద్రావిడ భాషలలోను ప్రాచీనతమ మని మొదట ఆంధ్ర పత్రిక వృషసంవత్సరాది సంచికలో ఒక వ్యాసము ప్రచురించబడెను

అనియు తమ తమ గ్రంథములలో వ్రాసిరి[5]. ఆధునిక భాషాశాస్త్రవేత్తల అభిప్రాయములిందుకు భిన్నముగా ఉన్నవి మూలద్రావిడమను ఒక ఊహాసిద్ధమైన భాషనుండి కాలక్రమమున కలిగిన మార్పులవలన విభిన్నములును స్వతంత్రములును అయిన భాషలేర్పడెను ఈ భాషలకుగల సజాతీయతా సంబంధముచే వీని నన్నిటిని ఏకభాషా కుటుంబముగా భావింపవలెను ఇవి అన్నియు ఒక మూలభాషా జన్యము లని చెప్పబడినప్పుడు వీనిని సోదర భాషలని తలపవలెనే కాని వీనిలో దేనినుండి ఏది జనించినదని ప్రశ్నము అసందర్భమని అనక తప్పదు ఒకే మూలభాషనుండి ఏర్పడిన సజాతీయ భాషలని వ్యవహరింప బడుచున్న తమిళము, కన్నడము, తెలుగు, పర్జీ, బ్రాహూఈ, మొదలగు వాని విషయములో ఒక భాష నుండి మరియొక భాష జనించిన దని గాని యిందొక భాష పురాతనమనియు వేరొకభాష అధునాతన మనియు భావింపతగదు ఎవరి భాషయందు వారికి కల ఎక్కువ మక్కువ కారణముగా ఆయా భాషలత్యంత ప్రాచీనములని అనుకొనుచున్నారు

తెనుగు, కన్నడములందిప్పటికి లభించిన వాఙ్మయముకంటె, తమిళ భాషయందు అత్యంత ప్రాచీన వాఙ్మయము కలదు[6] అనేక పదరూపముల ప్రాచీన స్వరూపనిరూపణమందు అరవము కడు సాహాయ్యకారి అగుచున్నది ఇంత మాత్రముననే యితర ద్రావిడ భాషలన్నియు తమిళ భాషా జన్యములని కాని తమిళభాష మూలభాషతో అభిన్నమని కాని విజ్ఞులు విశ్వసింపరుకదా! కొన్ని సహజ లక్షణములొక భాషయందు మార్పునొందక నిలచియుండగా మరికొన్ని విశిష్ట లక్షణములు ఇంకొక భాషలో స్థిరపడి ఉండవచ్చును క్రీస్తునకుపూర్వమే తమిళ భాష గ్రంథస్థ మగుటచే అందుఆధారములు అధికముగ లభించుననుటలో సందేహము లేదు అంత మాత్రముననే యిది మిగిలిన భాషలకంటె ప్రాచీనతరమని చెప్పతగదు

కాల్డ్వెలుగారు వ్రాసిన విషయము వాస్తవము కాదనియు తెలుగు మొదలయిన తదితర భాషలలో అరవ భాషయందున్న వానికంటె పలుపురాతన విశేష రూపములు విదితములు కావున అరవము యితర భాషల వలె ఒక సోదరభాషయే కాని ఇతరభాషలకంటె ప్రాచీనమని చెప్పుట ఒప్పదని గ్రియర్సన్ పండితుడు వ్రాసెను తమిళ భాషా ప్రాచీనతను గ్రియర్సన్‌గారు ఆక్షేపించినను ఆంధ్రాది భాషలనుండి గ్రహింపదగు ప్రాచీన భాషాలక్షణములను తెలుపు ప్రత్యేకోదాహరణములను ఒసగరైరి ఈ లోపమును పూరించుటకు శ్రీ లక్ష్మణరావుగారు యత్నించిరి వీరి మతమున తెలుగు తమిళముకంటె ప్రాచీనతరభాష. వీరుకొన్ని పదములను గ్రహించి ఆ పదములు తమిళ పదములకంటె ప్రాచీనములని తెలిపిరి. తెనుగున పదాది సంయుక్తాక్షర రూపములు వర్ణ వ్యత్యయమువలన ఏర్పడును దానికి మూలములైన వర్ణములు ర ట టి లలో ఏదో ఒకటై ఉండును[7] తెలుగున ఏర్పడిన యీ అర్వాచీన పరిణామమును శ్రీ లక్ష్మణరావుగారు ప్రాచీనముగా భ్రమించిరి పదాది సంయుక్తాక్షర రూపములు ద్రావిడభాషా వ్యవహర్తలకు అసహజములు 22 ద్రావిడ భాషలలోను తెలుగు, కుఇ, భాషలలోనే పదాది సంయుక్తాక్షర రూపములు వర్ణవ్యత్యయము కారణముగా ఏర్పడెను[8] రేఫము ద్వితీయ వర్ణముగాగల పదాది సంయుక్తాక్షరములు తెలుగున కలవు ఎల్ వి రామస్వామి అయ్యర్, ఆల్‌ఫ్రెడ్ మాస్టర్ మొదలయినవారు పదాది సంయుక్తాక్షర రూపములను పెక్కింటిని పరిశీలించిరి[9] రామస్వామి అయ్యర్‌గారు ఊనిక మార్పువలన పదాద్యచ్చులోపించి పదాది సంయుక్తవర్ణము లేర్పడెనని భావించిరి కాని మూలధాతువు చివరనున్న రెండు వర్ణములును, వర్ణవ్యత్యయము (metathesis) చెందుటచేతను అచ్ సంకుచితత్వము (Vowel contraction) వలనను తెలుగులో పదాది సంయుక్తాక్షరము లేర్పడును.

---

5 "If we want to understand the history of the languages of the south, we should begin from the Northernside" (E F Tuttle pre-Aryan and pre-Dravidian)

6. "తిరుక్కురళ క్రీస్తు పూర్వము రెండవ శతాబ్దియందు వ్రాయఁబడి యుండవచ్చుననియును తొల్కాప్పయ మంతకంటె రెండుశతాబ్దములు ముందుండ వచ్చుననియును దీక్షితరుగారి యుద్దేశము

(Studies in Tamil literature by Dikshitar page 21)

7, "Where as in consonant clusters *r derives from three pdr phonemes *r*ṯ [–r–]–] and * ḻ "

(Telugu Verbal Bases – Dr Bh Krishna Murty page 58)

8 "The occurrence of consonant groups in the initial porition is not a common Dravidian characteristic, but during the pre-historic period Telugu and kui formed initial consonant clusters through metatheris attended by vowel contraction in some cases " (Telugu Verbal Bases Dr Bh Krishna Murty, page 58)

9 L V Ramaswami Aiyar Quarterly journal of Mythic Society 22 (448–480)
Alfred Master Bulletin of the school of Oriental and African Studies – xii (340–364)

| మూలద్రావిడము | మూలాంధ్రము | శాసనాంధ్రము | గ్రాంథికాంధ్రము | వ్యావహారికము |
|---|---|---|---|---|
| 1 *కొఴుల్ > | *కొళ్వ్ > | క్ట్వవ్ > | క్రొవ్వు > | కొవ్వు |
| *కఴిమ్ > | *కళ్మ్ > | క్ట్మమ్ > | క్రమ్మ > | కమ్మ |
| *తర్వ్ > | *తర్మ్ > | త్రవ్వ్ > | త్రవ్వు > | తవ్వు |
| 2 *కుఴివ్ > | *క్ట్జొ-అవ్ > | క్ట్జోవ్ > | క్రోవి > | కోవి(?) |
| *పఴి > | *ప్ట్జ-అ > | ప్ట్జా (త) > | ప్రా (త) > | పాత |
| *పొఴిల్ > | *ప్ట్జొ-అల్ > | ప్ట్జోల్ > | ప్రోలు > | పోలు (-వోలు) |

కు ఇ. తెలుగు భాషలయందు తక్క-తక్కినయన్ని ద్రావిడ భాషలయందు పదాదిని 'అసంయుక్తరూపములే కన్పించుటయు, ఆంధ్రప్రాచీన శిలాశాసనములలో పదాదిని రేఫ ఘటిత సంయుక్త రూపముల కంటె అకార ఘటితరూపములే అధికముగా కన్పించుటయు పరిశీలింప ఈ రేఫ మర్వాచీన పరిణామ మనక తప్పదు

పదాదిని సంయుక్తాక్షరముల నుపయోగించుట కష్టమనియు ఈ కష్టదశను తెలుగువారేల కొనితెచ్చిపెట్టుకొనిరనియు ఒక వాదమును శ్రీ లక్ష్మణరావుగారుపూజ్యులుప్రారంభించిరి వీరికి మన స్తత్వ శాస్త్రము పరమ ప్రమాణము తచ్ఛాస్త్రమందు విశేషకృషి యొనర్చి యిట్టి నిర్ణయములను వీరొనర్చిన బాగుగ నుండెడిది ఏమయినను సమాధాన మొసగవలసిన బాధ్యత మాత్రము మనకు కలదు

ప్రజలు పదాది సంయుక్తాక్షరముల నుచ్చరింప కష్టపడుదురనుట నిజముకాదు ఎవరిభాషా సంప్రదాయము వారికున్నది నేటి ఆంగ్లమునపదాదినెన్ని సంయుక్తారములను పలుకుచున్నారో పరిశీలింపుడు10 కు ఇ భాషలో నేటికిని పదాదిని సంయుక్తాక్షరములు కలవు11 పదాది సంయుక్తాక్షరముల నుచ్చరించుట వారికి సులభమే ఈ వాద ప్రారంభ కానుయాయులు వారియొద్దకు వెడలి వారట్లుచ్చరించుటలో కష్టపడుచున్నారో, సుఖపడుచున్నారో తెలిసికొనుట మంచిది ఆంధ్రభాషలో మధ్యకాలమున ఏర్పడిన పదాది సంయుక్తాక్షరములను ఆనాటి వ్యవహర్తలు కఠినముగా భావించి ఉండ లేదు నన్నయభట్టారకుని కాలమునకు పదాది రేఫఘటిత రూపములు ప్రచురముగాగలవు

"మేరు మహా మహీధరము మీఁదికి నందఱు వోయి యేక్రియన్ వారిధిఁ ద్రచ్చువారము''... .

(సౌపర్ణో పాఖ్యానము - 9)

"క్షోణీ చక్ర భరంబు క్రక్కఁదల దిక్కుల్ మ్రోయగా''

(సౌపర్ణో పాఖ్యానము - 12)

''మృదుఁడు గడంగి పట్టుకొని మ్రింగి గళంబున నిల్పెఁ జెచ్చెరన్ "

(సౌపర్ణో పాఖ్యానము - 15)

''క్రమ్మరంగ నమృతము గొనియెన్"

(సౌపర్ణో పాఖ్యానము - 16)

ఈ సందర్భమున ఆంధ్ర శబ్ద చింతామణిలోని ఈ శ్లోకమును జ్ఞప్తియందుంచుకొన వలెను

"సిద్ధిర్లోకా ద్దృశ్యా
లోకాఽనశ్యాదృశశ్చ నిత్యశ్చ
సంస్కారా ర్ధోనియమోఽ
నియమాద్గ్రామ్యంహియ త్త్వ పభ్రంశః"

కాని నేడీ రేఫము (పదాది) తెలుగున నున్న అన్ని పదములందును (వ్రాయి - రాయి- ఇది తక్క- ) పూర్తిగా భ్రష్టమైనది

మిఱుంగు > మ్ట్జింగు > మ్రింగు > మింగు

పుఴోలు > ప్ట్జోలు > ప్రోలు > పోలు > వోలు

ఇవి క్రమ పరిణామము

కుహనా మానసిక శాస్త్రవేత్తల ప్రకారమిట్లు కావలెను.

మ్రింగు > మిరుంగు > మిఱుంగు > మింగు

ఈ అక్రమపరిణామమందలి దోషములు

1 ప్రప్రథమమున రేఫము సంయుక్త వర్ణముగా పదాదిని గలదనుటకు ప్రమాణ మేమియును లేదు (వారిభ్రమతప్ప)

2 మిరుంగు వంటి విప్రకర్ష రూపముల కొక్క- ప్రయోగమును సాహిత్యమున కాని శాసనములందుకాని ఎవ్వరును చూపలేరు.

3 రేఫము అకారముగా మారినదని వాదించినచో ఘట్టకుటీప్రభాతన్యాయము తప్పక జ్ఞప్తికి రాగలదు రేఫముకంటె అకారోచ్చారణము వారి ప్రకారమే కష్టతరముకదా!

( మిగతా 38 వ పేజీలో )

10 Brush, Brutalists, Criminal, Cross, Drum, Dry, Frog, Fruit, Grace, Grape, Practic, preamble, Proverb, Traveller, Treatment

11 కు ఇ త్లొ (ఏకవచనము) త్లాక (బహువచనము)=తల. మ్లింగ=ప్రక్కకు తిరుగు. మ్రీక=కొడుకులు. మ్రాదు=కుందేలు. మ్లేర్స=మెత్తని

(A Dravidian Etymological Dictionery T, Burrow and M B Emeneau 1961 )

# దోషాతనమ్

కె. వి. సుబ్బారావు

క్రొక్కొరోకోయంచు కోడి కూసినది
నిక్కి నిక్కి వేగు చుక్క చూచినది ॥కొక్కొ॥

చుక్కకన్నెలతోడ నెక్క సక్కెములాడు
జొన్నముత్యాలలో కన్ను మోడ్చిన చిన్ని
చిలుక పేరంటాలు కిలకిలానవ్వినది
రైతుకూతురుమంచె గబగబాఎక్కినది ॥కొక్కొ॥

కటిక చీకటినేదొ కస్సుమన్నదినేడు
కంచెలోనెదొ కుట్ర పొంచియున్నదిచూడు
కంగారుపడెనంచు కళవళింతురొమీరు
కాంచరేవడిసేల కన్నెవీచినతీరు ॥కొక్కొ॥

కొమ్ముపొట్టెలుగిట్ట గోరాడినది నేల
కొంకికత్తినిపుంజు జంకించినది కాల
కొండగోగులుపూచె క్రొన్నెత్తుతిలకాలొ
గుండెపైనితుపాకి గుండ్లుగ్రుచ్చిన పూలొ ॥కొక్కొ॥

బంగారుకిరణాలు వంగె విన్వీధిపై
రంగవల్లికలల్లి రంగారెముంగిళ్ళ
కొంగలూ పెరుమాళ్ళ కోనేటిగట్టుపై
చెంగు చెంగున చిన్ని చేపలన్ వేటాడె ॥కొక్కొ॥

మంచు మలకరికాలు మకరసర్పము ౹మింగె
మనపాలకడలిలో మలిన రక్తముపొంగె
ఉగ్రభారతి! లెమ్ము! ఉన్నిద్రితవుగమ్ము!
ఉరు సుదర్శననామకోష్ణ రశ్మివిగమ్ము ॥కొక్కొ॥



( 22 వ పేజీ తరువాయి)

## జాతీయ సంపద

రామచంద్రాపురంలో జూలై 8 వ తేదీన జరిగిన ప్రారంభోత్సవంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ ఎన్ సంజీవరెడ్డి కేంద్ర ఉక్కు, భారీ పరిశ్రమల శాఖా మంత్రి శ్రీ సి సుబ్రహ్మణ్యంగారలు పాల్గొన్నారు ఆ సందర్భంలో ప్రసంగిస్తూ వారు ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధికి మాత్రమే గాకుండా తద్వారా దేశాభివృద్ధికి కూడా దోహదం చేయగల ఈ జాతీయ ప్రాజెక్టుయొక్క ప్రాముఖ్యతను గురించి నొక్కి చెప్పారు

ఇక్కడి భారీ విద్యుత్పరికరాల యంత్రాగారంలో స్టీమ్ టర్బైన్లు, టర్బో ఆల్టర్నేటర్లు, పంపులను ఉత్పత్తిచేసే పది భారీ షాపులు, ఫౌండ్రీ వర్క్‌షాపులు, వెల్డింగ్ షాపు, పాటర్న్‌షాపు, టెస్ట్ రూమ్ మొదలైనవివుంటాయి ఇవన్నీ 172,485 చదరపు మీటర్ల విస్తీర్ణంలో ఆవరించి వుంటాయి దీనికి ఆక్సిజన్ ప్లాంట్, ఎసిటిలిన్ ప్లాంట్, గ్యాస్‌పౌడర్స్‌వంటి స్వంతసర్వీసు విభాగాలు కూడా వుంటాయి ఫ్యాక్టరీని తక్కువ కాలం విడి భాగాలతో కంపోజిట్ యూనిటుగా రూపొందించారు దీని ప్రాంగణం విస్తీర్ణం 11,56,000 చదరపు మీటర్లు లేదా సుమారు 318 ఎకరాలు వుంటుంది స్టీమ్ టర్బైన్లు, టర్బో ఆల్టర్నేటర్లను ఉత్పత్తి చేయడానికి వినియోగపడే పదార్థాలు దాదాపు 700 టన్నుల మేరకు ఏటా ఉత్పత్తి అవుతాయి ఉత్పాదక శక్తిని రెట్టింపు చేయడానికి వీలుగా దీనిని రూపొందిస్తున్నారు ఒక్క ఫ్యాక్టరీకే దాదాపు రూ 27 5 కోట్లు ఖర్చవుతుందని అంచనా ఇది ఏటా రూ 14 కోట్లు విలువచేసే పరికరాలను ఉత్పత్తి చేయగలుగుతుంది



# బంగారం కంట్రోలు ఎందుకు ?

బంగారం కంట్రోలు నిబంధనలను 1963 జనవరిలో అమల్లోనికి తెచ్చారు తరువాత వాటిలోకొన్ని అంశాల విషయంలో సవరణలు చేశారు

మన విదేశద్రవ్యం వనరులను పదిల పరచుకోవడమే బంగారం కంట్రోలు ఉత్తర్వు ప్రధానలక్ష్యం పైవేటు వ్యక్తులు దొంగచాటుగా పెద్ద మొత్తాలలో బంగారాన్ని నిలవచేయడానికి మన విదేశ మారకం ఆదాయాలు ఖర్చుకాకుండా నివారించడం ద్వారా యీ లక్ష్యాన్ని సాధించ ఉద్దేశించబడింది

ఇటీవలి సంవత్సరాలలో విదేశాలనుంచి బంగారం దొంగచాటు రవాణా చెప్పుకోదగినంతగా పెరిగింది ఆ దొంగ రవాణావ్యాపారంలో లాభాలుకూడా హెచ్చాయి రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభానికి ఒక ఏడాది ముందు అంటే 1937-39 లో బంగారం గరిష్ఠ ధర పదిగ్రాములకు దాదాపు 31 రూపాయలు జనాభా పెరగడంవల్ల అయితేనేం, ప్రజల జీవనస్థాయి పెరగడంవల్ల అయితేనేం, యుద్ధ కాలంలోను ఆ తర్వాత రాబడులు పెరిగినవారు బంగారం రూపంలో సొమ్ము నిలవచేసుకోవడంవల్ల అయితేనేం, బంగారం ధర క్రమంగా పెరుగుతూ వచ్చింది. 1962 ఆగస్టు నెలాఖరుకు బంగారం ధర ఆకాశాన్నంటింది పది గ్రాముల బంగారంధర 129 రూ ల 90న పై అయింది పదిగ్రాముల బంగారం ప్రమాణ ధర 1949 సెప్టెంబరు 21 వరకూ రు 37 22 న పైసలు ఆ తరువాత రు 53 58 న పైసలు మాత్రమే 1962 నవంబరు నెలమధ్యవరకూ అనుమతించబడిన బంగారం వాయిదా వ్యాపార ఫలితంగాకూడా బంగారం ధర పెరుగుతూ వచ్చింది

బంగారం అంతర్జాతీయధరకూ, స్వదేశంలో ధరకూ వ్యత్యాసం హెచ్చడంతో దొంగ రవాణా వ్యాపారంమరింత లాభదాయకమయింది సాలీనా దాదాపు రు 40 నుంచి 60 కోట్ల వరకూ విలువైన బంగారం దేశంలోకి దొంగ చాటుగా రవాణా అవుతోందని అంచనా వ్యాపారశేషం పరిస్థితి క్లిష్టంగా వున్న ఇండియావంటి దేశానికి యిది భరించరాని భారమే.

## దొంగ వ్యాపారుల యుక్తులు

బంగారం దొంగ రవాణాకు అనేకవిధాల పెట్టుబడి సమకూర్చుకోబడుతుంది బంగారం దొంగచాటున దిగుమతి చేసుకునే భారతవ్యాపారులు తాము ఎగుమతి చేసే యితర సరకులకు తక్కువధరలు వ్రాయించుకోటం దిగుమతిచేసే సరుకులకు హెచ్చు ధరలు వ్రాయించుకోవడం అనుమతి లేకుండా భారత కరెన్సీని విదేశాలకు పంపి అక్కడ దానిని విదేశ కరెన్సీగా మార్చుకోవడం యీ మొదలైన పద్ధతుల ద్వారా బంగారం దొంగరవాణా వ్యాపారానికిసొమ్ము సమకూర్చ బడుతోంది

దొంగ రవాణాను అరికట్టడానికి అనేక చర్యలు తీసుకోబడ్డాయి భారత వ్యాపారులు బంగారాన్ని దొంగచాటు రవాణా చేసుకునేందుకుగాను భారత కరెన్సీని పంపడానికి వీలులేకుండా పర్షియన్ సింధు శాఖ ప్రాంతంలో చెలామణికి 1959 లో ప్రత్యేక భారత కరెన్సీనోట్లు ప్రవేశ పెట్టబడ్డాయి ఇది మొదటిచర్య భారతవ్యాపారులు తాము ఎగుమతిచేసే సరకులకు తక్కువధర వ్రాయించుకొని దిగుమతి చేసుకునే సరకులకు హెచ్చుధర వ్రాయించుకొని విదేశాలలో సొమ్ముదాచి, ఆ సొమ్ముతో బంగారాన్ని దొంగతనంగా దిగుమతి చేసుకుంటున్నందున, యీ అవినీతిని నివారించేందుకుగాను, కొత్త కష్టమ్స్ చట్టంక్రింద ఎగుమతయిన లేదా దిగుమతయిన సరకుల విలువను అధికారులే నిర్ణయించేందుకే అవకాశం కల్పించారు ఇది రెండవ చర్య కష్టమ్స్ చట్టానికి అమలు జరిపే ప్రభుత్వ యంత్రాంగాన్నికూడా కట్టుదిట్టం చేశారు అంతేకాదు, భారత కరెన్సీనోట్లు విదేశాలకు పోకుండానూ భారతదేశానికి జమ కావలసిన విదేశ మారకద్రవ్యం నష్టం రాకుండానూ చూసేందుకుగాను విదేశ మారక ద్రవ్యం కంట్రోలు నిబంధనలను సవరించారు

అయితే యీ చర్యలన్నీ పరిమితంగానే లక్ష్యాన్ని సాధించ గలవు బంగారం దొంగచాటు రవాణాను అరికట్టి దేశంలో బంగారానికి గిరాకీ తగ్గిస్తేనేతప్ప, లక్ష్యంపూర్తిగా సిద్ధించదు బంగారం కంట్రోలు నిబంధనలు

యిందుకు తోడ్పడతాయి అందుకనే అంత వరకు తీసుకోబడిన చర్యలతోడు బంగారం కంట్రోలు ఉత్తర్వునుకూడా జారీ చేశారు

### తొందరపాటు చర్యకాదు

నేటి అత్యవసర పరిస్థితిదృష్ట్యా విదేశ మారకద్రవ్యం నిలవలను భద్రపరచుకోవడం చాలాముఖ్యమే అయినా బంగారు కంట్రోలు నియమావళి ఏదో తాత్కాలిక పరిమిత ప్రయోజనాన్ని సాధించడానికి ఉద్దేశించ బడినదికాదు తొందరపాటుగా తీసుకున్న చర్యకూడా కాదు హెచ్చు మొత్తాలలో బంగారం దేశంలోకి దొంగ తనంగా రవాణా అవుతోందని చాలాకాలంగా తెలిసిన విషయమే దేశంలో బంగారానికి గిరాకీ తగ్గించకపోయినా, దొంగ రవాణాను అరికట్టకపోయినా (1) బంగారం అంతర్జాతీయ ధరకూ భారతదేశంలో ధరకూ వ్యత్యాసం విపరీతంగా హెచ్చే అవకాశం వుందనీ, (2) బంగారం దొంగరవాణా వ్యాపారంలో లాభాలు చాలా పెరుగవచ్చునని, (3) దొంగరవాణా వ్యాపారం చాలా లాభదాయకమైనందున అది మరింత విస్తృతం కావచ్చుననీ, తత్ఫలితంగా భారత విదేశ మారకద్రవ్యం యింకా హెచ్చుగా నష్టమవవచ్చుననికూడా తెలిసిన విషయమే ఈ స్థితిని దృష్టిలో వుంచుకునే, బంగారం కంట్రోలు నియమాలను రూపొందించారు చాలానెలలపాటు వీటి సాధక బాధకాలను గురించే జాగ్రత్తగా పరిశీలన జరిపారు తరువాతనే వీటిని ప్రవేశ పెట్టారు

### అనివార్యం

బంగారం కంట్రోల్ నియమావళి (యికపైన వాటికి చేసే సవరణలూ) ప్రధానంగా బంగారం దొంగరవాణా వ్యాపారం సాగించేవారిని ఆట కట్టించడానికే ఉద్దేశించబడినందున, ప్రభుత్వం తీసుకునే చర్యలను ముందుగా ప్రకటించక, హఠాత్తుగా ఉత్తర్వులను జారీచేయడం అనివార్యమే అవుతుంది బంగారంపట్ల ప్రజల అభిప్రాయాలనూ, సాంఘిక అలవాట్లనూ చట్టం సహాయం లేనిదే మార్చడం కష్టం ప్రచారంద్వారా ప్రజల అలవాట్లలో మార్పుతెచ్చి, చట్టాన్ని ప్రవేశ పెట్టవచ్చును కాని ప్రజలు తమ పాతభావాలను పోగొట్టుకొని కొత్త అలవాట్లు చేసుకునేందుకు చాలాకాలం పడుతుంది ఈ లోగా, దేశానికి చాలా నష్టంకలుగుతుంది

### ఇబ్బందికలిగే వర్గాలు

స్వర్ణకారులను మినహాయిస్తే యీ ఉత్తర్వులవల్ల సంఘంలో ఉన్నతవర్గాల వారికీ మధ్య తరగతి ప్రజలకూ మాత్రమే కొద్దిగా యిబ్బంది కలుగుతుంది ఏమంటే వారు మేలిమి బంగారంతో నగలు చేయించుకోలేరు నిజానికి జనాభాలో అధిక సంఖ్యాకులు తమ దైనందిన జీవితంలో బంగారాన్ని చెప్పుకోదగిన పరిమాణంలో ఉపయోగించుకోనే ఉపయోగించుకోరు

ఉన్నత వర్గాలూ మధ్య తరగతి ప్రజలూ కూడా 14 క్యారట్ల బంగారంతో నగలు చేయించుకొనేందుకు సుముఖులయితే, యీ ఉత్తర్వువల్ల నిజమైన యిబ్బందేలేదు ప్రపంచంలో ఏ దేశంలోనూ కూడా మన దేశంలో ఉపయోగించి నంతగా, నగానట్రా చేయించుకునేందుకు మేలిమి బంగారాన్ని వాడరు మన దేశంలో సాంఘిక అలవాట్లలోనూ, ఉన్నత వర్గాలు, మధ్య తరగతి ప్రజల దృక్పథంలోనూ మార్పు ఏనాడో వచ్చివుండవలసి వుంది

ఇప్పుడు ఉత్పత్తి అవుతున్న నగలూ, తదితర వస్తువులలో బంగారం పరిమాణాన్ని తగ్గించకుండా, 14 క్యారెట్ల నియమాన్ని ఎందుకు ప్రవేశ పెట్టవలసి వచ్చింది? అని ప్రశ్నించ వచ్చు అందుకు కారణాలివి. (1) బంగారం సప్లై, గిరాకీల సమస్థితిని సాధించడం, (2) బంగారం ధర శాశ్వతంగా తగ్గేటట్లు చూడడమూను

14 క్యారెట్ల బంగారం లేదా అంతకు తక్కువ వన్నెగల బంగారంతో తయారు చేయబడిన నగలు అన్ని ముఖ్యనగరాలలోని బంగారు దుకాణాలలోనూ విక్రయించబడుతున్నాయి ఆ నగలలోని బంగారానికి చాలా మంది బంగారు నగల వ్యాపారులు హామీకూడా యిస్తున్నారు మేలిమి బంగారం (నిజానికి యీ నగలు కూడా 24 క్యారెట్ల బంగారంతో చేసినవి కావు) నగలే కావాలని అనుకోకుండా వున్నా, వేలంవెర్రిలాగ కొత్తనగలకోసం ఎగబడకుండా వున్నా 14 క్యారెట్లు లేదా అంతకు తక్కువ వన్నెగల బంగారంతో చేసిన నగలు సరసమైన ధరలకే లభిస్తాయి

మజూరీ ఎక్కువ పుచ్చుకోవడం 14 క్యారెట్ల బంగారు మిశ్రమం ఖరీదు హెచ్చు వుండడంవల్ల 14 క్యారెట్ల బంగారంతో చేసిన నగలు హెచ్చు ధరగా వుంటాయని అనుకోవడం పొరపాటు మేలిమి బంగారు నగలకన్న, 14 క్యారెట్ల బంగారు నగలు చేయడానికి ఎక్కువ ఖర్చే అయినా, నిర్ణీత మొత్తం బంగారాన్ని ఉపయోగించి యితర లోహాలతో మిశ్రమం తయారు చేసి ఎన్నో నగలు చేయవచ్చు 14 క్యారెట్ల బంగారు నగలకు వ్యాపారులు హెచ్చుధర తీసుకుంటున్నారన్న ఫిర్యాదు నిలవదు ఏమంటే ఆ నగల కోసం ఒకరితో ఒకరు పోటీగా ఎగబడకుండా వుంటే, వాటి ధరలు తగ్గుతాయి

14 క్యారెట్ల బంగారం లేదా అంతకు తక్కువ వన్నెగల బంగారంతో తయారైన నగలు చాలా ఆకర్షణీయంగా వుంటాయి వాటిని అనేక నమూనాలలో తయారు చేసుకోవచ్చును వారి వారి అభిరుచులకు అనుగుణ్యంగా ఆ నగలకు రంగులు వేయించుకోవచ్చును 14 క్యారెట్ల బంగారంతో, వస్తువులకు పూతపూయించుకో వచ్చును పెద్ద కష్టం లేకుండా రసాయనిక మార్పులను నివారించ వచ్చును

మంగళసూత్రాలకూ, పెళ్ళి ఉంగరాలకూ మేలిమి బంగారాన్నే ఉపయోగించాలనీ, తక్కువ స్వచ్ఛతగల బంగారాన్ని ఉపయోగించరాదనీ మతనియమమేమీ లేదు. 14 క్యారెట్ల బంగారంతో మంగళ సూత్రాలూ,

పెళ్ళి ఉంగరాలూ అందమైన నమూనాలలో ఆకర్షణీయంగా తయారు చేయబడుతున్నాయి చాలా మంది వాటిని వాడుతున్నారు కూడాను

తక్కువ విలువైన లోహాలతో, తయారు చేసి బంగారుపూత పెట్టిన నగలు బజారులో చాలా సంవత్సరాలుగా విక్రయించబడుతున్నాయి కలకత్తా, మద్రాసు, మచిలీపట్నం, అమృత్‌సర్ మొదలైన కేంద్రాలలో యివి చాలా కాలంగా తయారు అవుతున్నాయి వెండినగలూ, రోల్డుగోల్డు నగలూ, నకిలీ రాళ్ళతో తయారు చేసిన గాజు, దంతపు నగలూ కూడా యిదివరకు వాడుక చేయబడ్డాయి ఇప్పుడు మళ్ళీ వాటిని ప్రవేశపెట్ట వచ్చు

## సమాచారం వెల్లడి

ఆభరణాల రూపంలో లేని బంగారం తమవద్ద ఎంత ఉందో తెలియజేయాలని ప్రభుత్వం కోరింది దేశంలో యిట్టి బంగారం ఎంతవుందో తెలుసుకునేందుకూ దొంగ చాటుగా రవాణా అయ్యే బంగారం ఆచూకి తీసేందుకూ యీ నిబంధన వీలు కలిగిస్తుంది

దాదాపు 13 వేలమంది వ్యక్తులు ఆభరణాల రూపంలో లేని బంగారం ఎంత ఉందో తెలియజేశారు ఇలా తెలియజేయబడిన బంగారం మొత్తం అనుకున్న ప్రమాణం కంటే చాలా తక్కువగా వుంది అయితే, ఎంతవరకూ యింకాదాచబడివుందో దేశంలో బంగారం నిలవలను గురించి పూర్వపు అంచనాలు ఎంతవరకూ నిజమో చెప్పడం కష్టం ఎవరిదగ్గరైనా ఆభరణాల రూపంలో లేని బంగారం వుంటే, యింతవరకూ ప్రకటించక పోయినా, యిప్పుడైనా అది ఎంత మొత్తం వుందో ప్రభుత్వానికి తెలియజేయడం వారికి మంచిది

దేవాలయాలకు, మఠాలకు, మత సంస్థలకు బంగారం కంట్రోలు నిబంధనలవల్ల యిబ్బందులేమీ కలగడం లేదు ఆ సంస్థల వారు కూడా ఆభరణాల రూపంలో లేని బంగారం తమవద్ద ఎంతవుందో తెలియజేయాలని నిబంధనలు నిర్దేశించినా ప్రస్తుత పరిస్థితులలో దేవుళ్ళను అలంకరించేందుకు బంగారువస్తువులను కొత్తగా తయారు చేయించకూడదని ఆదేశించినా దేవాలయాలూ, మఠాలూ, తదితర మత సంస్థల విషయంలో యీ నిబంధనలను అమలు పరచడంలో అంత కట్టుదిట్టంగా వ్యవహరించలేదు ఇకపైన కూడా అవసరమైనప్పుడు ప్రత్యేకగా ఉదారంగానే వుంటారు

## పారిశ్రామిక వినియోగం

1963 జూన్ 24 వ తేదీన సవరించబడిన మేరకు యీ చట్టం క్రింద బంగారం వాడకానికి బంగారం కంట్రోలు బోర్డు అనుమతి పొందవలసి వుంటుంది ఆ బోర్డు, బంగారం వాడకాన్ని క్రమబద్ధం చేసి, పర్యవేక్షిస్తుంది ఇందువల్ల ఒక ప్రయోజనానికి కేటాయించబడిన బంగారం మరో ప్రయోజనం నిమిత్తం వినియోగించబడకుండా చూడడానికి వీలవుతుంది తమకు అవసరమైన బంగారాన్ని ఖరీదు చేసేందుకు దంత వైద్యులకూ, ఆయుర్వేద వైద్యులకూ, యునానీ వైద్యులకూ, ఔషధ తయారీ సంస్థలకూ, విద్యున్మలామా చేసే వారికీ శస్త్రచికిత్సా పరికరాలు, జరీ, బంగారు పోశీలూ, రోల్డ్‌గోల్డ్ వస్తువులూ తయారు చేసే సంస్థలకూ ప్రత్యేక పర్మిట్లు యిచ్చారు పరిశోధనల నిమిత్తం కూడా బంగారం వాడుకోవడానికి అనుమతి యివ్వబడుతుంది

అత్యవసర సందర్భాలలో బంగారం అవసరమైన వ్యక్తులకూ పరిశ్రమలకూ కూడా యీ ఉత్తర్వుల వల్ల హెచ్చు యిబ్బంది కలుగదు

బంగారం కంట్రోలు నిబంధనల వల్ల గ్రామసీమలలో అప్పు పుట్టడం లేదనీ, తగినంత బ్యాంకింగు సౌకర్యం లేనిచోట్ల డబ్బుకు బదులు బంగారం దాచుకున్న వారు యిబ్బందుల పాలవుతున్నారని అనడం సత్య దూరం డబ్బును బంగారంగా మార్చుకుని నిలువ చేసుకోవడం వనరులను వృధా చేయడమే అవుతుంది బంగారం డబ్బు కంటె మిన్న అనుకోవడం తెలివైన పనిగాదు బంగారం పడిపోతే నష్టం వస్తుంది షావుకారు లెక్కల గారడీ ఫలితంగా, మన బంగారం తిరిగి మన దగ్గరికి రాకపోవచ్చు ఇప్పుడు బ్యాంకులు వడ్డీ రేటుని పెంచాయి గ్రామ ప్రాంతాలలో కూడా బ్యాంకులు వెలిసాయి ప్రాథమిక భూమి తనఖా బ్యాంకుల సంఖ్య పెరిగింది సహకార సంఘాల వనరులు హెచ్చాయి చిన్న మొత్తాల పొదుపు పథకాలు ప్రవేశపెట్టబడ్డాయి జీవితభీమా సౌకర్యాలున్నాయి వీటిలో సొమ్ము పెట్టుబడి పెట్టి మన సొమ్మును రెండు రెట్లూ, మూడు రెట్లూ చేసుకోవచ్చును బంగారం రూపంలోనే డబ్బును దాచుకో నక్కర లేదు డబ్బునిలవ చేసుకోడానికి యీనాడెన్నో సౌకర్యాలువున్నాయి అందువల్ల బంగారం వుంచేనే భద్రత అనుకోవడం పొరపాటు

నగల రూపంలో విదేశాలకు ఎగుమతి చేసే నిమిత్తం బంగారం దిగుమతి చేసుకోవడానికి యిదివరకు వున్న ఏర్పాట్లు కొనసాగించబడతాయి తగు పర్యవేక్షణ క్రింద విదేశాలకు ఎగుమతి చేయడానికి లేదా వినోద యాత్రికులకు విక్రయించడానికీ గాను బంగారం నగల ఉత్పత్తి, అమ్మకం పథకాలను అంతర్జాతీయ వ్యాపారశాఖ ప్రవేశ పెట్టింది

బంగారు కంట్రోలు నిబంధనలను ప్రవేశ పెట్టిన ఫలితంగా జీవనోపాధి పోగొట్టుకొన్న స్వర్ణకారులకు పునరుపాధి సౌకర్యం కల్పించడానికి వీలైనంత వరకూ చర్యలు తీసుకుంటున్నారు ఇందునిమిత్తమై రాష్ట్ర ప్రభుత్వాలకు ప్రత్యేకంగా సొమ్ము కేటాయించ బడుతుందని కేంద్ర ఆర్థికమంత్రి 1963 మార్చిలో రాష్ట్రాల ముఖ్యమంత్రులకు లేఖ వ్రాశారు స్వర్ణకారుల ఉపాధి కల్పన పథకాలను గురించి నిర్దిష్టమైన సూచనలు చేస్తూ ఆయన ఆ తరువాత 1963 జూన్‌లో మరో లేఖ వ్రాశారు స్వర్ణకారులకు సహాయ పడే నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వాలు అనేక చర్యలు తీసుకొంటున్నాయి వారికి భూములు

కేటాయిస్తున్నారు ఇతర వృత్తులు చేసుకునేందుకు సాధన సామగ్రులకై అప్పులు మంజూరు చేస్తున్నారు వారి పిల్లలకు విద్యా సంస్థలలో జీతం రాయితీ సౌకర్యాలు కల్పిస్తున్నారు కొన్ని శాఖలలో ఉద్యోగాలకు వారికి ప్రాధాన్యం చూపుతున్నారు ఇతర పనులు చేసుకుని పొట్టపోసుకునేందుకు వీలుగా రాష్ట్ర ప్రభుత్వాలు నిర్వహించే సాంకేతిక సంస్థలలో వారికి శిక్షణ గరపుతున్నారు స్వర్ణకారులకు సహాయపడేందుకు గాను కొన్ని రాష్ట్రాలలో కార్ఖానాలూ, పారిశ్రామిక, తదితర సహకార సంఘాలు కూడా ఏర్పాట్లు చేశారు ప్రభుత్వ శాఖల ఉద్యోగాలలో చేర్చుకోవడంలో వారికి అత్యధిక ప్రాధాన్య మివ్వాలని కేంద్ర ప్రభుత్వం ఉద్యోగ సాధన కార్యాలయాలకు ఉత్తర్వులు జారీ చేసింది ప్రభుత్వోద్యోగాలలో చేరదలచిన స్వర్ణకారులకు రాష్ట్ర ప్రభుత్వాలు వయఃపరిమితులనూ అర్హతలనూ సడలించాయి ఈ రాయితీలను యింకా ఎక్కువగా యిచ్చే విషయం పరిశీలించబడుతోంది

## బంగారం ధరల తగ్గుదల

బంగారం కంట్రోలు నియమాల ఫలితంగా బంగారం ధరలు చెప్పుకోదగినంతగా తగ్గాయి ఆ నియమాలు ప్రకటించబడిన తరువాత బంగారం ధర పది గ్రాములకూ రు 90-95 ల మధ్యకు పడిపోయింది ఇప్పుడు నగల వర్తకులు 14 క్యారెట్లూ లేదా అంతకు తక్కువ వన్నెగల బంగారంతో నగలు చేయడం ప్రారంభించడంతో బంగారం ధరలు యిటీవల హెచ్చాయి ఈ మధ్య ధర పెరిగినా యింకా ఆ ధర 1962 ఆగస్టులో పలికిన ధర కన్నా చాలా తక్కువే

బంగారం కంట్రోలు నిబంధనలు సమర్థంగా అమలు జరిగినంతవరకూ బంగారం దొంగరవాణా తగ్గిందనే చెప్పవచ్చును బంగారం సప్లై తక్కువగా వున్నందున దానిధర కొద్దిగా పెరగడం సహజమే బంగారం దొంగచాటురవాణా తగ్గిందనడానికి యితర సాక్ష్యాలూకూడా వున్నాయి దొంగరవాణా వ్యాపారులవద్దనుంచి గిరాకీ లేకపోవడంతో లండన్‌లో బంగారు కడ్డీల వ్యాపారం మందగించింది బొంబాయిలోని పెద్దశుద్ధి కర్మాగారాలలో పని తీరునుబట్టి చూసినా బంగారు కంట్రోలు ఉత్తర్వు అమలులోకి వచ్చిన తరువాత బంగారం దిగుమతులు చాలావరకుతగ్గినట్లు తెలుస్తోంది

హాంగ్‌కాంగ్, మకావ్‌లలో బంగారం ధరలు తగ్గాయి బంగారాన్ని శుద్ధిచేసేందుకు పనికివచ్చే నైట్రికామ్లం ఉత్పత్తి అమ్మకాలు ఢిల్లీప్రాంతంలో చాలాతగ్గాయి ప్రధాన విదేశమార్కెట్లలో భారతరూపాయి విలువ పెరిగింది బంగారం కంట్రోలు ఉత్తర్వును సరిగా అమలు జరిపేందుకు గాను, లైసెన్సుగల బంగారం వ్యాపారుల ఖాతా పుస్తకాలను కేంద్ర ఎక్సైజు శాఖ అధికారులు తనిఖీ చేస్తున్నారు బంగారం కంట్రోలు ఉత్తర్వుక్రింద తమవద్ద నగల రూపంలోలేని బంగారంఎంతవుందో తెలియజేయవలసిన గడువుతేదీ 1963 ఫిబ్రవరి 28 నుంచి 1963 జూన్‌నెల మధ్యవరకూ 2200 కు పైబడిన కేసులను అధికారులు దర్యాప్తు చేశారు తమవద్దగల బంగారాన్ని గురించి ప్రభుత్వానికి తెలియజేయకపోవడం వల్ల అయితేనేం, యీ ఉత్తర్వును అతిక్రమించి బంగారునగలు చేయడం వల్లనయితేనేం మొత్తం రు 46 87 లక్షల (భారత దేశంలో ధరప్రకారం) విలువైన బంగారాన్ని, బంగారు నగలనూ ప్రభుత్వం జప్తు చేసింది

బంగారం కంట్రోలు ఉత్తర్వుకు 1963 జూన్ 24 వ తేదీన చేయబడిన సవరణల క్రింద హఠాత్తుగా దాడి జరిపి, దొంగచాటుగా తయారవుతున్న బంగారు నగలను పోలీసువారి ప్రమేయం లేకుండా ప్రభుత్వం స్వాధీన పరచుకునేందుకు విస్తృత అధికారాలు ఎక్సైజు అధికారులకు యివ్వబడ్డాయి ఈ సవరణ ఫలితంగా యీ నిబంధనలను మరింత కట్టుదిట్టంగా అమలు జరుప వీలవుతుంది ఇతర దేశాలలో యిట్టి సమస్య లేకపోవడంవల్ల బహుశా ప్రపంచంలో మరేదేశమూ బంగారు కంట్రోలు ఉత్తర్వునుయింత తీవ్రంగా అమలు జరుప ప్రయత్నించి వుండక పోవచ్చును 1929లో ప్రపంచ మొత్తంమీద ఆర్థిక సంక్షోభం వచ్చినప్పుడు అమెరికాలో బంగారం శుద్ధి, వాడకం, క్రయవిక్రయాలపై నిర్బంధాలు విధించ బడ్డాయి ఆ నిర్బంధాలను ఇప్పుడు మనదేశంలో జారీచేసిన బంగారంకంట్రోలు నిబంధనలతో పోల్చవచ్చును ఇంతవరకూ అందిన సమాచారాన్నిబట్టి యీ కంట్రోలు ఉత్తర్వు లక్ష్యాలు తప్పక సిద్ధించగలవని తెలుస్తోంది ఇంత తీవ్రసమస్యను ఏ కొద్ది వారాలలో లేదా నెలలలోనో పూర్తిగా పరిష్కరించడం కష్టం ఈ ఉత్తర్వు ధర్మమా అని బంగారం దొంగచాటు దిగుమతులుతగ్గాయి మనవిదేశ మారకద్రవ్యం నష్టాలను నివారించుకోగలుగుతున్నాం ఇది గణనీయమైన విజయమేకదా

మన సాంఘిక అలవాట్లలోనూ, దృక్పథంలోనూ మార్పువస్తే ఆడంబరంకోసం బంగారం వాడుకోవడం క్రమేణాతగ్గుతుంది అప్పుడు దేశంలో బంగారం ధరలు అంతర్జాతీయధరకు యించుమించుగా వుంటాయి స్వదేశంలోధర అంతర్జాతీయ ధరకుయించుమించు సమంగా వుంటుంది స్వదేశంలో ధర అంతర్జాతీయ ధరకు యించుమించు సమమైతే దొంగరవాణా వ్యాపారం గిట్టుబాటుకాదు కనుక బంగారం దొంగవ్యాపారం దానంతట అదే నామరూపాలు లేకుండా పోతుంది తత్ఫలితంగా ఆదా అయిన వనరులు వ్యక్తి శ్రేయస్సుకూ, జాతి శ్రేయస్సుకూ సద్వినియోగ మవుతాయి ★

---

### గమనిక

"ఆంధ్ర ప్రదేశ్," 1963 జూలై సంచికలో ప్రచురించబడిన "పోచంపాడు" అనే వ్యాసంలో ప్రారంభ పనులపై ఇప్పటి వరకు "సుమారు రు 100 లక్షలు" ఖర్చు జరిగినదనడానికి బదులు దాదాపు రు 72 58 లక్షల వ్యయం జరిగినట్లు ప్రచురించబడింది

# స్వాతంత్ర్య సంస్థాపకా!

"చిత్ర ఖాను"

నీ చరణాలు పయనించే పథాన
కోటిపాదాలు పరుగు లెత్తినాయ్
నీ ప్రత్యేక దృష్టిని ప్రసారించే వైపు
కోటినయనాలు చూశాయ్
నీ ఒక్క ప్రాణాన్ని రక్షించే నిమిత్తం
నీ శిరస్సును దేనికోసం వంచావో
కోటి శిరస్సులు దానికోస వంగినాయ్
నీ హాసాన్ని తిలకించి
ముందుకు సాగింది కాలం
నీ భ్రుకుటిని చూచి
వెనక్కి సాగింది కాలం
నీవు వసుధకు
అచల మేఖలగా అయ్యావ్
కాలానికి మీదుగా
శాశ్వత రేఖను గీశావ్
నీవు మౌనంగా వున్న సమయాన
మౌనంగా వున్నారు మానవులంతా
నీవు పలికే టప్పుడు
పలికారు ప్రజలందరు కూడా
నీ కర్మనిష్టను ఏకత్రంచేసి
యుగకర్మ మేల్కొంది
యుగధర్మం బలిష్టమైంది
నీవుగా పరివ్యాప్తి చెందించిన
నిర్మలదేశీయ శీలత వస్త్రంలో
ఆ ప్రతి ఖద్దరు నూలు పోగులో
ఆత్మాభిమానం నిండుకొన్నది
దేశానికి వుంది గౌరవం దీనిలో
అన్యాయానికి అగౌరవంవున్నది
ప్రతి ఖద్దరు దారంలో
సౌభ్రాతృత్వం పెనవేసుకొన్నది
మాతృదేవతల సోదరీ మణుల
ప్రేమ వెల్లువలై పొరలు తున్నది
ఖాది శశాంకుని కిరణంవచ్చి
తనువుపై చిరునవ్వు నవ్వుతోంది
నవ జీవిత నూతనజ్యోతి
మదిలో మిలమిలా మెరుస్తోంది
ఖాదీ పవిత్ర ప్రవాహంలో
దేశభక్తుల మేనులు ములుగు
తున్నాయ్
జీవితపు నలు కోణాలలోనుండి
మాలిన్యాన్ని కడుగుతోంది
ఖద్దరు యుద్ధానికి కాదు
శాంతికీ స్నేహానికీ చిహ్నం
కృపాణాల ధ్వనీ కాదు
అది అభ్యుదయ రథానికి పతాకం
ఖద్దరును తిలకించే టప్పటికే
శత్రుదళం 'కింకర్తు?' లయిపోయారు
ఖద్దరు తెల్లని సత్యపు జెండా
ఇపుడన్ని దిశలా ఎగురుతోంది
యుగ పరివర్తకా!
యుగ సంస్థాపకా!!
యుగ సంచాలకా!
యుగా ధార భూతమా!!
యుగ మూర్తీ! యుగ నిర్మాతా!!
స్వాతంత్ర్య సంస్థాపకా!
యుగ యుగాల వరకూ
ఇదే మా శ్రద్ధాంజలి ★

# విముక్తి

పోతుకూచి సాంబశివరావు

రంగన్న జైలునుంచి విడుదలయ్యాడు తన మూట ముల్లె బుజాన వేసుకుని జైలు రహదారి గుమ్మం దాటి బయట పడ్డాడు హాయిగా శ్వాస పీల్చాడు ఎంతో ఆనందం పొందాడు

నాల్గు సంవత్సరాల తర్వాత తిరిగి తాను పదిమందిలో 'తిరిగే అవకాశం లభించింది వీధిలోకి రాగానే చెట్లు తమ కొమ్మల వింజామరాల్తో రంగన్నకు విసిరాయి అతను ఉత్సాహంగా నడిచాడు ఉదయం పదిగంటలు ..దూరాన ప్రతీ పెద్ద బిల్డింగు పైన దేశం త్రివర్ణ పతాకం ఎగురుతోంది నడుస్తూంటే స్కూలు ఆవరణలో పిల్లలు ఆటలాడుతున్నారు ..మరోచోట జాతీయ గీతాలు ఆలపిస్తున్నారు...ఇంకోచోట ఎవరో ఒక నాయకుడు ఉపన్యసిస్తున్నాడు మరికొందరు కూలీలు లారీలలో ఊరేగుతూ 'స్వాతంత్ర్యం మా జన్మహక్కు' వందే మాతరం ! నినాదాలతో కేకలేస్తున్నారు . ఇవన్నీ రంగన్న చూశాడు.. దారినపోయే ఒకణ్ణి అడిగాడు .ఎందుకు బాబూ యీ సంబరం _ అని ఈ వేళ ఆగస్టు పదిహేను జవాబు _ అప్పటికర్ధమయింది రంగన్నకు, దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన రోజు యిదే అని

సరిగ్గా తనకుకూడా యీనాడు నిజంగా స్వాతంత్ర్యం వచ్చినట్లు భావించాడు రంగన్న నాల్గు సంవత్సరాల క్రితం _ రాత్రి పదిగంటలకు...ఒక ఆసామీ యింట్లో కన్నం వేశాడు. ఎందుకు . యింట్లో భార్య ప్రసవవేదనతో బాధపడుతోంది .. యిద్దరి పిల్లలకు జ్వరాలు...ఒక వంద రూపాయిలు అప్పు యిమ్మని ప్రాధేయ పడితే ఆ ఆసామీ నిరాకరించాడు ..పది సంవత్సరాలుగా పనిచేసే తనకే అప్పు యివ్వకపోతే యింక ఎవరిని యితను ఉద్ధరిస్తాడు . భార్య ప్రసవించింది . చావు బ్రతుకులమీద ఉంది. .రాత్రి అదే ఆసామీ యింట్లో చోరీ చేశాడు . నగలు రూపాయిలు దొంగిలించి వస్తోంటే ..వీధి కాంపౌండులో పడుకున్న ఆసామీ మెలకువ తెచ్చుకుని అరిచాడు ఒకే గిరవాటు. .కత్తి . గుండెల్లో కసిక్కని గుచ్చుకొంది . అసలే భయస్థుడా ఆసామీ అంతటితో ప్రాణాలు విడిచాడు . తర్వాత దర్యాప్తు జరిగింది . తాను పట్టుబడ్డాడు . జైలువాసం లభించింది .కాని భార్యకు మందిప్పించాడు . పిల్లలకు జ్వరం తగ్గింది ...పట్టుబడినప్పుడు పోలీసులు తీసుకుపోతూంటే . భార్య కంటతడి చూశాడు . కాని ఏం చేయగలడు ? . వారికి ఆధారం ఎలావున్నారో .పరిపరివిధాల మనస్సు పోయింది రంగన్నకు

ఈ పట్టణానికి స్థలభై మైళ్ళ దూరంలో వుంది తన ఊరు కాని చేతిలో పైసలేదు యింటికి ఎలా వెళ్ళాలి ? ఆలోచనలు ఎన్నో మెదడులో కదిలాయి రంగన్నకు

బజారులో అడుగుపెట్టేడు, ఎక్కడైనా కూలి చేసుకుందామని బజారు ఆరోజు మూసేశారు ఏంతోచక అటూ యిటూ తిరగడం మొదలెట్టేడు రంగన్న

ఒకచోట సభ జరుగుతోంది. .ఉపన్యాసాలు ధారాప్రవాహంగా వినవస్తున్నాయి దేశం నాయకత్వం వహించిన పెద్దలను పొగడుతున్నారు 'మన స్వాతంత్ర్య రక్షణకు యీనాడు దీక్ష వహించాలి ..ప్రక్కలో బల్లెంలా పొంచివుంది శత్రువు ..మీ రే మిస్తారు...ఎంతైనా దేశ రక్షణకు విలువైనదే .' నాయకుడి ఉపన్యాసం ప్రజల్లో సంచలనం కలిగించింది...ఉంగరాలు. . బంగారు గాజులు, ధనం ఒక్కొక్కటే నాయకుని చేతుల్లో రాలాయి ..మందహాసంతో స్వీకరించాడు ఆయన .దేశ రక్షణ నిధి _

రంగన్న ఒక్కసారి స్థితిగతుల పర్యాలోకన చేశాడు. నాల్గు సంవత్సరాల క్రితం ప్రతివాడూ తనకు దొరికినది కూడబెట్టు కుందామన్న ధ్యాసే కాని నేడు .ఉన్నది త్యాగంచేసి దేశాన్ని రక్షించాలన్న ఆకాంక్ష ప్రతీవానిలో ఉన్నట్లు కనిపించింది...... అందరూ తమకు మిగిలిన ధనం, ఆస్తి,

దేశ రక్షణకు యిచ్చేస్తే దొంగతనానికి ఆస్కారం ఏదీ ! . రంగన్న తనలో తాను తర్కించుకున్నాడు అసలు అనవసరంగా డబ్బు దాచుకోడం వల్లనే, దోపిడులు, కొట్లాటలు, హత్యలు జరుగుతున్నాయని ఊహించాడు రంగన్న .ఇకముందు దేశం పరిస్థితులు మారతాయి మారుతున్నాయి తనకు మునుపు జరిగిన పరిస్థితి తిరిగిరాదు సంతోషించాడు రంగన్న

పట్టణంలో మిలిటరీవాళ్ళు ఏదో పనిమీద తిరుగుతున్నారు వాళ్ళు మామూలుగా నడిచినా వినిపించే టక టక బూట్ల శబ్దాలు రంగన్నని ఉత్సాహపరిచాయి సైన్యంలో చేరిపోతే కాని యీ వయసులో తన్ను తీసుకుంటారా ? తన్నుతానే ప్రశ్నించు కున్నాడు రంగన్న

ఒక హోటలునుంచి రేడియో వినిపిస్తోంది.. 'చైనా దొంగపన్నాలు .అసలు చైనాను ఐక్యరాజ్య సమితిలో చేర్చడానికి ప్రయత్నించిందెవరు ? అటువంటి స్నేహితుణ్నే వెన్నుపోటు పొడిచింది. .' ఈ మాటలు రంగన్న చెవుల్లో గింగిరు మన్నాయి ..ఒకప్పుడు బ్రిటిషువారిక్రింద బానిసత్వాన్ని రూపుమాపడానికి దేశంలో విప్లవం రేగింది.. ఇంక పప్పులుడకవను కొన్న బ్రిటిష్‌వారు సౌమ్యంగా స్వాతంత్ర్యం యిచ్చి మనల్ని గౌరవించారు . యీనాడు మన స్వేచ్ఛ దొంగలించాలనుకున్నది నియంతృత్వ చైనా రంగన్నకు ఆవేశం కలిగింది . జైలులో వున్నప్పుడు తోటి వాళ్ళు చెబుతూండేవారు చైనా మనపై దండెత్తుతోందని రంగన్నకు ఏదో ఆవేశం కలిగింది మనలో మనం కొట్లాటలు, దొంగతనాలు చేసుకోడం ఎందుకు ? మన జాతి విచ్ఛిత్తికి కారణం కాదూ ? లోలోపల రంగన్న మధనపడ్డాడు . తనకే ఆర్థిక దుస్థితి లేకపోతే . అలా దొంగతనం హత్య చేసివుండేవాడు కాదు అనుకున్నాడు రంగన్న

ఎదురుగా హోటలులోకి ప్రవేశించాడు ప్రొప్రయిటరు వీబూది పిండికట్లతో శ్రోత్రియంగా కూర్చుని మడిగా డబ్బులు గల్లాపెట్టెలో వేసుకుంటున్నాడు ..

'బాబూ ఏదైనా చిన్న పని యిప్పిస్తారా !

'ఏం పని కావాలోయి సర్వరు పని చేస్తావా ? రోజుకు ముప్పావలా . భోజనం ఉచితం '

'అలాగే బాబూ .'

ఉద్యోగంలో చేరాడు రంగన్న. హోటల్లో పెద్దవాళ్ళకు టిఫినులు అందిచ్చే టప్పుడు వాళ్ళతో పరిచయం చేసుకోవా లనుకున్నాడు కాని వాళ్ళు యితనితో చనువుగా ఎందుకు మాట్లాడతారు . జాతిలో యింకా హెచ్చుతగ్గు తారతమ్యాలు ఉన్నాయిగా . యివి ఎప్పుడు నశిస్తాయో పరదేశం కబళిస్తే ? పూర్తిగా దాస్య శృంఖలాలే ? మళ్ళీ ఉలిక్కిపడ్డాడు రంగన్న

ఆరోజు రాత్రి వూరంతా దీపావళిలా బాణసంచా కాల్చారు యిళ్ళకు, ప్రభుత్వ బంగళాలకు విద్యుద్దీపాలతో రజాలు కట్టారు రాత్రి హోటలు పని ముగించు కుని వీధిలో పచారు ప్రారంభించాడు రంగన్న నాల్గు రోజులు పనిచేసి, కొంత డబ్బు సేకరించుకుని యింటికి వెళ్ళరావా లనుకున్నాడు రంగన్న

వారం రోజులు గడిచాయి వానలు జోరుగా కురుస్తున్నాయి యించుమించు ముసురు పట్టినట్లే అయిదవరోజు కొంత తెరిపి యిచ్చింది రంగన్న హోటలు యజమానితో అన్నాడు రెండు రోజులు స్వంత ఊర్కు వెళ్ళి వస్తానని యజమాని విసుక్కున్నాడు...చివరకు జీతం లేకుండా సెలవు యిస్తా పొమ్మన్నాడు...

వారంరోజులబత్తెం జాగ్రత్తపెట్టుకుని. బస్సు ఎక్కాడు రంగన్న

బస్సు వేగంగా నడిచింది ..చుట్టూ వానలకు - పిల్లకాల్వలు వేగంగా పారు తున్నాయి...రోడ్లు గతుకులతో మురికితో.. తడితడిగా వుంది యింటికి వెళ్ళగానే, భార్యాపిల్లలు తనకు స్వాగతం యిస్తారు . ఆ ఏరుప్రక్కన గుడిసెలో వుంటున్న తన భార్య ఎలా బ్రతికుతూందో యిన్నాళ్ళు...? బహుశా ఎవరింట్లోనైనా దాసీ పని చేస్తూండ వచ్చు అనుకున్నాడు రంగన్న...

బస్సు దిగాడు రంగన్న తన ఊరి పొలిమేరలో వడివడిగా యింటివైపు నడిచాడు ఎదురుగా కనిపించే జొన్నచేలు నిండా నీరు తొణుకుతోంది చెట్లు కూలి వున్నాయి అక్కడక్కడ .రోడ్డంతా బురద తిన్నగా గుడిసె చేరాడు.. ఏరు వార. కాని గుడిసె కూలివుంది . చుట్టూ బురద దూరంగా చెట్టుక్రింద పక్షుల్లా కొంతమంది జనం ..అందులోంచి వీరయ్య వచ్చాడు .రంగన్నను గుర్తుపట్టాడు .

'ఏరా ! రంగన్నా ! యిదేనా రావడం '

'అవును '

'పాపం .. దురదృష్టవంతుడివి _'

వీరయ్య పెదమవిరిచాడు...

రంగన్నకు ఎడంకన్ను అదిరింది

'నాల్గురోజులక్రింద ఏరు పొంగింది... ఓ రాత్రి నీ భార్యా పిల్ల...అప్పటి నుంచి కనిపించటంలేదు కొట్టుకుపోయా రేమో 'వీరయ్య జాలిచూపాడు చుట్టూ జనం మూగారు రంగన్న నిర్విణ్ణుడై పోయాడు ఒక క్షణం

'రెండు సంవత్సరాల క్రితం నీ మొదటి పాప చచ్చిపోయింది ..'

# పారిశ్రామిక విశేషాలు

## కేంద్ర రంగం

హైద్రాబాదు సమీపంలో నెలకొల్పుతున్న సింథటిక్ మందుల ప్రాజెక్టు, భారీ విద్యుత్పరికరాల ప్రాజెక్టుల పనులు త్వరిత గతిని అమలు జరుగుతున్నాయి రామచంద్రాపురంలోని భారీవిద్యుత్పరికరాల ప్రాజెక్టుకు చెందిన సాంకేతిక నిపుణుల శిక్షణ పాఠశాలకు మద్రాసు ముఖ్యమంత్రి 1963 జూలై 8వ తేదీన ప్రారంభోత్సవం చేశారు

విశాఖపట్నం ప్రాంతంలో కేంద్రం రంగంలో స్థాపించ నుద్దేశించిన ఉక్కుయంత్రాగారం విషయంలో ప్రారంభ పరిశీలనలు జరుగుతున్నాయి

## రాష్ట్ర రంగం

ఎలక్ట్రిక్ బల్బుల పరిశ్రమ, గాజు స్ఫటికం తదితర గాజు వస్తువులకు అవసరమైన గాజు షెల్స్, సీసాలు, ట్యూబులు మొదలైన గాజు సామగ్రిని ఉత్పత్తి చేయడానికి సమీకృత ప్రాజెక్టును నెలకొల్పేందుకు భారత ప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వ సంస్థ అయిన ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి సంస్థకు లైసెన్సు జారీచేసింది

ఈ ప్రాజెక్టు, బహుశా విదేశసంస్థ సహకారంతో నెలకొల్పబడుతుంది ఈ ప్రాజెక్టు అభివృద్ధికీ, పారిశ్రామికాభివృద్ధిసంస్థ పరిశీలనలోవున్న ఇతర ప్రాజెక్టుల అభివృద్ధికీ కృషి చేయడానికి వీలుగా ఈ సంస్థలకు అదనంగా నిధులు సమకూర్చడానికి ఇటీవల రాష్ట్ర ప్రభుత్వం నిశ్చయించింది

## ప్రైవేటు రంగం

శాస్త్రీయ పరికరాలను ఉత్పత్తి చేసేందుకు, విదేశసంస్థతో కలిసి ఒక సంస్థను నెలకొల్పుకునే నిమిత్తం లైసెన్సు మంజూరు చేయగోరుతూ ఒక స్థానిక సంస్థ పెట్టుకున్న దరఖాస్తును భారత ప్రభుత్వ లైసెన్సు వ్యవహారాల సంఘం సూత్రప్రాయంగా అంగీకరించినట్లు తెలుస్తున్నది కాబట్టి శాస్త్రీయ పరికరాలఉత్పత్తి సంస్థఒకటి ఇక్కడ నెలకొల్పబడే అవకాశం వుంది

మెసర్స్ వజీర్ సుల్తాన్ టొబాకో కంపెనీ లిమిటెడ్‌కు ఉత్పాదక శక్తిని పెంపొందించుకోవడానికి అనుమతి లభించినట్లు తెలుస్తున్నది

*సింగరేణి కాలరీస్ కంపెనీ లిమిటెడ్*

సింగరేణికి చెందిన బొగ్గుగనులలో 1962 మే నెలలో 2,40,547 6 టన్నుల బొగ్గు లభించగా 1963 మేలో 2,50,125 1 టన్నులు, అంతక్రితం నెలలో 2,56,712 టన్నుల బొగ్గు లభించింది

ఈ గనులలో 1963 మే నెలఖారు నాటికి 1,315,639 4 టన్నుల బొగ్గు లభించగా 1962 మే నెలాఖరు వరకు 1,185,174 6 టన్నుల బొగ్గు లభ్యమైంది

పోలమల్లి ప్రాంతంలో ఎల్లందు బొగ్గు గనులవద్ద మరో కొత్తగనిని మే 25వ తేదీన సింగరేణి కాలరీస్ అడిషనల్ జనరల్ మేనేజర్ శ్రీ ఎల్ ఆర్ శర్మ ప్రారంభించారు తృతీయ పంచవర్ష ప్రణాళిక క్రింద, ఆరునెలల్లో ఎల్లందులో తెరవబడగల కొత్తగనుల పరంపరలో ఇది అయిదవది

ఎల్లందులోని ప్రధాన బొగ్గుగనికి విడిగా పెద్దదిగావున్న ఈ గని తృతీయ ప్రణాళికా లక్ష్యాన్నిసాధించడంలో బాగా తోడ్పడగలుగుతుంది సుమారు 500 మందికి దీనిలో ఉద్యోగాలు లభిస్తాయి

సింగరేణి కాలరీల వివిధ విస్తరణ పథకాలక్రింద పరంపరగా ఈ కొత్తగనులను తెరవడంతో వదిలివేయ బడిన ఎల్లందు బొగ్గుగని తిరిగి కళాకాంతులతో విలసిల్లుతున్నది

*ప్రముఖుల ఆగమనం*

అఖిలభారత కాంగ్రెసు సంఘం అధ్యక్షులు శ్రీ డి సంజీవయ్య, రక్షణ ఉత్పత్తి శాఖా మంత్రి శ్రీ కె రఘురామయ్య 1963మే17వ తేదీన షక్కర్ నగర్‌ను సందర్శించారు ★

---

రంగయ్యకు అంతా శూన్యంలా గోచరించింది దుఃఖం ఆపుకోలేక తుండుగుడ్డతో తుడుచుకున్నాడు ..ఆ ఏటి ఒడ్డున బురదలో ఒంటిగా ఎంత సేపు నడిచాడో అతడికే తెలియ లేదు ..సాయంత్రం పడింది . తిరిగి తిరిగి బస్సుస్టాండు చేరాడు బస్సుస్టాండువద్ద రాత్రి చీకటిలో. .ఒంటిగా ఏడుస్తూ కూర్చున్నాడు...మర్నాడు ఉదయం వచ్చిన బస్సు ఎక్కాడు. తాను ఏం చేయాలి ? ..ప్రశ్నించుకున్నాడు...

ఆగస్టు పదిహేనునాడు విన్న సంగతులు చూసిన దృశ్యాలు కళ్ళముందు తిరిగాయి ఎవరూలేని తను జీవితం సార్థకంగా గడపాలి ఏం చేయాలి ..

బస్సు దిగి హోటలువైపు నడిచాడు సగం దూరం వచ్చాక మరో దారి పట్టాడు తిన్నగా రిక్రూటింగు ఆఫీసు దగ్గరికి పోయాడు సాయంత్రం నాల్గు గంటలకు తన్ను పిలిచారు ఒళ్ళు కొలిచారు .. మాట్లాడారు సైన్యంలో చేర్చుకున్నామన్నారు.

రంగన్నకు సంతృప్తి కలిగింది ఆనందబాష్పాలు రాల్చాడు ..

వీధిలోంచి ఒక ఊరేగింపు నడిచింది . నినాదాలు రేగేయి .

'దేశ స్వాతంత్ర్యం రక్షించుకోండి. దేశ రక్షణ నిధికి - విరాళాలివ్వండి

రంగన్న తిన్నగా ఊరేగింపు వైపు నడిచాడు చేతిలోవున్న ఒక రూపాయి ఆ ఊరేగింపు డిబ్బీలో వేశాడు

హాయిగా నవ్వాడు రంగన్న, దుఃఖం మరిచి ★

# ప్రశ్నలు-సమాధానాలు

**శ్రీ కె వి రత్నం, హుజూరాబాద్ బ్లాకు**

ప్రశ్న బ్లాకు మేనేజరు ఉద్యోగాలను రద్దుపరచడానికి గల కారణమేమిటి?

సమా ఈ ఉద్యోగాలను రద్దుపరచలేదు 1962 ఏప్రిల్ మొదటి తేదీనుంచి వీటిని నిలుపుచేసి వుంచడం మాత్రమే జరిగింది జాతీయ అత్యవసర పరిస్థితి దృష్ట్యా వ్యయకర్తనమునకు గల అత్యంత ప్రాముఖ్యతను పురస్కరించుకొని, పంచాయతీ సమితులలో మేనేజరు ఉద్యోగం అవసరాన్ని గూర్చి జాగ్రత్తగా పరిశీలించిన మీదట ఈ ప్రకారం చేయడం జరిగింది

**శ్రీ ఎన్. చెన్నకేశవులు, కొటికలపాడు నెల్లూరు జిల్లా**

ప్ర అనంతపురం జిల్లా వజ్రకరూర్‌లో వజ్రాలకై జరుపుతున్న అన్వేషణ ఎంతవరకు వచ్చింది ఈ నిక్షేపాల ప్రయోజనం విషయంలో మున్ముందు ఎలాంటి అవకాశాలు వుంటాయి ?

సమా 1962-63 వ సం లో జరిగిన పరిశీలనలలో, వజ్రకరూర్‌కు పశ్చిమాన వున్న పైప్ రాక్, లోగడ అంచనా వేసిన వైశాల్యానికి కనీసం నాలుగు రెట్లు పెద్దదైనట్లు వెల్లడైంది దీనిని వజ్రాలకొరకు 1880-1929 సంవత్సరాలలో త్రవ్వారు ఇదిగాక మరో రెండు పైప్ రాక్‌లను కనుగొన్నారు వీటిలో ఒకటి వజ్రకరూర్‌కు తూర్పున రెండు మైళ్ల దూరంలోనూ, మరొకటి లత్తవరం గ్రామానికి తూర్పున అర మైలు దూరంలోనూ వున్నాయి

పైప్ రాక్ ఉత్తర భాగంలో వజ్రాలు లభించే అవకాశాలు లోగడ అంచనావేసినంత తక్కువగా ఏమీ లేదు పోతే మిగతా పైప్ రాక్‌లలో వజ్రాలు దొరికే అవకాశాలు ఉజ్వలంగా వున్నాయి ఎందుచేతనంటే వీటి మిశ్రము, దక్షిణాఫ్రికాలో లభించే శ్రేష్ఠమైన వజ్రశిల కింబెర్ లైట్‌ను పోలివుంది 255 టన్నుల తూకం వున్న సుమారు 75 మీటర్ల ఘనపరిమాణంగల పైప్ రాక్ ముడి పదార్థాన్ని కడిగి వజ్రాలకొరకు అన్వేషించడం జరిగింది సుమారు 300 చకిమీ ల విస్తీర్ణంలో అన్వేషణ జరుపుతున్నారు లత్తవరం గ్రామానికి తూర్పున లంబాడీ భూములకు పశ్చిమ దిశన సుమారు అరమైలు దూరంలో కింబెర్ లైట్‌ను కనుగొన్నారు

ఇంకా ప్రాథమిక పనులు జరుగుతూండటం వల్ల ఈ నిక్షేపాల ప్రయోజనం విషయంలో ఎలాంటి అవకాశాలు వుండేదీ ఖచ్చితంగా ఏమీ చెప్పడానికి వీలుపడదు

**శ్రీ వి భూమాచారి, బొమ్మెన, కరీంనగర్ జిల్లా**

ప్ర మెట్పల్లి తాలూకాలో సుమారు 1,500 మంది స్వర్ణకారులున్నారు ఇటీవలచేసిన స్వర్ణ నియంత్రణ ఉత్తర్వులవల్ల వారి వృత్తికి దెబ్బ తగిలింది. ప్రభుత్వం ప్రత్యామ్నాయంగా వారికి ఏమైనా పని చూపుతుందా ? లేక వారికి సహాయం చేస్తుందా ?

సమా ఉపాధి కోల్పోయిన స్వర్ణకారులకు ఉద్యోగాలవిషయంలో సహాయం చేయవలసిందిగా ఎంప్లాయ్‌మెంట్ ఆఫీసర్లను కోరడం జరిగింది అనువైన ప్రత్యామ్నాయ ఉద్యోగాల కొరకు ఆయా జిల్లా ఉద్యోగ సాధక కేంద్రాలలో తమపేర్లు నమోదు చేయించుకోవలసిందిగా స్వర్ణకారులకు సూచించడమవుతున్నది.

**శ్రీ డి నరసింహారావు, కాల్వగడ్డ, సోమవారపేట, నిర్మల్ తాలూకా, ఆదిలాబాదు జిల్లా**

ప్ర సాంకేతిక కళాశాలలో విద్యార్థులకు ఇచ్చిన ఋణాలనురాబట్టడానికై, వారికి ఉద్యోగాలు చూపించే విషయంలో ప్రభుత్వం సహాయం చేస్తుందా ?

సమా మంచి సామర్థ్యం వుండి, ఉన్నత విద్యాభ్యాసంపట్ల అభిలాష వుండి, విద్యా సముపార్జనకు తగు స్థోమత లేని వారికి మాత్రమే విద్యా ఋణాలను మంజూరు చేస్తారు ఉన్నత విద్యాభ్యాసానికి తగు శక్తిస్థోమతలు లేని కారణంగా వారి ప్రతిభాసామర్థ్యాలు వృథాకాకుండా వుండేందుకై ఇది వారికి లభింపజేస్తున్న రాయతీ మాత్రమే విద్యాఋణాలు పొందిన విద్యార్థులకు ఉద్యోగాలు చూపించే హామీకానీ లేక సహాయంకానీ ప్రభుత్వపరంగా వుండదు

విద్యా ఋణాల పథకంలో ఋణాలను పొందే విద్యార్థులకు ఉద్యోగాలను చూపించాలనే నిబంధన ఏదీలేదు

***శ్రీ ఇందుపూర్ లక్ష్మణరావు, పార్వతీపురం***

ప్ర ఇక్కడ నీటి పంపింగ్ పథకానికి 1958 వ సంవత్సరంలోనే శంకు స్థాపన జరిగింది ఇంతవరకూ ఇది ఎందుకు పూర్తికాలేదు ఇది ఎప్పటికి పూర్తవుతుంది ?

సమా పార్వతీపురం నీటి సరఫరా పథకాన్ని ప్రభుత్వం 1959 వ సం లో మంజూరు చేసింది 1959–60 వ సంవత్సరంలో ఈపథకాన్ని చేపట్టారు 1962 జూలైలో వరదల సమయంలో నదీ ప్రవాహాగమనాన్ని పరిశీలించినమీదట, తొలుత ఎన్నిక చేసిని దిగువ ప్రవాహ పుస్థలానికి హెడ్ వర్క్సును మార్చడానికి ప్రతిపాదించారు సవరించిన ప్రతిపాదనల ననుసరించి 1963 ఏప్రిల్ లో పనులను చేపట్టారు ఈ పనులు జరుగుతున్నాయి

హెడ్ వర్క్సు పనులు పూర్తయిన వెంటనే పట్టణానికి నీరు సరఫరా చేస్తారు

***శ్రీ గట్టుపల్లి సుబ్బారావు, ఆరోగ్య ప్రచార పథు, చెరుకుపల్లి***

ప్ర స్వయంగా దున్నదలుచుకునే వారికి ప్రభుత్వం భూమిఇచ్చి దాని విలువను వాయిదాలమీద రాబట్టుకునేందుకు వీలుగా ఏమైనా నిబంధన వుందా ?

సమా ఇటీవలి ఉత్తర్వులననుసరించి ప్రభుత్వాధీనంలో నున్న భూమంతా కొన్ని మినహాయింపులకు లోబడి వివిధ హోదాలలో పనిచేస్తున్న జవానులకొరకు ప్రత్యేకించబడింది కనుక భూవసతిలేని బీదవారికి సులభ వాయిదాలలో భూమి విలువ మొత్తాన్ని వసూలుచేసే పద్ధతిమీద కానీ ఇతర విధాలకానీ భూములను కేటాయించే ప్రశ్నే ఇప్పుడు ఉదయించదు. ★

# ప్రభుత్వ నిర్ణయాలు

స్టేట్ ట్రాన్స్‌పోర్ట్ అథారిటీ అధ్యక్షుడుగా పూర్తి సమయం జూడిషియల్ అధికారిని ఒక సంవత్సరంపాటు నియమించడానికి ప్రభుత్వం నిశ్చయించింది

దుకాణాలు, వ్యాపార సంస్థల సమీకృత బిల్లు ముసాయిదాను ప్రభుత్వం ఆమోదించింది

1959 వ సంవత్సరం నుంచి ప్రభుత్వ శాఖల వ్యయంలో ఏర్పడిన పెరుగుదలలో 10 శాతం కోతకు సంబంధించి లోగడ చేసిన నిర్ణయాన్ని ప్రభుత్వం పునఃపరిశీలించి, ప్రతి శాఖకు చేసిన పూర్తి బడ్జెటు కేటాయింపులో 10 శాతం కోతను వర్తింపజేయడానికి నిశ్చయించింది

రాష్ట్ర కేంద్ర భూమి తనఖా బ్యాంకు, రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియానుంచి రు 200 లక్షలను ఋణంగా పొందే విషయంలో హామీగావుండటానికి ప్రభుత్వం నిర్ణయించింది

నిమ్న జాతులు, నిమ్న తెగల ఆర్థిక, అభివృద్ధి సంస్థ, విజయవాడలోని ఆంధ్ర సహకార బ్యాంకునుంచి రు 5 లక్షలు అప్పుగాపొందే విషయంలో కూడా హామీగా వుండటానికి ప్రభుత్వం నిశ్చయించింది ★

( 25 వ పేజీ తరువాయి )

4 అకారము అచ్చుతో లోపించునపుడు లోపదీర్ఘత లేలజరుగవో దురూహము.

ఈ చతుర్దోష దూషిత వాదముపసంహరింప బడుగాక ; తద్భవములందు అన్యదేశ్యములందునుకూడ ఈ పదాది రేఫము సంయుక్త వర్ణముగా వర్ణవ్యత్యయము కారణముగా ఏర్పడిన రూపములు కలవు

తద్భవము కిరీటి (సంస్కృతము) > క్రీడి (తెలుగు)

అన్యదేశ్యము - తరాస్ (పారసి) > త్రాసు (తెలుగు)

పదాదిని ద్వితీయ వర్ణముగా సంయుక్తముగానున్న రేఫము కొన్నితద్భవములందు లోపింపలేదు

ప్రతిజ్ఞా (సంస్కృతము) > ప్రతిన (తెలుగు)

ద్రౌపదీ (సంస్కృతము) > ద్రోవది (తెలుగు)

ఈ ఉదాహరణములబట్టియు పదాది రేఫఘటిత సంయుక్తాక్షర రూపములు కవిత్రయ కాలమునాటికెంత మాత్రమును నుచ్చరించుట కష్టదాయకములు కావని తెలియగలదు

(సశేషం)

## గ్రామాలకు విద్యుత్ సౌకర్యాల విస్తరణ

తూర్పుగోదావరి జిల్లా, అమలాపురం తాలూకాలోని టి కొత్తపల్లి, ఐ పోలవరం, మురముళ్ళ గ్రామాలకు 1963 మే నెలలో విద్యుచ్ఛక్తి సౌకర్యాలను కలిగించారు

# క్షేత్రయ్య పదములు

దివాకర్ల వేంకటావధాని

*(పదకర్తగా అశేష కీర్తి నార్జించి అమరుడైన క్షేత్రయ్య త్రిశతవర్ధంత్యుత్సవాలు యీ నెలలో జరుగుతున్నాయి ఈ సందర్భంగా ప్రసిద్ధ సాహిత్యవేత్తలు డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు వ్రాసిన ప్రత్యేక వ్యాసాన్ని ప్రచురిస్తున్నాము — ఎడిటర్)*

ఆంధ్ర వాఙ్మయమున పద్యకవిత్వముతో పాటు గేయ కవిత్వమును జిరకాలము నుండి వర్ధిల్లి వచ్చుచున్నది అసలే వాఙ్మయమందైనను పద్యముకంటె గేయమే ముందవతరించునని విమర్శకుల తలంపు పాల్కురికి సోమనాథుఁడు తన పండితారాధ్య చరిత్రమున తుమ్మెద పదములు, ప్రభాతపదములు వాలేశుపదములు మున్నగు పదముల నెన్నిటినో పేర్కొని యున్నాఁడు కాని యవి యేవియు నిపుడుపలభ్యమానములు కావు శైవకవులు పాడుట కనువైన కొన్ని గద్యలు, రగడలు, వచనములు రచించి యున్నారు అవి రసప్రధానములు కాక మతప్రధానములగుటచే నంతగాఁ బ్రచారము పొంది యుండలేదు కాఁగా మన కిప్పుడు లభ్యములగుచున్న గేయములలో తాళ్ళపాక అన్నమాచార్యులు రచించినవే సుప్రసిద్ధములైనట్టివి వానికి సంకీర్తనలని పేరు అసంఖ్యాకములైన ఆధ్యాత్మిక శృంగార సంకీర్తనలు రచించి పదకవితా పితామహుఁడని పేరొందుటయేకాక అన్నమాచార్యులు సంకీర్తన లక్షణమను పేర నొక లక్షణ గ్రంథమునుగూడా సంస్కృతమున రచించి యాజాతి వాఙ్మయమున కొక స్థిరత్వము కల్పించి యున్నాఁడు దక్షిణాంధ్రయుగము పదకవితకు సువర్ణయుగమని చెప్పఁదగినట్టిది అప్పుడు తండోపతండములుగా రచింపఁబడిన యక్షగానములలోఁ బద్యములకంటెఁ బదములకే ప్రాధాన్య మెక్కువ మఱియు వేలకొలఁది పదములు, కీర్తనలు రచించి యొకవంక గేయ వాఙ్మయమునకును వేఱొకవంక సంగీత కళకును అపారగౌరవ ప్రతిష్ఠలు కలిగించిన క్షేత్రయ్యయు, త్యాగయ్యయు నీ యుగమున నవతరించినవారే వీరిలో త్యాగయ్యకృతులు కేవల శ్రవ్యములైనట్టివి, క్షేత్రయ్య పదములు శ్రవ్యములేకాక అభినయానుకూలములగుటచే దృశ్యతా గౌరవమును గూడఁ బొందినట్టివి సంగీతము, సాహిత్యము, అభినయము అను కళలు మూఁడింటికి కూడలియగుటచే త్రివేణీ సంగమమని చెప్పఁదగిన దాతని రచనా ప్రపంచము

క్షేత్రయ్య జీవిత చరిత్రనుగూర్చి తెలిసికొనుట కాధారము లేవియులేవు అతని పదములనే సూక్ష్మముగాఁ బరిశీలించినచో కొన్ని యంశములు తెలియవచ్చును అవియైనను సత్యములని నిశ్చయించుటకు వేఱు సాక్ష్యములు కానరావు అతఁడు పలువురు దైవతములను గూర్చియేకాక కొందఱు రాజులను గూర్చియు గొన్ని పదములను రచించియుండుటచే వారికాలములనుబట్టి యాతని కాలమునుగూడ నిర్ణయింపవచ్చును "వేడుకతో నడచుకొన్న విటరాయుడు" అను పదమున అతఁడు మధుర తిరుమలేంద్రుని, తంజావూరి అచ్యుత విజయరాఘవేంద్రుని గోలకొండ పాదుషాను బేర్కొనుటయేగాక తానురచించిన పదముల సంఖ్యనుగూడా సూచించియున్నాఁడు మండనరసింహకవి ఆంధ్ర కౌముదిలో క్షేత్రయ్యకవిదిగా నుదాహరించిన

తముఁ దామె వత్తురర్థులు
క్రమమెఱిఁగిన దాతకడకు, రమ్మన్నారా
కమలంబు లున్నచోటికి
భ్రమరంబుల నచ్యుతేంద్ర రఘునాథనృపా

యనుపద్యమునుబట్టి యాతఁడు సుప్రసిద్ధుఁడైన తంజావూరు రఘునాథ భూపాలుని కొలువునకుఁగూడ నరిగినట్లు తెలియుచున్నది ఇదిసుమారు క్రీ శ 1630 ప్రాంతమున జరిగియుండును గావున క్షేత్రయ్య క్రీ శ 17 వ శతాబ్ది ఆరంభమున జన్మించియుండునని చెప్పవచ్చును అతని పదములలో రెండుమూఁడు తుపాకుల వేంకటకృష్ణరాజున కంకితము చేయఁబడినవి ఇతఁడు రామాయణ సుందరకాండము, విష్ణుపురాణము, భగవద్గీత ఆంధ్రమున వచ

నముగా రచించిన అనంత భూపాలునితండ్రి ఇతఁడు చెంజినాయకులకడ సేనాధిపతిగా నుండి 1643 లో చెంజి దుర్గము బిజాపురపు సుల్తాను వశమై పోయినపిమ్మట గోల్కొండ కరుదెంచి పాదుషామంత్రియైన మీర్ జుమ్లా సేనలో దండనాథుఁడుగాఁ బనిచేసెనని తెలియుచున్నది క్షేత్రయ్య గోల్కొండకేగి తౌలిత కృష్ణంరాజు ప్రాపకము గడించి, తద్ద్వారా అప్పటి పాదుషాయైన అబ్దుల్లా కుతుబ్షా దర్శనము సంపాదించి యుండును దీనినిబట్టి యతఁడు క్రీశ 17వ శతాబ్ది చరమ పాదము వఱకును జీవించి యుండునని యూహింపవచ్చును పైపదమున నతఁడు సూచించిన పదములే నాలుగువేల యొకవంద యున్నది అవిగాక యతఁడు రచించిన పదములు మఱికొన్ని యుండవచ్చును అందుచే నతఁడు మొత్తమైదు వేలకుఁబైఁగా పదములు రచించియుండును అందు సుమారు నాలుగు వందలుమాత్రమే యిప్పుడు లభ్యములగుచున్నవి.

క్షేత్రయ్య గోపాలస్వామిభక్తుఁడు అతని పదములు పెక్కు మువ్వపురీ నిలయుఁడైన గోపాలదేవుని కంకితములు ఈ మువ్వ గ్రామము కృష్ణామండలమున కూచిపూడికి సమీపముననున్నది దీనికే మొవ్వయని నామాంతరము ఈ గ్రామము చిత్తూరు జిల్లా యందలి పుత్తూరు తాలూకాలోనిదని కొందఱభిప్రాయ పడుచున్నారు కాని కూచిపూడి భాగవతులు తరతరములనుండి క్షేత్రయ్య పదముల నభినయించుచుండుట ప్రసిద్ధమగుటచేతను, మొవ్వ గ్రామమందు మొవ్వయను నింటిపేరుగల బ్రాహ్మణు లిప్పటికిని నివసించుచు దాము, క్షేత్రయ్య సంతతివారమని చెప్పుకొను చుండుటచేతను, మరికొన్ని యితర కారణములచేతను శ్రీ విస్సా అప్పారావు పంతులుగారా మొవ్వ కృష్ణామండలాంతర్గతమైనదేయనినిరూపించియున్నారు అచ్చట సుమారైదువందల యేండ్లకుఁ బూర్వమే వేణుగోపాలస్వామి యాలయము నిర్మింపఁబడి యుండినట్లు నిశ్చయముగాఁ దెలియుచున్నది క్షేత్రయ్యకుఁ తల్లిదండ్రులు పెట్టినపేరు వరదయ్యయనియు, నతఁడు తరువాతఁ బెక్కు క్షేత్రములను దర్శించి యుండుటచే క్షేత్రయ్య యయ్యెననియు, నాతనిసంతతివారు చెప్పుచున్నారు. అతఁడు తాను దర్శించిన క్షేత్రములందలి యధిదైవతములందరిని గూర్చి యు పదములు రచించినాఁడు పెక్కుచోట్ల వారికిఁ దన యిష్టదైవమైన మువ్వ గోపాలునితో నభేదాధ్యవసాయము కూడా కల్పించినాఁడు ఆది వరాహమూర్తి, కంచి వరదుఁడు, చెవ్వందిలింగఁడు, శ్రీ వేంకటరమణుఁడు, కడప వేంకటేశ్వరుఁడు, తెల్ల గోవిందుఁడు, హేమాద్రిస్వామి, యదుగిరి స్వామి, తిరువళ్లూరి వీరరాఘవుఁడు, పాలగిరిచెన్నుఁడు, వేదనారాయణుఁడు, శ్రీరంగేశుఁడు మున్నగువారాతని స్తుతికిఁ బాత్రులైన వేల్పులలో ముఖ్యులు ఈ దైవములలో మరల కంచివరదునిఁ గూర్చి యాతఁడు రచించిన పదములధిక సంఖ్యాకములైయున్నవి ఇదియు నాతని మొదటి పేరు వరదయ్యయై యుండుటకొక యుపపత్తిగానున్నది క్షేత్రయ్యకు క్షేత్రియ, క్షేత్రజ్ఞుఁడు అను రూపాంతరములు కూడఁ గలవు పలుక్షేత్రముల దర్శించి వానిని గూర్చి విశేషపరిచయము సంపాదించిన వాఁడగుటచే వరదయ్య క్షేత్రజ్ఞుఁడై క్రమముగా తెలుఁగునుడికారము ననుసరించి క్షేత్రయ్యగా మాఱియుండునని శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారి యభిప్రాయము.

శ్రీ విస్సా అప్పారావు పంతులుగారు విశేష పరిశోధనలు కావించి క్షేత్రయ్య జీవితమునకు సంబంధించిన యీ క్రింది విశేషములను సేకరించియున్నారు క్షేత్రయ మొదట సంగీతసాహిత్య నాట్యాభినయాలంకారాది విద్యల నభ్యసించు కాలముననే తనకు సహాధ్యాయియైన యొక దేవదాసిని ప్రేమించి యుండుననియు, నామె సామాన్యస్త్రీ కాక జవ్వనమునకు చక్కదనమునకు నిక్కయై యాతని పదరచనకుఁ బ్రేరేచుచు, నతడు చెప్పు మధురపదములను వ్రాయుచు, నాయా సందర్భములందు వానిని పాడి యభినయించుచుండెననియు, క్షేత్రయ్య రసజ్ఞురాలైన యా వలపుకత్తెతో తనివితీర నానందమనుభవించి క్రమముగా పూర్వజన్మ సంస్కారబలమున రక్తి భక్తిగా పరిణమింపఁ దన యిష్టదైవమగు మువ్వ గోపాలునిపై పదములుచెప్పుట కారంభించెననియు, నందువలనఁ గలిగిన యలౌకికానందము వలన మరింత మారి జీవితాంతమువరకు గోపాలాంకితముగానే పదరచనచేయుచు, సాంఘిక గర్హణమువలననో మఱెందుచేతనో స్వగ్రామమువిడిచి తెలంగాణమునకు దక్షిణ దేశమునకునేగి యచ్చటనున్న తీర్థములను దదధిదేవతలను గళాపోషకులైన రాజులను దర్శించి వారి కంకితముగాఁ బెక్కుపదములు రచించెననియు నందలి సారాంశము క్షేత్రయ్య రచించిన పదములలోఁ బై విశేషములను బలపరచు చరణములుకొన్ని కానవచ్చుచున్నవి సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో క్షేత్రయ్య యొక మహాయోగి వలన గోపాల మంత్రోపదేశము పొందెననియు, నతఁడు మువ్వ గోపాలదేవాలయమున నా మంత్రమును బురశ్చరణము చేయుచుండఁగా గోపాలుఁడు దర్శనమిచ్చి యనుగ్రహించెననియు, నంతనతఁడు "శ్రీపతి సుతుబారికి" అను పదముతో పదరచనచేయ నారంభించెననియు వ్రాయబడియున్నది.

క్షేత్రయ్య తన వలపుక త్తెతో శృంగారమయ జీవితమును గడపుచు నాయోగివలన గోపాల మంత్రోపదేశమును బొంది దానిని జపించుచుఁ దన జీవితమున రక్తితో భక్తి నిగూడ జతసేసి యుండవచ్చును క్షేత్రయ్య పద ములలో నాభక్తిరక్తులు రెండును గోచరించు చునే యుండును

ఆంధ్రమునందలి గేయములను కృతులు, కీర్తనలు, తత్త్వములు, పదములు, జావళీలు, పాటలు అని యేడువిధములుగా విభజింపవచ్చును అందు కృతులు పాటకచేరీ కనువుగా రాగతాళ ప్రధానముగా రచింపఁ బడు రచనలు కీర్తనలు భజన కక్కఱకు వచ్చుగేయములు తత్త్వములు వేదాంత బోధకములైన యధ్యాత్మ రచనలు పదము లభినయానుకూలములై శృంగార రసపూరితములైన ప్రౌఢగేయములు జావళీకూడ పదమువలె నభినయానుకూలమైన శృంగార గేయమేకాని యిందు శృంగార మెక్కువ. ప్రౌఢత తక్కువ పాటలు స్త్రీలుపాడుకొను మంగళహారతులు మున్నగు గేయములు ఆధునికులు ఛందో విరహితములైన యొక రీతి వచనములను వచనగేయములను చున్నారు ఇవి గేయములైనచో నెనిమిదవ రకమునకు చెందును పదములు తాళరాగ విలంబముతోఁ గూడి యుండును రాగ విలంబము వలన గాయకుఁడు దానిని పాడు నప్పుడా రాగమునకు సంబంధించిన సూక్ష్మాతి సూక్ష్మ వివరములను గూడ ప్రదర్శించుట కవకాశము కలుగును అట్లే తాళవిలంబము వలన నభినయించు పాత్ర తన శరీరమున నన్ని భంగిమలను తద్వారా అన్ని భావములను బ్రదర్శించుటకు వీలేర్పడును క్షేత్రయ్య పదములలో నుత్తమ పదముల కుండవలసిన లక్షణములన్ని యుఁ బుంజీకృతములై యున్నవి అతనిచేత పదము పరిణతి పరాకాష్ఠ నందినది

క్షేత్రయ్య వట్టి పదకర్త మాత్రమేకాదు అతఁడలంకార శాస్త్రముతో గాఢమైన పరిచయము సంపాదించి యందు మాత్నమార్గములు త్రొక్కఁజాలిన సామర్థ్యము గలవాఁడు క్రీ శ 15 వ శతాబ్దిలో భానుదత్తుఁ డను పండితుఁడు సంస్కృతమున రసతరంగిణి, అలంకార మంజరియను లక్షణ గ్రంథములను రచించి, యందుఁ బూర్వాలంకారికులు చూపని నాయికా నాయక భేదములు కొన్ని ప్రదర్శించి, శ్రీకృష్ణ పరములైన వర్ణనములతోఁ గూడిన శ్లోకములను వానికి లక్ష్యములుగా నొసంగెనని చెప్పుదురు క్షేత్రయ్యయు లక్షణ విషయమున భానురత్నాదుల మార్గమునే యనుసరించుచు లక్ష్యనిరూపణమునఁ గొంత విశేషము ప్రదర్శించినాఁడు సాధారణముగాఁ బూర్వాలంకారికు లొసంగిన లక్ష్యములు కొన్ని వాస్తవ జీవితమునకు దూరములై కేవలము లక్ష్యములకొఱకే రచింపఁబడి నట్లుండును క్షేత్రయ్య లక్ష్యము లట్లుకాక స్వానుభవమునుండియు, లోకమునుండియు గ్రహింపఁబడిన వగుటచే నెక్కువ సహజములై సుందర తరములుగా శోభిల్లును క్షేత్రయ్య తరువాత నుండిన యొక యాంధ్ర కవి భానుదత్తుని రసమంజరిని శృంగార రసమంజరియను పేరఁ దెనిఁగించి క్షేత్రయ్య పదములనే లక్ష్యములుగా నొసంగుచు వచ్చెను దీనినిబట్టి భానుదత్తుఁడొసంగిన లక్ష్యములకంటెను క్షేత్రయ్య పదము లాలక్షణముల నిరూపించుట కెక్కువ యుచితములై మనోహరములై యుండెనవి భావింపవచ్చును భరతనాట్య శాస్త్రప్రవీణులైన కూచిపూడి వారికిని దత్సంప్రదాయానుసారులైన యితరులకును భానుదత్తుని రసమంజరియే ప్రధానమైన పార్యగ్రంథము అందలి లక్షణములన్నిటికిని గొంచె

మించు మించుగా క్షేత్రయ్య పదసముదాయమున లక్ష్యములు గోచరించుట చూడ నతఁడందలి లక్ష్యముల కంటె నెక్కువ మనోహరములైన లక్ష్యములను రచించు నుద్దేశముతోడనే యా పదములను నిర్మించెనవి తోఁపక మానదు ఇది క్షేత్రయ్య శాస్త్ర పాండిత్యమునకు నిదర్శనము ఇంతేకాక యతని పదములలో నచ్చటచ్చట కొక్కోకము, వాత్స్యాయన కామ సూత్రములు మున్నగు గ్రంథములతోగల పరిచయము కూడ ద్యోతక మగుచుండును

క్షేత్రయ్యకుఁ బూర్వముకూడఁ బదరచన కావించినవారు కొందఱుండినను పదములలో గొప్పసంగీత కళాపాటవమునుగూడఁ బ్రవేశపెట్టిన వారిలో నగ్రేసరుఁడతఁడే అందుచేతనే సుప్రసిద్ధులైన సంగీత విద్వాంసులుకూడ నతని పదములను నేర్చుకొని కచేరీలలోఁ బాడుచుందురు అతఁడు తన పదములలో నొక్కొక్క రాగమును సంపూర్ణ స్వరూపముతోడను, వివిధ విన్యాసముల తోడను జిత్రించి పాడువారి పాండితీ ప్రతిభల కెంతో యవకాశము కలిగించును అతఁడు రక్తిరాగములఁ బ్రపంచించుట యందే యధికమైన యభిమానముచూపెను మధ్యమ త్రికాల సంగతులకందు ప్రాచుర్యము తక్కువ అతఁడు కొన్నిరాగముల చిత్రణమునందే దృష్టి కేంద్రీకరించినను ఆ రాగముల సమగ్ర స్వరూపమును అందలి విన్యాస వైవిధ్యమును బ్రదర్శించుటలోమాత్రము పరిణత సామర్థ్యమును బ్రకటించెను. క్షేత్రయ్య తన పదములలో కాంభోజిరాగము పాడుటలో నెవ్వరైన చూపఁగల విన్యాస వైఖరుల నన్నిటిని బూర్తిగావించెనవి శ్రీ శ్యామాశాస్త్రిల వారు చెప్పియుండుట యీ కారణము చేతనే "క్షేత్రయ్యరాగస్వ రూపచిత్ర మతిసుందరము మనోహరము,

అదివఱకెవ్వరును రాగమున కిట్టి యందమును దీర్చిదిద్దినవారులేరు ఇట్టి రాగరచన చేసి రాగమునకు రససిద్ధిని గల్పించి, రాగముయొక్క సంపూర్ణ స్వరూపమును నిరూపించి, సంగీతములో రాగమునకుఁగల యున్నతస్థానమును నిర్ణయించి క్షేత్రయ్య తర్వాతి వాగ్గేయ కారులకు, సంగీత వేత్తలకు మార్గదర్శియైనాఁడు "

సంగీతాభినయముల విషయముననే కాక రసభావపద ప్రయోగాది సాహిత్యాంశముల విషయమునఁగూడ క్షేత్రయ్య పదములకుఁ గల విశిష్టత ప్రత్యేకమైనది రసపోషణమున నాతఁడందెవేసినచేయి దక్షిణాంధ్ర యుగమునందలి కవులందరును ప్రాయికముగా శృంగారరసముననే ప్రాధాన్యమొసంగుటయేగాక దానిని వర్ణించుటలోఁ గొంత హద్దుమీరి వర్తించిరనియు విమర్శకుల తలంపు క్షేత్రయ్యయు నాకాలమునకుఁ జెందినవాఁడే యగుటచేఁ దనపదములన్నింట శృంగారరసమునే చక్కగాఁ బోషించెను శృంగార మయోగ సంయోగ వియోగములకు సంబంధించి మూఁడు రకములుగా నుండును ఈ మూఁడును రక్తి విషయమున నుత్తరోత్తర విశిష్టములై యొప్పారును అందుచేతచే కాళిదాస భవభూత్యాది మహాకవులు విప్రయోగ శృంగారముననే తమ కావ్య నాటకములందెక్కువ యభినివేశముతో వర్ణించియుండిరి క్షేత్రయ్యయు తన పదములందు వియోగశృంగారముననే యధికముగా వర్ణించెను అతఁడు సంయోగ శృంగారమును వర్ణించుచు రతిక్రీడా కుచ గ్రహణాదులను ఆలింగన చుంబనాదులను విశదముగా వర్ణించినపట్లును బెక్కుగలవు అట్టియెడ నాతఁడును సభ్యతామర్యాద నతిక్రమించినాఁడేమో యనిపించును కాని సమకాలిక కావ్యములందలి శృంగార వర్ణనోద్వేగమును బరిశీలించినచో నందు వైపరీత్యమేమియుఁగానిపింపదు అది కాలప్రభావము అతని పదములలో నయోగశృంగారము చాల తక్కువ "నన్నేటికి బొమ్మనేరే వాని యొద్దికి" మున్నగు పదములలో శృంగార రసాభాసము గోచరించుచున్నది

క్షేత్రయ్య పదములలోఁ బెక్కు మువ్వగోపాలాంకితములు కొన్ని అన్యదైవతాంకితములు కొన్ని విజయరాఘవాది రాజాంకితములు అందలి వస్తువు నాలుగైదు రకములుగాఁ గానిపించును అందుఁ గొన్నిట నాయికా వాక్యములు, కొన్నిట దూతీవాక్యములు, కొన్నిట నాయక వాక్యములు, కొన్నిట నాయికానాయక సంభాషణములు వర్ణితములై యున్నవి వీనిలో విరహోత్కంఠయైన నాయిక విరహము సైఁపలేక చెలికత్తెతోఁ దనగోడు వెల్లడించుకొను ఘట్టములును, నాయకుఁడన్యాసక్తచిత్తుఁడై యుండుట యెఱింగి నాయిక యాతని నుపాలంభించుఘట్టములును అధికము విరహోత్కంఠ, వాసకసజ్జిక, ఖండిత మున్నగు నాయిక లందఱు నీపదములందచ్చటచ్చటఁ జిత్రింపఁబడియున్నారు అట్లే స్వీయ, పరకీయ, సామాన్య అనుభేదములకును, అందలి యవాంతర భేదములకును సంబంధించిన నాయికలును, దక్షిణానుకూల దృష్టశఠాది నాయకులును అచ్చటచ్చట గోచరింతురు కవి తానే నాయికానాయకులయు దూతికలయు పాత్రవహించి సందర్భోచితముగా భావములను వెల్లడించుచుండును "మన మెట్టి నాయికానాయకులను ఎట్టియవస్థలను దలచుకొన్నా అందుకు తగినపదము క్షేత్రయ్య రచనలందుఁ గనఁబడఁగల"దని డా గిడుగు వేంకటసీతాపతిగారన్న వాక్య మెంతయు ధాయర్థము అందుచేతనే ఈ పదములందున్న రసము సర్వత్ర శృంగారమేయై యన్నిటినేదోవిధముగా నేకసూత్రమున గుదిగ్రుచ్చ చున్నను ఒక పదమునకును మరొక పదమునకును అనుస్యూతమైన సంబంధము లేకపోవుటచే నవి యాయాసందర్భములందు కవి భావనా విన్యాసముచే నాయాయవస్థల నూహించి రచించిన ముక్తక పదములవలె గోచరించును ఆ కారణముచే శాలివాహన సప్తశతియందలి గాథలనువలె వీనినిగూడ నాయికా నాయకాద్యవస్థలను సూచించు నవతారికలతో ముద్రించుట పాఠకుల యవబోధనమున కెక్కువ సాహాయ్యకారి కాఁజాలునని నాయుద్దేశము

కొన్ని పదములలో క్షేత్రయ్య యాత్మీయాంశము గోచరించుచున్నది స్వవిషయమునే యాతఁడు కొన్ని చోట్ల నవ్యాపదేశముగాఁ జెప్పుచుండును పోతన దశమస్కంధమునఁ గూడ నిట్టి గుణము పుష్కలముగా గోచరించును గోపికల విషయమున నతఁ డందుఁ దన భక్తి ప్రేమలనే వర్ణించుట యందుకుఁ గారణము క్షేత్రయ్య పదములలో నట్టి యాత్మభావోద్రేకము పెక్కుచోట్ల నిండారి యుండుటచే వాని కెనలేని శక్తి నైశిత్యములు చేకూరినవి క్షేత్రయ్య యెంత రక్తుఁడో యంత భక్తుఁడు అందుచే నతఁడే నాయికయై మువ్వ గోపాలునిఁ దన ప్రాణేశ్వరునిగా భావించి తద్వియోగమును సైఁపలేక యీ పదములను రచించెననియు, నందుచే నిందలి శృంగారము మధుర శృంగార మనఁబడు భక్తిమయమైన శృంగారమనియు భావించుట కవకాశమున్నది భరతుఁడు నాట్యశాస్త్రమున కామము చతుర్విధ పురుషార్థములకు సంబంధించి నాలుగు రకము లనియు, నందు మోక్షకామము మోక్షరతితోఁ గూడి యుండుననియుఁ జెప్పి యుండెను భాగవతమున గోపికల యందిట్టి మోక్షకామము కొన్ని

యెడల గోచరించుచుండును అట్టి దానినీ
మధుర శృంగార మనవచ్చును క్షేత్రయ
పదములలో నీ శృంగారము భగవత్సంబద్ధమే
యై యున్నను రతి క్రీడాది వర్ణన పూర్వ
కమై లౌకిక సీమలను దాఁటఁజాలక పోవు
టచే నౌజ్జ్వల్య భావము నిముడ్చుకొనలేక
పోయినదని నా యూహ లౌకికమైన కామ
మును గూడ నేదో విధముగాఁ ద్రిప్పి మోక్ష
రతి సహితమైన మధుర శృంగారముగా
భావించుట శ్రీ శే రామలింగా రెడ్డిగా
రన్నట్లు కామము నాధ్యాత్మిక భావముగా
భ్రమించుట యగును ("It is doubtful
whether we are spiritualizing sex
or sexualising spirit, whether we
are sublimating earth to heaven or
bringing down the heaven to our
muddy levels and depths ") క్షేత్రయ్య
లౌకిక శృంగారమునే వర్ణించె ననుకున్నను
అది యాతని భక్తి సంపదను తగ్గింపఁ
జాలదు మానవ మనోవృత్తి తరంగిణిలో
భక్తి శృంగారములు రెండు పాయలుగా
జత గూడి ప్రవహించుట పెక్కు చోట్లఁ
గానిపించును దుర్భరమైన వియోగ వేద
నను వర్ణించు పట్ల క్షేత్రయ్య పదములు
కొన్ని చోట్ల కరుణ రసమునకును దావిచ్చు
చుండును "మోసపుచ్చిరమ్మ మగవాని
ఆఁడదంట ముదిత లందఱుఁ గూడుక"
మున్నగు పదములతో హాస్యచ్ఛాయలు
గోచరించుచున్నవి

భావప్రకటనమున క్షేత్రయ్య మిక్కిలి
ప్రౌఢుఁడు ఆతని పదములన్నియు విను
వారి హృదయములుచ్చిపోవు నిశితములైన
భావమున కునికిపట్టులు వానిలో గాంభీర్య
ముతో పాటు సౌకుమార్యమును, నైశిత్య
ముతో పాటు ప్రసన్నతయు జత గూడి
యుండును "ఏమి సేయుదు మోహ మెటు
వలెనుదీరు" మున్నగు పదములు చదివిన
పీ విషయము తేట తెల్లము కాఁజాలును
"వెలయ నీదు ముఖారవిందంబు లిఖియించి
అలరు వాసనలు వ్రాయఁగ నేరనైతి,
కళలొల్కు నీ మోవి గడఁగి వ్రాసితిఁగాని
నెలఁత తేనియలుంచ నే నేరనైతి" అను
చరణము నందలి భావము కాళిదాసాది మహా
కవులకుఁ దక్క నన్యుల కలవడునదికాదు
ఇట్టి నిశిత మనోహరములైన భావము లీ
పదములందెచ్చట జూచినను నందనము
నందెచ్చటఁ జూచినను పారిజాతములవలెఁ
గనిపించును క్షేత్రయ్య వర్ణనలు కడుంగడు
విశదములై దృశ్యమును బరితల మనో
నేత్రములకు సాక్షాత్కరింపఁ జేయు
చుండును "మగువ తన కేళికా మందిరము
వెడలెన్" మున్నగు పదములిట్టి భావ
చిత్రములకుఁ దార్కాణములు క్షేత్రయ్య
భావన లోతైనది, పరిశీలనము నిశితమైనది
వాని సాయమున నాతఁడల్ప విషయము
నైన నత్యంత హృదయావర్జకముగాఁ దీర్చి
దిద్దును

పద ప్రయోగ విషయమున క్షేత్రయ్య
పదములకుఁ గల ప్రాముఖ్య మింతింతన
రానిది అతఁడు సర్వత్ర శృంగారమునే
వర్ణించును గావునఁ దద్రసానుకూలములైన
మధుర ప్రసన్న పదములనే యేరి ప్రయో
గించుచుండును అవి శ్రావ్యతా మాధుర్య
ములకు వలెనే భావ వ్యంజన సామర్థ్యమున
కును, దేశితనమునకు వలెనే సౌందర్య
మునకును నునికి పట్టులు ఆ నాటి పలుకు
బడు లెన్నో యీ పదములందు గోచరించును
క్షేత్రయ్య క్లిష్టములైన సంస్కృత పదము
లను గాని, మాఱు మూల తెలుఁగు పద
ములను గాని వాడక సర్వ సుబోధములైన
జాతీయ పదములనే యెక్కువగా వాడి
యుండెను అన్నెకారి, గుల్లకాఁడు, ఆరు
దూరు, ఉప్పతించు, గొంటుకాఁడు, అలవ
రించు (అలంకరించు) ఆముకొను (పైకొను)
జూజము, నేయము (న్యాయము) గాయ
కము (జాణ తనము) మకురు మనసు,
మొగనాలు, చేలాగు (లైలాగు) అంత
రంగులు (ప్రాణసఖులు) చందురు పిల్లలు
(నఖక్షతములు) విదియ చందురులు, చేపట్లు
(కలహము) శానా (చాల) మున్నగు
పదములట్టివానిలోఁగొన్ని శబ్దరత్నాకరము
నందలి పదములకు క్షేత్రయ పదములనుండి
కొన్ని యుదాహరణము లొసంగఁబడినవి
కొన్ని శబ్దములకు క్షేత్రయపదములు తప్ప
నితరాధారములు కానరావు ఈ విషయము
క్షేత్రయ ప్రామాణికత్వమును బ్రకటించు
చున్నది వచ్చీని, చేశేనివంటి వ్యావహారిక
ప్రయోగములాతని పదములలోఁ గొన్ని
గలవు పాడుటకే వ్రాయబడు గేయములలో
నట్టివుండుటలో వింతలేదు ఆతని పద
ములలో "అరటాకు ముల్లు సామ్య
మైనందుకు, తోటకూరదొంగవలె తొలగి
పోయేవాడవు, పాముడి జోగివలె పోయె
నాబ్రదుకు, బావిలోనినీరు వెల్లువ పోయీ
నటవే, చేత కాసులేదుగాని చేసైగలే"
మున్నగు లోకోక్తులెన్నో విరివిగా వాడఁబడి
యున్నవి క్షేత్రయ్య కృత్రిమములైన శబ్దా
లంకారములకై యెక్కుడను ప్రయత్నిం
పఁడు "శ్రీసుతుభారికి నే నోపలేక నిను
వేఁడితే కోపాలా ! మువ్వగోపాలా" యను
చోటవలెఁ గొన్ని చోట్ల ననుప్రాసాదు
లప్రయత్నసిద్ధములై పదముల కధికమైన
శ్రావ్యత చేకూర్చుచున్నవి ఈ విధముగ
క్షేత్రయ్య పదములలో పదకవిత్వమున
సహజముగా నుండవలసిన లాలిత్యమును,
తెలుఁగు భాషయందు సహజముగా నెలకొని
యున్న సంగీతమును నిండారియుండును

(తరువాయి 43 ఎ పేజీలో

# సంగ్రహ ప్రకటనలు

క్రయవు భత్యంతో కలుపుకొని రూ 80-150 అంతకు తక్కువ జీతపు స్కేళ్ళలో వున్న ఉపాధ్యాయుల సూపర్ అన్యుయేషన్ వయస్సును పెంచుతూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1962 మేలో ఉత్తర్వులు చేయడం జరిగింది అయితే అటువంటి ఉపాధ్యాయులు మంచి సర్వీసు రికార్డును, సామర్థ్యాన్ని, శారీరక అర్హతలను కలిగివున్నట్లుగా విద్యాశాఖ డైరెక్టరు పరిగణించాలనే షరతుకు లోబడి ఈ ఉత్తర్వులు చేయబడినవి పై రాయితీని ఇతర అన్ని వర్గాల ఉపాధ్యాయులకు కూడా వర్తింపజేయగోరుతూ ప్రభుత్వానికి పెక్కు విజ్ఞాపనలు వచ్చాయి

అర్హతలు గల ఉపాధ్యాయులు లభించని సందర్భాలలోకానీ లేదా విద్యా సంస్థల నిర్వహణ ప్రయోజనాన్ని పురస్కరించుకొని కానీ అన్ని వర్గాల రిటైరైన ఉపాధ్యాయులను ఎటువంటి ప్రత్యేకింపులు లేకుండా స్వేచ్ఛగా తిరిగి నియమించవచ్చునని ప్రభుత్వం ఇప్పుడు ఉత్తర్వులు చేసింది అయితే మంచి పాలనా అనుభవం గల ప్రతిభావంతులైన వ్యక్తులను తిరిగి నియమించడం ఉచితమని పరిగణించే సందర్భంలోనే ఆ విధంగా చేయాలి లెక్చరర్లు, ప్రొఫెసర్లకు కూడా ఇదే పద్ధతిని వర్తింపజేయాలి

కళాశాలలు, పాఠశాలల ఉపాధ్యాయులను కూడా అవసరమైన సందర్భాలలో సాధారణ విస్తరణ విషయంలో ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయులకు వర్తించునట్టి షరతుల (విద్యాశాఖ 24-5-1962 తేదీన జారీ చేసిన జి ఓ ఎం ఎస్ నెం 1478) పైననే తిరిగి నియమించవచ్చును అయితే అటువంటి ఉపాధ్యాయులు మంచి సర్వీసు రికార్డును, సామర్థ్యాన్ని శారీరక అర్హతలను కలిగివున్నట్లుగా విద్యాశాఖ డైరెక్టరు పరిగణించాలనే షరతుకు లోబడి ఈ నియామకం జరగాలి రిటైరైన నాన్ గెజిటెడ్ సిబ్బందిని తిరిగి నియమించడానికి విద్యాశాఖ డైరెక్టరు మంజూరీ ఇస్తారు

పరిపాలనా సంబంధమైన ఉద్యోగాలకు అర్హులైన వ్యక్తులు ప్రమోటు చేయబడడంలో అవరోధం ఏర్పడకుండా వుండేందుకై, తిరిగి నియమించబడే ప్రధానోపాధ్యాయులు, ప్రిన్సిపాల్ వరుసగా ఉపాధ్యాయులుగా, లెక్చరర్లుగా నియమించబడాలి

పైన పేర్కొన్న విధంగా తిరిగి నియమించబడే రిటైరైన ఉద్యోగులను వారి వయస్సు 55 సంవత్సరాలు దాటిన తరువాత ఎప్పుడైనా ఎటువంటి కారణం చూపకుండానే మూడు నెలల నోటీసు ఇచ్చి ఉద్యోగాలనుండి తొలగించవచ్చును

## సైన్యంలో ఎమర్జన్సీ కమిషను

సైన్యంలో ఎమర్జన్సీ కమిషను కొరకు దరఖాస్తు చేస్తున్న అభ్యర్థులు, తమ విద్యా సర్టిఫికెట్ల అసలు ప్రతులను ఇంకా అందజేస్తూనే వున్నారు ఇందువల్ల అనవసరంగా ఉత్తర ప్రత్యుత్తరాల సంఖ్య పెరిగిపోవడం జరుగుతుంది కాబట్టి దరఖాస్తులకు విద్యా సర్టిఫికెట్ల అసలు ప్రతులను గాక సర్టిఫికెట్ల ధ్రువీకృత ప్రతులను మాత్రమే జోడించాలి

## వెనుకబడిన తరగతులు · వివరణ

రాష్ట్ర శాసనసభ్యులు కొందరు చేసిన విజ్ఞాపనను పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, 1961 సెప్టెంబరులో, సర్కారు జిల్లాలలోని తెలగాలను, కాపులను "ఇతర వెనుకబడిన తరగతుల'' జాబితాలో చేర్చడానికి నిశ్చయించి 1961 అక్టోబరులో తదనుగుణ్యంగా ఉత్తర్వు చేసింది

తరువాత, నెల్లూరు జిల్లాలోని రెడ్లను సాధారణంగా కాపులు అంటారనీ, 'రెడ్ల' సర్వీసు రిజిస్టర్లలో వారు 'కాపు' కులానికి చెందినట్లు ఎంట్రీలు వ్రాస్తారనీ ప్రభుత్వం దృష్టికి వచ్చింది "రెడ్లు"గా పిలువబడే నెల్లూరు జిల్లా "కాపు" లనువారు సమాజంలో ఆర్థికంగా మంచి స్థితిలో వున్నందున వెనుకబడిన తరగతుల వారుగా పరిగణించవచ్చునా అని వివరణను కోరడం జరిగింది

నెల్లూరు జిల్లాలో కొన్ని ప్రాంతాలలో "రెడ్లు" అధిక సంఖ్యలో వున్నారనీ, వారిని 'కాపులు' అని కూడా పిలుస్తారనీ, ఈ విధంగా పిలువడం బాగా వాడుకలో వుందనీ ఇలాంటి వారిని, వెనుకబడిన తరగతుల జాబితాలో చేర్చిన కాపు, తెలగ లేదా సెట్టిబలిజ కులాలకు చెందినవారనడానికి వీలులేదని కూడా ప్రభుత్వం దృష్టికి వచ్చింది

ఈ పరిస్థితి దృష్ట్యా ప్రభుత్వం ఈ అంశాన్ని పునఃపరిశీలించి, సాధారణంగా కాపులుగా పిలువబడుతూ సమాజంలో ఆర్థికంగా మంచి స్థితిలో నున్న నెల్లూరు జిల్లా 'రెడ్ల'ను "వెనుకబడిన తరగతుల వారుగా పరిగణించరాదని ఉత్తర్వు చేసింది.

## భూమి శిస్తు రెమిషన్

అనంతపురం జిల్లా బెలుగుప్ప, శ్రీరంగాపురం గ్రామాలలో అనావృష్టి పరిస్థితులకు గురైన ప్రదేశాలలో 1372 వ ఫసలీలో దిగువ విధంగా సహాయక చర్యలు

తీసుకోవడానికి రెవెన్యూబోర్డు సిఫార్సును పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మంజూరీ ఇచ్చింది — (అ) 1372 వ ఫసలీలోనూ అంతక్రితం రెండు ఫసలీలలో ఏదో ఒక ఫసలీలోనూ అనావృష్టివల్ల నష్ట పడిన బెలుగుప్ప, శ్రీరంగాపురం గ్రామాలలో పంట దిగుబడి ఆరు అణాలు, అంతకు తక్కువ వున్న ఖుష్కీ భూములపై 1372 వ ఫసలీ బాపతు శిస్తుకు పూర్తి రెమిషను ఇస్తారు

(ఆ) తరి భూములు రక్షిత ప్రాంతాలు మొదలైన వాటికి చెల్లించవలసివున్న భూమి శిస్తు మినహా ఇతర భూమి శిస్తుల-ప్రస్తుతం చెల్లించ వలసినవి, బకాయీలు—వసూళ్లను ఒక సంవత్సరం వరకు వాయిదా వేస్తారు

(ఇ) వేరుసెనగ, ప్రత్తి మినహా ఇతర వాణిజ్య పంటలపై ప్రత్యేక పన్ను బకాయీల వసూళ్ళను ఒక సంవత్సరం వరకు వాయిదా వేస్తారు ఈ 1372 వ ఫసలీకి చెల్లించవలసిన తక్కావీ అప్పుల కిస్తులు బకాయీలవసూళ్ళకు ఒక సంవత్సరం వరకు వాయిదా వేస్తారు

## అత్యవసర పరిస్థితిలో సైనికసర్వీసు

ప్రస్తుత అత్యవసర పరిస్థితిలో సైనిక సర్వీసులో చేరే సివిల్ ప్రభుత్వోద్యోగులకు వర్తింపజేస్తున్న ఉద్యోగ నిబంధనలను, షరతులను, ప్రస్తుత అత్యవసర పరిస్థితిలో సైనిక సర్వీసులో చేరడానికి అనుమతించ బడిన ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ రంగం సంస్థలు, కార్పొరేషన్ల ఉద్యోగులకు కూడా, వర్తింప జేయడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిశ్చయించింది

## అధికార పరిధుల పునః విభజన

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, వాణిజ్య పన్నుల శాఖ అసిస్టెంట్ కమీషనర్ల అధి కార పరిధులకు సంబంధించి, లోగడ అమల్లో వున్న ఉత్తర్వులను రద్దు పరుస్తూ జూలై మొదటి తేదీన దిగువ పేర్కొన్న కొత్త మార్పులను అమల్లోకి తెచ్చింది

కాకినాడలో వుండే వాణిజ్య పన్నుల అసిస్టెంట్ కమీషనరు శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి జిల్లాలకు సంబంధించిన అప్పీళ్ళు, విజయవాడలో వుండే అసిస్టెంట్ కమీషనరు పశ్చిమ గోదావరి, కృష్ణా జిల్లాలకు సంబంధించిన అప్పీళ్లు, గుంటూరులో వుండే అసిస్టెంట్ కమీషనరు గుంటూరు, నెల్లూరు జిల్లాలకు సంబంధించిన అప్పీళ్లు, అనంతపురంలో వుండే అసిస్టెంట్ కమీషనరు అనంత పురం, కర్నూలు, కడప, చిత్తూరులకు సంబంధించిన అప్పీళ్ళు, గుంటూరు డివిజనుకు సంబంధించిన అపరిష్కృత అప్పీళ్ళు, హైద్రాబాదులోవుండే అసిస్టెంట్ కమీషనరు పూర్తి తెలంగాణా ప్రాంతానికి సంబంధించిన అప్పీళ్ళు

## వడగండ్ల వానలు - సహాయకచర్యలు

మెదక్ జిల్లా మెదక్, ఆందోల్, నారాయణ్ ఖేడ్, సంగారెడ్డి, గజ్వేల్, సిద్దిపేట తాలూకాలలో వడగండ్ల వానలవల్ల నష్టపడిన గ్రామాలలో దిగువవిధంగా భూమి శిస్తు రెమిషన్లు ఇవ్వడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మంజూరీ ఇచ్చింది — పంట దిగుబడి నాలుగు అణాలు అంతకు తక్కువ వున్న భూములకు భూమి శిస్తు పూర్తి రెమిషను, దిగుబడి నాలుగు అణాలకు పైన ఆరు అణాలకు లోపు వున్న భూము లకు సగం శిస్తు రెమిషను

పైన పేర్కొన్న తాలూకాల తహశీల్దార్లు 1963 ఏప్రిల్ 15 వ తేదీ తరువాత కూడా తలబ్‌మాల్ దరఖాస్తులను స్వీకరించడానికి వీలుగా ప్రభుత్వం హైద్రాబాదు భూమి శిస్తు నియమావళి 45 (2) వ నిబంధనను సడ లించింది నష్టపడిన గ్రామాలలో 1372 వ ఫసలీలో వసూలు చేయవలసివున్న భూమి శిస్తు, తక్కావీ అప్పులు, ఇతర బకాయీల వసూళ్ళను 12 నెలల వరకు వాయిదా వేయ డానికి కూడా ప్రభుత్వం ఉత్తర్వు చేసింది

## భూమిశిస్తు బకాయీల మాఫు

మహబూబ్‌నగర్ జిల్లా గద్వాల, అలంపురం తాలూకాలలో అనావృష్టికి గురైన గ్రామాలలో వరుసగా మూడు సంవత్సరాలు క్షామక పరిస్థితులవల్ల వసూలు చేయలేకపోయిన 1367 వ ఫసలీ బాపతు రూ 5,89,692—27 న పైల భూమి శిస్తు బకాయీలను మాఫుపరచడానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఉత్తర్వు చేసింది

## వినోదపు పన్ను మినహాయింపు

నృత్య నాటకాలతోసహా సమస్త నాటక ప్రదర్శనలు, అన్ని సంగీత, నృత్య ప్రదర్శ నలు, సంగీత, నృత్యాలతో కూడిన వినోద ప్రదర్శనలు, ఇలాంటి అంశాలు గల ఇతర ప్రదర్శనలను, 1939 వ సం పు ఆంధ్ర ప్రదేశ్ వినోద పన్నుల చట్టంక్రింద 1963 ఏప్రిల్ మొదటి తేదీ నుంచి మరో సంవత్సరం వరకు వినోద పన్ను చెల్లింపు నుంచి మినహాయించడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉత్తర్వు చేసింది ★

---

( 41 వ పేజీ తరువాయి )

క్షేత్రయ్య యీ పదములలో యతిప్రాసలను గూడ సనియమముగా వాడి వాని శ్రావ్యతకు వన్నె చేకూర్చి యున్నాఁడు

క్షేత్రయ్య పదములభినయానుకూల్య మునకుఁ బేరొందినవి కూచిపూడివారు వీని నత్యభిమానముతో నారాధించుట యీ గుణ విశేషముచేతనే అన్నమాచార్యుల సంకీర్తన లందును, త్యాగయ్య కృతులందును సంగీత సాహిత్యపాటవ మడుగడుగున గోచరించు చుండు మాట సత్యమేయైనను వానియందభి నయానుకూల్యము మృగ్యము క్షేత్రయ్య పదములు సాహిత్యదృష్టితోఁ జూచినను, సంగీతదృష్టితోఁ జూచినను, అభినయ దృష్టితోఁ జూచినను అప్రతిమాన సౌందర్య శోభితములై యాశ్రయించిన వారికెల్ల నానందామృతము చూరయిచ్చును ఊరక చదువునప్పుడుకంటె పాడునప్పుడును, పాడు నప్పుడుకంటె నభినయించునప్పుడును వాని సౌందర్య మధికముగా గోచరించుచుండును తాళవిలంబము మూలమున నాంగికాభినయ ముచే నెట్టి గంభీరభావమునైన స్పష్టముగా వ్యక్తముచేయుట కవకాశము లభించును సాహిత్య సంగీతాభినయ సర్వస్వములనఁ దగిన యీ పదములు సృజించి క్షేత్రయ్య పద వాఙ్మయ లక్ష్మికిఁ జేకూర్చిన ప్రత్యగ్రశోభా సౌందర్యములప్రతిమానములు, ఆ త్రిలింగ భాషా సంస్థాయులు ★

# పరిశ్రమలకు ప్రోత్సాహం

*ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమల అభివృద్ధికి దోహదం చేయగల వాతావరణాన్ని సృజించడానికి ప్రభుత్వం అన్ని విధాలా ప్రయత్నిస్తున్నదని పరిశ్రమలశాఖ ఉపకార్యదర్శి శ్రీ ఎన్ కె సేత్, ఐ ఏ ఎస్, 1963 జూన్ 29 వ తేదీన ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రం నుంచి ప్రసారమైన చర్చాగోష్ఠిలో అన్నారు ఈ చర్చ సారాంశం దిగువ పొందుపరచబడినది*

ప్రశ్న ఆంధ్రప్రదేశ్, భారతదేశంలోని తోడి రాష్ట్రాలలో గల ప్రతిపత్తికి అనుగుణ్యంగా పారిశ్రామిక రంగంలో ప్రగతిని సాధించడం లేదనే అభిప్రాయం సాధారణంగా ప్రజలలో వుంది ఒక సీనియర్ అధికారి రాష్ట్ర పారిశ్రామికాభివృద్ధి విషయాలతో సన్నిహితసంబంధం గల మీరు దయచేసి ఈ అంశానికి సంబంధించిన విషయాలను వివరిస్తారా?

సమాధానం శ్రీ ఎన్ కె సేత్ – మనరాష్ట్రంలో పారిశ్రామికీకరణకు సంబంధించిన ప్రస్తుత పరిస్థితినిగురించి వివరించ వలసిన ఆవశ్యకతవుంది ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామికాభివృద్ధి ఇప్పటివరకు తగినంత స్థాయిలో జరగలేదనీ, ముఖ్యంగా పొరుగు రాష్ట్రాలైన మద్రాసు, మైసూరులతో పోల్చినప్పుడు ఈ లోటు ప్రస్ఫుటంగా కానవస్తుందనీ ప్రభుత్వానికి తెలుసు ఈ పరిస్థితికి గల కారణాలు మనకు తెలియనివేమీకావు

నా దృష్టిలో ఈ పరిస్థితికిగల ముఖ్య కారణం, మనది ప్రధానంగా వ్యావసాయిక రాష్ట్రంకాబట్టి ఇప్పటివరకు మనం ఇతర అంశాలపై కంటె వ్యవసాయంపై అధికంగా దృష్టిని కేంద్రీకరింపజేయడమే అందుచేత, పారిశ్రామికీకరణ అనే పందెంలో మనం సహజంగానే వెనుకంజవేశాం ఇప్పుడు ఈ పరిస్థితిని అధిగమించడానికి ఉపక్రమించాం పరిశ్రమలు వృద్ధిజెందడానికి అనువైన వాతావరణాన్ని సృజించడానికి కొంతకాలం పడుతుందనే నా అభిప్రాయంతో మీరంతా ఏకభవిస్తారనే విశ్వసిస్తున్నాను మన రాష్ట్రంలో సాధారణంగా పరిశ్రమల అభివృద్ధికి దోహదం చేయగల వాతావరణాన్ని కల్పించడానికి ఇప్పుడు మనం ప్రయత్నిస్తూవున్నాం

ప్ర రాష్ట్రంలో పారిశ్రామిక ప్రగతికి అనువైన వాతావరణాన్ని సృజించడానికి రాష్ట్రప్రభుత్వం తీసుకున్న చర్యలను విశదీకరిస్తారా ?

## అభివృద్ధి కార్పొరేషల్లు

సమా ప్రైవేటు రంగంలోనూ పబ్లిక్ రంగంలోనూ పరిశ్రమల అభివృద్ధికి సమంగా ప్రోత్సాహమివ్వాలనే విధానాన్ని నిర్ణయించడం ద్వారా రాష్ట్ర ప్రభుత్వం పారిశ్రామికీకరణ ప్రగతికి ముఖ్యచర్య తీసుకున్నది ప్రభుత్వ దృష్టిలో ఈ రెండురంగాలు భిన్నభిన్నమైనవి కావు కాగా పరస్పర సంబంధం కలిగినవి ఈ రెండు రంగాలలోనూ పారిశ్రామిక వికాసం అత్యావశ్యకం

ఈ దృష్ట్యాప్రభుత్వంమనరాష్ట్రంలో పరిశ్రమలను నెలకొల్పదలచినప్రైవేటు పరిశ్రమదార్లందరినీ ప్రోత్సహిస్తూవున్నది పారిశ్రామిక లైసెన్సులకొరకు వీరు పెట్టుకునే దరఖాస్తులను భారత ప్రభుత్వానికి సిఫార్సు చేయడంలో ప్రభుత్వం ఉదార వైఖరిని అవలంబిస్తున్నది నివేశనస్థలం, నీరు, విద్యుచ్ఛక్తి సౌకర్యాలు పొందడంలో వీరికి ప్రభుత్వం సహాయపడుతుంది అర్హతగల పరిశ్రమలకు ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషను ఋణ సహాయం చేస్తుంది లేదా రెండు పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషన్లలో ఏదైనా ఒకటి, ఇటువంటి సహాయం అందజేస్తుంది

ప్ర ప్రభుత్వం, రెండు పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషన్లను ఏ ఉద్దేశ్యంతో నెలకొల్పిందో తెలుపుతారా ?

సమా రాష్ట్రంలో పారిశ్రామికాభివృద్ధికి చేయూతనివ్వడమే ప్రభుత్వం భారీ పరిశ్రమలు, లఘు పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్లను నెలకొల్పడంలోగల ప్రధానోద్దేశం ఆంధ్ర ప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషను ఋణాలు మంజూరుచేయడం వాటాలు తీసుకోవడంతోపాటు, అర్హతగల ప్రైవేటు పరిశ్రమలలో కూడా ఆర్థికవిషయంగా

పొల్గొంటుంది ఇంతేగాక, అవసరమైన సందర్భాలలో ప్రైవేటు వ్యక్తులు లేక సంస్థలతోకలసి నిర్ణీతమైన కొన్ని పరిశ్రమలను పెంపొందించడానికి కూడా ఈ కార్పొరేషను ప్రయత్నిస్తున్నది

ఇదే విధంగా లఘు పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషను, కూడా ఋణాలు మంజూరుచేయడం, వాటాలు తీసుకోవడంతోపాటు అర్హతగల పరిశ్రమలలో వాటాలుపొందడంద్వారా పొల్గొంటుంది లోగడ శాఖాపరంగా నడపబడిన సుమారు 27 లఘు పరిశ్రమల యూనిట్లను, వాణిజ్యదృష్ట్యా సమర్ధంగా నిర్వహించేందుకు ఇప్పుడు ఈ కార్పొరేషనుకు బదిలీచేశారు భారీ విద్యుత్పరికరాలు, సింథటిక్ డ్రగ్ కర్మాగారాలకై పటంచెర్వు పారిశ్రామిక వాడలో కొన్ని సహాయ పరిశ్రమలను నెలకొల్పడానికి గల అవకాశాలను కూడా కార్పొరేషను పరిశీలిస్తున్నది

ఈ విషయాలనుబట్టి, యీ రెండు కార్పొరేషన్ల బహుముఖమైన కార్యకలాపాలను నిర్వహించినప్పటికీ, రాష్ట్రంలో అవసరమైనచోట్లలో ప్రయివేటు పరిశ్రమలదార్లతో కలసి పారిశ్రామికీకరణను మరింతవేగంగా జరిపించడానికి కృషి చేయడమే ముఖ్యోద్దేశమైనట్లు మీరు గ్రహించగలరు

ప్ర ఇప్పుడు మీరు భారీ విద్యుత్ పరికరాలు సింథటిక్ డ్రగ్స్ఫ్యాక్టరీలను గురించి ప్రస్తావించారు ఇంకా ఏమన్నా అటువంటి కేంద్రకర్మాగారాలను భారత ప్రభుత్వం రాష్ట్రంలో నెలకొల్పుతున్నదా ?

సమా పారిశ్రామికరంగంలో వివిధ రాష్ట్రాల మధ్య ప్రాంతీయ భేదాలను తొలగింపవలసిన అవసరాన్నిగురించి భారత ప్రభుత్వానికి మన రాష్ట్రప్రభుత్వం ఎప్పుడూ విన్నవించుకొంటూనేవున్నది ఇంతవరకూ కేంద్రం ఆంధ్రప్రదేశ్ లో పెట్టిన పెట్టుబడి చాలాతక్కువ కాని, భవిష్యత్తులో ఇక్కడ కేంద్రరంగంలో పరిశ్రమలను స్థాపించే విషయంలో మన విన్నపాన్ని తప్పకుండా మన్నిస్తానని కేంద్రం హామీయిచ్చింది భారీ విద్యుత్పరికరాల కర్మాగారం, సింథటిక్ మందుల కర్మాగారం - యీరెండు కేంద్ర భారీ ప్రాజెక్టులమీద మొత్తం 50 కోట్లు రూపాయలు పెట్టుబడి పెట్టడం జరుగుతుంది వీటిలో ఎంతోమందికి ఉద్యోగావకాశా లుంటాయి 7-8 కోట్ల రూపాయల పెట్టుబడితో ప్రత్యేకమైన పరికరాలకొరకై హిందుస్థాన్ యంత్ర పరికరాలవారు ఒక కర్మాగారాన్ని నెలకొల్పాలనుకొంటున్నారు ఆంధ్రప్రదేశ్ లో కొన్ని రక్షణ పరికరాల ఉత్పత్తి కర్మాగారాలను నెలకొల్పే అవకాశం వుంది దీనికన్నా ముఖ్యమైన పథకం ఒకటి వుంది 200 కోట్ల రూపాయల ఖర్చుతో 25 లక్షల టన్నులను వుత్పత్తిచేసే ఉక్కుకర్మాగారాన్ని నెలకొల్పడం యీ పథకం ఉద్దేశ్యం ఈ విషయాలన్నింటినిబట్టి ఆంధ్రప్రదేశ్ లో పారిశ్రామికీకరణ వేగాన్ని పుంజుకున్నదని స్పష్టపడుతున్నది

## ప్రయివేటు రంగం

ప్ర ఈ విషయాలనుబట్టి పబ్లిక్ రంగంలోని పారిశ్రామిక కార్యకలాపాలను గూర్చి కొంత అర్థమయింది రాష్ట్రంలో ప్రయివేటు యాజమాన్యంక్రింద పరిశ్రమలను నెలకొల్పేందుకు ప్రయివేటు పెట్టుబడిదారులు చేసే కృషిని గురించి ఏమన్నా తెలియ జేస్తారా ?

సమా మంచిది ఏకొద్దిమందోతప్పమనరాష్ట్రంలోనిప్రయివేటు పెట్టుబడిదారులు మిగతా ప్రాంతాలలోని ప్రయివేటు పెట్టుబడిదారులంత ఉత్సాహం వున్నవారుకారు అందుచేత వారికి అవసరమైన సహాయాన్ని అందజేసి, రాష్ట్రంలో క్రొత్త పరిశ్రమలను నెలకొల్పడానికి వారిని ప్రోత్సహించడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది మన పారిశ్రామిక అభివృద్ధి సంస్థలు వాటి అధ్వర్యంలో పెద్దపెద్ద పరిశ్రమలను స్థాపించడానికిగాక ప్రయివేటురంగంలో పరిశ్రమలు నెలకొల్పబడేందుకు ప్రోత్సహించేందుకే ముఖ్యంగా ఉద్దేశించబడినవి

ఏమయినా మన రాష్ట్రంలో ప్రయివేటు రంగంలోకూడా పారిశ్రామిక కార్యకలాపాలలో చురుకుదనం అందుకున్న సూచనలు అగుపిస్తున్నాయి కొత్తగూడెంలో ఒకటి, విశాఖపట్టణంలో మరొకటి రెండు ఎరువుల కర్మాగారాలను ప్రయివేటు యాజమాన్యంక్రింద నిర్మించడానికి లైసెన్సులు యివ్వబడ్డాయి వాటిని సాధ్యమైనంత త్వరలో నిర్మించడానికి వాటికి సంబంధించినవారు తగు చర్యలుతీసుకుంటున్నారు ఆంధ్ర ప్రదేశ్ పారిశ్రామిక అభివృద్ధి సంస్థతోపాటు యిద్దరు ప్రయివేటు పెట్టుబడిదారులకు 'స్పంగ్' ముడియినుముల తయారీకి లైసెన్సులు మంజూరు చేయబడ్డాయి 'పొలిస్టెరేన్' ఉత్పత్తికై దాదాపు 6 కోట్ల రూపాయల ఖర్చుతో విశాఖపట్టణంలో ఒక భారీ పరిశ్రమను నెలకొల్పుతున్నారు రినాల్ట్ అండ్ కో అనే ఒక ప్రసిద్ధ

ప్రోత్సాహక సంస్థ సహకారంతో హైదరాబాదులో 'ఫోర్జ్' కర్మాగారం ఒకటి నిర్మించబడుతున్నది. ప్రయివేటు వ్యక్తులకు రాష్ట్రంలో కర్మాగారాల్ని నిర్మించడానికి ఎక్కడెక్కడ అనుమతించడం జరిగిందో ఆ విషయాలన్నీ ఏకరువు పెట్టాలంటే కొంచెం కష్టమైన విషయమే. ప్రయివేటు వ్యక్తులు రాష్ట్రంలో సిమెంటు కర్మాగారాలను, బట్టల మిల్లులను, కాగితం మిల్లులను, అనేకమైన ఇంజనీరింగు పరిశ్రమలను నెలకొల్పుతున్నారు ప్రయివేటు రంగంలోని యీ పరిశ్రమలన్నింటి పెట్టుబడులనూ కలిపితే సులభంగా 60-70 కోట్ల రూపాయలు ఉంటుంది.

ప్ర మీరుచెప్పిన దానిప్రకారం ప్రయివేటు రంగంలో పారిశ్రామిక కార్యకలాపాలు చాలా తృప్తికరంగా వున్నాయి. మీరు ఆశిస్తున్నట్టు, రాష్ట్రం పారిశ్రామికీకరణ వేగాన్ని పుంజుకుంటున్నది భవిష్యత్తులో మరింతచురుకుగా యీ కార్యకలాపాలు సాగగలవని ఆసిస్తున్నాము

ప్రభుత్వం కొత్తపెట్టుబడిదారులను, ముఖ్యంగా చిన్నతరహావారిని ఏ విధంగా ప్రోత్సహిస్తున్నదో, పారిశ్రామిక అభివృద్ధిని రాష్ట్రంలో ఏ విధంగా సాధించ నిశ్చయించుకున్నదో దయచేసి తెలియజేస్తారా ?

సమా రాష్ట్ర ఆర్థికపుష్టికి పెద్దతరహా పరిశ్రమలూ, చిన్నతరహా పరిశ్రమలూ- రెండూ వెన్నెముకవంటివని భావించడంవలన యీ రెండురకాల పరిశ్రమల స్థాపననూ అన్ని విధాలా ప్రోత్సహించడంవల్ల ప్రభుత్వం ఎంతో శ్రద్ధ వహిస్తున్నది చిన్నతరహా పరిశ్రమలు పెద్దతరహా పరిశ్రమలకన్నా ఎక్కువ మందికి ఉద్యోగాల్ని కల్పించడంవలనా, చిన్న చిన్న పెట్టుబడిదారులవర్గం ఒకటి తల ఎత్తడానికి కారణం కావడంవలనా సాధారణంగా యీ రంగంలో మనం పారిశ్రామిక కార్యకలాపాలమీద ఎక్కువ శ్రద్ధను చూపించవలసి వుంది. భారీ పరిశ్రమలు దానికి సంబంధించిన అనేక రకాల చిన్న చిన్న పరిశ్రమల స్థాపనకు అవకాశాలు కల్పిస్తాయి గనుక ప్రయివేటు రంగంలోగాని, పబ్లిక్ రంగంలోగాని భారీ పరిశ్రమలను నెలకొల్పడాన్ని ప్రభుత్వం ఆహ్వానిస్తున్నది చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధిని ప్రోత్సహించడానికి ప్రతి జిల్లాలోనూ పారిశ్రామిక వాడలు నెలకొల్పబడినాయి ఈ పారిశ్రామిక వాడలలో నెలకొల్పబడే పరిశ్రమలకు ముడిసరకులను పొందడంలో సహాయపడడమేగాక నీరు, విద్యుచ్ఛక్తివంటి ప్రాథమిక సౌకర్యాలనుకూడా ప్రభుత్వం కలిగిస్తుంది

చిన్నతరహా పరిశ్రమలు ముందు ముందు భారీ పరిశ్రమలను ప్రోత్సహిస్తాయి గనుక, కొత్తభారీ పరిశ్రమలను ప్రోత్సహించే విషయంలో ముందుగా చిన్న తరహా పరిశ్రమలకు తక్కువ ధరకు విద్యుచ్ఛక్తిని అందజేసేందుకు ప్రభుత్వం గట్టిగా ఆలోచిస్తున్నది ఆంధ్రప్రదేశ్ ఆర్థికసహాయ సంస్థ, ఆంధ్ర ప్రదేశ్ చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధి సంస్థ ఉదారమైన షరతులపై ఆర్థిక సహాయాన్ని అందజేయడానికి ముందు కొచ్చాయి రాష్ట్రంలో చిన్నతరహా పరిశ్రమల స్థాపనలో జరుగుతూన్న అభివృద్ధి చాలా తృప్తికరంగా వున్నదన్న విషయం యిక్కడనేను చెప్పవలసి వున్నది

రాష్ట్రంలో ప్రాంతాలవారీగా పరిశ్రమలను స్థాపించే విషయంపై మీరు అడిగిన ప్రశ్నకు ఒక సంగతి చెప్పదలచుకున్నాను కొత్త పరిశ్రమల స్థాపనలో ముఖ్యంగా వెనుకబడిన ప్రాంతాలకే ప్రభుత్వం ప్రాముఖ్యత నిస్తుంది ప్రతిజిల్లాలోనూ ఒక పారిశ్రామిక వాడను నెలకొల్పడం వల్ల రాష్ట్రంలో పరిశ్రమలను వికేంద్రీకరింప జేసిన ట్లవుతుంది. వాస్తవానికి ప్రభుత్వం, పారిశ్రామికంగా వెనుకబడిన జిల్లాలలో మూడుగ్రామీణ పారిశ్రామిక ప్రాజెక్టులను నెలకొల్పి, చిన్నతరహా గ్రామీణ పరిశ్రమల యితోధిక అభివృద్ధి కార్యక్రమం చేపట్టింది రాష్ట్రంలో పారిశ్రామిక అభివృద్ధి వేగంగా జరగడానికి ప్రభుత్వం అన్ని విధాలా చర్యలు తీసుకొంటున్నదన్న విషయంపై మీరు నాతో ఏకీభవిస్తారని నమ్ముతున్నాను





# బిధూ పిన్ని

## బెంగాలీ కథ


మూలం
శ్రీమతి ఆశాపూర్ణాదేవి
అనువాదం
దండమూడి మహీధర్


ఎక్కడోవున్న పరాన్‌కోటనుంచి కలకత్తా వచ్చింది – బిధూపిన్ని ! ఒంటరిగానే ! కొడుకు ఇంటినుంచి అన్న కొడుకు ఇంటికి ! వెంట పెట్టే బేడా ఏమీలేదు – ఏదో చిన్న మూట ఒకటి తెచ్చుకున్నది అంతే ! పాపం కలకత్తాలో వున్న చుట్టాలను ఒక పర్యాయం చూసి వెడదామని బయలుదేరి వచ్చిందట ! ఇంకా నయం – ఉత్తరం రాసి ఈ విషయం తెలియజేసింది

సంజయ ముఖర్జీ – స్వంత అన్నకొడుకు కూడా కాదు, పెత్తండ్రి కొడుకు బిడ్డ ! అయినా అప్యాయత వుంటేనే బంధుత్వం కాని – అది లోపిస్తే అయినవాళ్ళు కూడా కానివాళ్ళకిందే లెక్క ! ప్రీతితో పెట్టింది పిడికెడే చాలన్నారు ! చిన్నతనంలో సంజయ తాతముత్తవల దగ్గర పెరిగాడు ఈకారణం వల్లనే బిధూపిన్నితో ఈయనగారికి బాగా పరిచయం ఏర్పడింది పరిచయ మేమిటి –

అనువాద భారతి

చిన్నప్పుడు ఈమే సంజయకు స్నానపానాదులు చేయించి కాశీమజిలీ కథలు విన్పిస్తూ ఉండేదట !

"అయితే ఇంకేం' ఆ ఋణం తీర్చుకోండి " అని వ్యంగ్యంగా అన్నది సంజయ ముఖర్జీ భార్య దీప, 'నాదేం పోయింది మధ్యన ? తెచ్చి పడేసేవాళ్ళు మీరేగా' ఎంతకాలం వుంటే అంతకాలం వుండమనండి '"

"నీ పిచ్చిగాని — అత్తయ్య శాశ్వతంగా యిక్కడ వుండిపోవడానికి వస్తుందా ఏమిటి దీపా ? నాలుగురోజులుండి తనదారిన తాను వెళ్ళిపోతుంది '' అన్నాడు, సంజయ — "అంత్య నిష్ఠూరంకంటే ఆది నిష్ఠూరమే మేలన్నట్టు — మీకు ముందే చెబుతున్నా మీరనుకుంటున్నారేమోగాని ఆమె మనింట్లోనుంచి యిక కదలదు ! ఈమెకూ, కొడుక్కీ పడటంలేదట' ఎందుకు పడుతుంది ? ఉన్న వ్యాపారంలో లక్షలు గడించాడట' అదెంత నిజమో ? అది నిజమే అయితే ఇక తల్లితో పనేమిటి ? — ఆమెను కాస్తా బయటికి వెళ్ళగొట్టేశాడు' ఆపైని మీ యిష్టం !''

సంజయకు ఏం సమాధానం చెప్పాలో తోచలేదు అత్తయ్య వుత్తరం అందిన వెంటనే సమాధానం రాసి వుండవలసింది' దీప ఏమి రాయాలోకూడా సూచించింది "వంటలక్కకు జబ్బుచేసింది నౌకరు పారిపోయాడు పనిమనిషి మానుకున్నది పైగా దీప ఆరోగ్యంకూడా సరిగా ఉండటంలేదు ఈ పరిస్థితిలో నీ విక్కడికివస్తే నీకు తగిన విధంగా అతిధి సత్కారం జరగదు కనుక ఈ పర్యాయానికి ఇక్కడికి రావడం వాయిదా వేసుకోవడం మంచిది ఎప్పుడు వస్తే బావుంటుందో, స్వయంగా నేనే మరల రాస్తాను '' - ఇలాగే ఒక చిత్తు ప్రతి తయారు చేసింది

కాని సంజయకు అలా రాయడం సమ్మతం కాలేదు ఎందుకంటే పై విషయాలన్నీ అబద్ధాలు. అందుకే మనస్సు ఒప్పలేదు

* * *

తిండికి వచ్చావా, తీర్థానికి వచ్చావా — అని ఈమెగారు వచ్చి యిక్కడ తిష్ఠవేసుకొని కూర్చున్నది ఈమెకు తోడు — ఆ మురికి బట్టల మూట ఒకటి ! ఎప్పుడు వెడుతుందో ఏమో ? అందమైన ఆ ఇంట్లో ఈమె అటూఇటూ తిరుగుతూ వుంటే — వంటిమీద తేళ్ళూ, జెర్రులూ పాకినట్టుగా వుంటున్నది ఎక్కడబడితే అక్కడ చీరె ఆరవేసుకుంటుంది, తమలపాకులు నమలి ఒకచోట ఉమ్మి వేయదు ఆ సున్నం చేతులు పాలిష్‌చేసిన ఏ దర్వాజాకు అంటిస్తుందో ఏమో ? పైగా — ఈ ఆలోచనలన్నీ సంజయవి కాదు — దీపా ఆలోచనలు

'మరీ పాతకాలపు మనిషి అందులో వితంతువు తిండి విషయంలో లక్ష నిషేధాలు ! రాత్రిపూట పూరీ, పరారాలు కావాలి పైపెచ్చు వ్రతాలు, వుపవాసాలు కూడాను'

ఈ పిన్ని రావడంవలన-తాను ఎటువంటి ఇబ్బందులను ఎదుర్కొనవలసి వుంటుందో, వాటన్నిటిని గురించి ఆమె కూలంకషంగా ఆలోచించుకున్నది తనకోసం ఎంతోమంది స్నేహితురాండ్రు వస్తూవుంటారు ! వాళ్ళ ఎదుటే ఈమె అటూఇటూ తిరుగుతూవుంటే ఎలా వుంటుంది ? ఆ మురికి చీరె, ఆ నల్లటి రూపు ఎంత నామోషీగా వుంటుంది ? రాకూడదని చెప్పలేం కదా ! ఇక పల్లెటూరి పద్ధతిలో ఆ పాతపేరుబెట్టి పిలుస్తుంది — బహూరియా ! బహూరియా అని' ఇంటికొచ్చిన వాళ్ళను గురించి ఆరాలు తీస్తుంది అవతల వాళ్ళకు యిష్టమున్నా లేకపోయినా కబుర్లు చెబుతానంటుంది ఈ ముసలమ్మలతో వున్న చిక్కే యిది '

అసలు ఇంతకూ ఈయనగారు ముందుగానే వుత్తరం రాసి వుంటే ఈ గొడవ లేమీ లేకుండా వుండేవి !

"అవును రాస్తే బాగానే వుండేది ! రాయలేదుగా ? అయిపోయిందేదో అయిపోయింది ఆమె తిండితిప్పల్ని గురించి తెలుసుకొని ఆ ఏర్పాటేదో చూడు !" అన్నాడు సంజయ

దీప మారుమాట్లాడలేదు

అత్తయ్య తనతోపాటు తెచ్చుకున్న ఆ చిన్న బట్టలమూట ఒక మూల పడేసి స్నానానికి వెళ్ళింది

"మీ అత్తయ్యగారికి షర్బత్ తయారు చేయనా ?" అని ప్రశ్నించింది — కొంచెం వెటకారం ప్రతిధ్వనించేలా !

సంజయ ఆమె వెటకారాన్ని అర్థం చేసుకోలేదు

"ఏమో మరి - కొడుకు పరాను లదేశంలో వుంటున్నాడుగా' టీ అలవాటు చేసుకున్న దేమో — అడిగి తెలుసుకో !"

"అన్నీ అడిగి తెలుసుకుంటాలెండి, మీరేమీ బెంగ పెట్టుకోకండి కొడుకు దగ్గర రోజూ పంచభక్ష్య పరమాన్నాలు భోంచేసేదేమో ! వట్టి షర్బత్ యివ్వమంటారా లేక బాదంపప్పు కూడా వేయమంటారా ?''

"ఆమె కొడుకు దగ్గర పంచభక్ష్య పరమాన్నాలే భోంచేసేదో గంజే తాగేదో- అది మన కనవసరం ! మన యింటికి వచ్చినప్పుడు తగిన విధంగా మర్యాద చేయటం మన విధి ! అమల్ ఆమెపట్ల నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నాడని నువ్వంటున్న దే గాని- నేను మాత్రం నమ్మలేను — ఈ పుకార్లను ! వాడు-మనిషి చాలా మంచివాడు !''

"అందుకని మీ పిన్నిగారిని నెత్తిమీది

రాష్ట్రపతి 20-7-63 తేదీన హైదరాబాదు విచ్చేసినపుడు స్వాగతం యిస్తున్న ఆంధ్రప్రదేశ్ గవర్నరు.



*అర్టిలరీ కేంద్రం :* దక్షిణ ప్రాంతపు జనరల్ ఆఫీసర్ కమాండింగ్ ఇన్ ఛీఫ్ లెఫ్టినెంట్ జనరల్ ఎల్. పి. సేన్ గోల్కొండ వద్ద కొత్తగా నెలకొల్పిన ఆర్టిలరీ కేంద్రంలో 1963 జూన్ 27 వ తేదీన తొలి పరేడును తిలకించారు.



పాతాళగంగ : ప్రధానమంత్రి శ్రీశైలం ప్రాజెక్టు స్థలాన్ని తిలకిస్తున్న దృశ్యం.



హైదరాబాదులో 27-7-63 వ తేదీన బ్రహ్మాండమైన బహిరంగసభలో ప్రసంగిస్తున్న ప్రధానమంత్రి నెహ్రూ.



సమాజాభివృద్ధి, పంచాయతీరాజ్, సహకార శాఖల కేంద్ర మంత్రి శ్రీ ఎస్. కె. దే, 1963 జూన్ 22 వ తేదీన హైద్రాబాదులో

ప్రధానమంత్రి 26_7_63 వ తేదీన తాను ప్రారంభోత్సవంచేసిన పోచంపాడు ప్రాజెక్టు నమూనాను పరిశీలిస్తున్న దృశ్యం.



మెదకుజిల్లా పటంచెర్వు తాలూకా చిట్కుల్ గ్రామంలో 14 వ వనమహోత్సవాన్ని జరిపారు. ఆ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ అటవీశాఖ మంత్రి మొక్కను నాటినప్పటి చిత్రం.




24-7-63 తేదీన శ్రీశైలం ప్రాజెక్టుకు జ్యోతిని వెలిగించడంద్వారా ప్రారంభోత్సవం చేస్తున్న ప్రధాన మంత్రి.



*రక్షణ నిధికి లక్షరూపాయల విరాళం :* ఆంధ్రప్రదేశ్ పౌర రక్షణ కమిటీవారు నిర్వహించిన తెలుగు

కెక్కించుకుంటా నంటారు అలాగే చేయండి ఎందుకైనా మంచిది — మీకు నేను ముందే చెబుతున్నాను - ఆమె యిక్కడ శాశ్వతంగా ఉండిపోవడానికి వచ్చింది! మీరు కొంచెం ముభావంగా ఉండండి ఒక్క రోజు జరిగితే కాదు - ఆమె ఎంతకాలం ఉంటే అంతకాలం జరపాలి! ఖర్చు ఎంత పెరిగిపోతుందో కాస్త ఆలోచించుకోండి!"

"ఇందులో నే నాలోచించవలసిందేమీ లేదు! అంతా నీ యిష్టం!" అని సంజయ బయటికి వెళ్ళిపోయాడు

దీపాకు వ్యావహారిక జ్ఞానం మెండు ముందు వెనకలు ఆలోచిస్తుంది అందుకే కొంచెం ముభావంగా వుండమంటుంది — భర్తను '

* * *

స్నానం చేసి పిన్ని బూందీలడ్డు తిని, టీ తాగింది కాళ్ళు చాపుకొని తీరికగా కూర్చొని కబుర్లు ప్రారంభించింది

"అమ్మాయి బహూరియా! నీకు పెళ్ళికి ఎదిగిన చెల్లె లుండాలి కదూ?"

ఈ ప్రశ్న ఎందుకు వేసిందో దీపాకు తెలియకపోవడంవల్ల ఏదో యధాలాపంగా 'అవును' అని సమాధానం చెప్పి "ఎందుకు?'' అని ప్రశ్నించింది

"ఆఁ ఏమీలేదు!" విధూపిన్ని నవ్వుతూ అన్నది-"ఇంకా పెళ్ళి చేయలేదన్నమాట!"

"ఉహుఁ లేదు!''

"చూడ్డానికి పిల్ల బావుంటుందా?"

"బాగానే వుంటుంది' నాకంటే కొంచెం చాయగాకూడా వుంటుంది అవునుగానీ పిన్నీ' ఏమిటిలా అడుగుతున్నావు?"

పిన్ని నవ్వింది

"ఏముందమ్మా! మావాడి పెళ్ళి దిగులు పట్టుకుంది నాకు' ఎలాగైనా వాణ్ణి ఒక యింటివాణ్ణి చెయ్యాలి నా బలవంతంమీద ఈసారి పెళ్ళికి ఒవ్పుకున్నాడు. ఆ పక్షాన్నుంచి దేశంలో మన బెంగాలీ పిల్లలు దొరుకుతారా? ఇక్కడేదో సంబంధం వున్నదంటే వచ్చాను ఆ పిల్ల అక్క, బావ అక్కడే వుంటున్నారు ఏదో వుద్యోగం! ఆ పిల్లను చూసి వెడదామని వచ్చాను పిల్లను చూసి నట్టూ వుంటుంది. చుట్టాల నందర్నీ ఒక సారి తిరగేసినట్టూ అవుతుందని చక్కా బయలుదేరి వచ్చా ఆ పిల్ల అక్క, బావ వాళ్ళు పిల్ల తండ్రికి వుత్తరం రాశారు — పిల్లను చూసుకొనడానికి వస్తున్నారని! ఆ పిల్లను చూసే ముందు ఒక్కసారి మీ చెల్లెల్ని కూడా చూడాలని వుంది ఏమంటావు?"

దీపాకు ఈ విషయాలన్నీ వినేప్పటికి ఎంతో ఆశ్చర్యం వేసింది 'ఈ పిన్ని ఎంత తెలివితక్కువ పెద్దమ్మ' అని కూడా లోలోప లనుకున్నది లేకపోతే ఏమిటీ కబుర్లు? తన చెల్లెల్ని చూస్తుందా? నక్క ఎక్కడ నాగలోకమెక్కడ? వియ్యానికైనా, కయ్యానికైనా తాహతు అనేది వుండాలా అక్కర్లేదా? మనస్సులోని భావాన్ని బయటికి పొక్కనివ్వకుండా - "ఆయినవాళ్ళతో సంబంధం ఏం బావుంటుంది పిన్నీ!" అని నవ్వుతూ అన్నది

"ఏం ఎందుకు బావుండదు? దూరపు కొండలు నునుపేగాని — దగ్గరికి వెడితే అన్నీ రాళ్ళూ రప్పలేగా' అయినా పిల్లను చూసుకోవడంలో తప్పేముంది?"

"తప్పేమీ లేదనుకో' ఇంతకూ నేను అడగటం మరచేపోయాను — మా మరది అమల్ ఏం ప్యాసయ్యాడు?"

"అదేదో ప్యాసయ్యాడమ్మా! దానిపేరు నాకువచ్చి చస్తుందా పాడా' బిడ్డ ఇంకా పైచదువులు చదవాలనుకున్నాడు, కాని డబ్బులేక మానుకున్నాడుగా! వాడి వయస్సులో వున్నవాళ్ళంతా పై చదువులు చదువుకున్నారాయె, వాడేమో — అలాగే వుండిపోయే! అందుకే — మనప్రాంతం వదిలేసి ..ప్రాంతంగాని ప్రాంతానికి .. "

దీపాకు ఆమె చెప్పేమాటలు వినడం దుస్సహమనిపించింది

"ఇదిగో పిన్నీ! మా చెల్లినిచూడడం అనవసరం ఆమె ఎం ఏ ప్యాసైంది ఆమెకు మంచి హోదాలోవున్న వాళ్ళుతప్ప మరొకరెవరూ నచ్చరు మా చెల్లి విషయం వదిలేసి — ఎవరినో చూడాలని వచ్చావుగా, ఆమెను చూడడమే మంచిది!"

ఆమె వాదస్తం ఆమెదేగాని మరొకరు చెబితే వినిపించుకోదు వాదస్తానికితోడు అజ్ఞానంకూడా! మెట్రిక్ చదివిన తన కొడుక్కి ఎం ఏ చదివిన తన చెల్లెల్ని కట్టబెట్టటమా?

"ఆఁ అవునమ్మా! నేను చూడడానికి వచ్చానే — ఆ పిల్లకూడా చాలా పెద్ద పెద్ద పరీక్షలు ప్యాసైందట?" ఆమె అజ్ఞానానికి యిది ఆఖరిమెట్టు!

దీపా ఏమీ మాట్లాడలేదు ఈ విడ్డూరాన్ని గురించి భర్తకు చెబుదామని పడుతూ లేస్తూ వెళ్ళింది

* * *

"రాత్రికి ఏం చేయించమంటావు పిన్నీ?" — దీపా అడిగింది "పాలూ పళ్ళూ తీసుకొంటావా లేక పూరీలు చేయ మంటావా?"

"ఇదుగో అమ్మాయ్! నిన్ను శ్రమ పెట్టడం నాకేమాత్రం యిష్టంలేదు' నీ యిష్టంవచ్చింది చేసిపెట్టు, తింటాను!"

"ఇందులో శ్రమ ఏముంది' రెండు రకాలవంటలు తయారు చేయవలసి వచ్చిందీ అంటే-వంటలక్క శలవు తీసుకుంటుంది"

"నాకు వంటచేయవలసిన అవసరమేమీ

లేదు! ఒకగ్లాసు పాలు యిచ్చావంటే [illegible] అని మధ్యలోనే అందుకుని చెప్పింది విధూపిన్ని!

విధూపిన్నికి అన్ని సదుపాయాలు చేసి వేళానని దీపవెళ్ళి సంజయకు చెప్పింది.

పిన్ని మళ్ళా ఆ రెండో రోజు పిల్ల ప్రస్తావన తెచ్చింది "అమ్మాయీ, పిల్లను చూడడానికి నువ్వుకూడా రాకూడదూ?" అని అడిగింది.

ఎంతకూట! ఈ తెలివితక్కువ మనిషిని ఎన్నిసార్లని క్షమించడం? "నాకు వీరు గిళ్ళకువెళ్ళడం సుతరాము గిట్టదు పిన్నీ!' అని దీపా ఖచ్చితంగా చెప్పింది.

"సరే నీయిష్టం!...నేనూ, సంజీ కలిసి వెడతాం నేనిచ్చిన ఎడ్రసు వాకబు చేసి వచ్చాడట! వాళ్ళయిల్లు పెద్ద రాజభవనం లాగా వున్నదట!"

దీపా భర్తదగ్గరకెళ్ళి — వ్యంగ్యంగా నవ్వుతూ—"ఏమండీ! మీ అమల్‌కు పిల్లను చూడడానికి ఏదో రాజభవనానికి వెడుతున్నా రటగా? నిజమేనా?" అని ప్రశ్నించింది

సంజయ తలవూపి అవునని సమాధానం చెప్పాడు "అత్తయ్య యిచ్చిన అడ్రసు ప్రకారం వెళ్ళాను. విశాలమైన భవనం ఆయన పేరుగాంచిన వకీలు! అయితే పిల్ల ఆయన కేమవుతుందో తెలియ లేదు. అత్తయ్య నడిగితే ఏమో నన్నది"

"పిల్లను చూడడానికి నన్ను కూడా రమ్మన్నది"

"వస్తే బాగానే వుంటుంది!"

"ఏమన్నారు?" దీపా ఉలిక్కిపడింది— "ఈమె కొడుక్కి చేసుకోబోయే పిల్లను చూడడానికి నేను రావాలా? ఆ వకీలుగారి వంటవాడి కూతురై వుంటుంది! లేదా ఏ డ్రైవరు కూతురో అయివుంటుంది!"

"ఏమో! నాకు తెలియదు!"

"ఈమె కొడుకు తాహతుకు అంతకంటే [illegible] మాత్రం రాదు!"

సంజయ భార్యమాటా శమ్మని ఖం డనం చెయ్యనేలేదు. ఆయన అక్కడే మేనత్తను వెంటబెట్టుకొని ఆ వకీలుగా రింటికి వెళ్ళారు

కొంత సేపటికి వాళ్ళిద్దరూ వెళ్ళినపని ముగించుకొని తిరిగి వచ్చారు. పిన్ని మొహం మీద చిరునవ్వు తాండవిస్తున్నది సంజయ మాత్రం అంత వుత్సాహంగా కన్పించలేదు.

"ఏమమ్మోయ్ బహూరియా! పిల్లను చూసివచ్చాం. కుందనపు బొమ్మలాగా వున్న దంటే నమ్ము! పాటకూడా పాడి విన్పిం చింది మంచి గౌరవనీయమైన కుటుంబం! గర్వంలేని మనుషులు!" అని మొహం ఇంత జేసుకొని చెప్పింది!

"గర్వపడవలసినంత ధనవంతులా ఏమిటి?" అని దీపా ప్రశ్నించింది.

విధూపిన్ని మొహం మరింత వికసిం చింది సంజయ వైపు చూస్తూ—ధనవంతు లవునో కాదో—సంజీ నడిగి తెలుసుకో!... ఇల్లు మాత్రం చాలా విశాలంగా, అందంగా వున్నది గేటుదగ్గర దర్వాను కూడా వున్నాడు ఇంటిముందు రెండు కార్లున్నాయి" అని అన్నది. ఉప్పొంగి పోతూ!

దీపా కళ్ళను, కనుబొమ్మల్ని అదో రకంగా తిప్పి—భర్తవైపు చూసి 'ఎవరి పిల్ల?' అని అడిగింది

"వకీలుగారి అమ్మాయే!" అతి గంభీ రంగా సమాధానం చెప్పాడు సంజయ!

ఈసారి దీప కనుబొమ్మల్ని బాగా చిట్లించి మరీ అడిగింది

"నిజంగానా?"

"నిజమే!"

"ఇందులో ఏదో గూడుపురాణీ వుండి [illegible]!'

"ఏమీ లేదు! పిల్ల బి. ఏ. ప్యాసైంది. ఎం. ఏ. చదువుతున్నది!"

"నిజంగానా?"

"నిజమే! అంతా డబ్బులోనే వుంది. చేతిలో నాలుగు చిలకలుంటే కొండమీది కోతి కూడా కిందికి దిగి వస్తుంది.

విధూపిన్నికి యివేవీ పట్టలేదు! ఇంకా ఆమె తన తన్మయత్వంలో తాను వున్నది!

"పిల్ల నచ్చిన నాకు నచ్చింది అంటే — సంబంధం ఖాయం చేసుకొని వస్తానని అమల్‌తో చెప్పి వచ్చాను అమ్మాయ్! నువ్వూ, బహూరియా — ఇద్దరూ రావాలి — పిల్లకు నగలు కొనటానికి! అమ్మాయ్! నువ్వు రానంటే నేను వూరుకోను తెలిసిందా? ముసలిదానికి నాకేం తెలుసు! మీరే కొనిపెట్టాలి"

సంతోషంతో మెరుస్తున్న ఆమె మొహం వైపు కొంచెం ఏవగింపుగా చూస్తూ — దీప — 'మరి నగలు కొనడానికి డబ్బేమైనా పట్టు కొచ్చారా?' అని అడిగింది!

"తెచ్చానమ్మా! తెచ్చాను! నాలుగువేల రూపాయలూ, కొంత చిల్లరా తెచ్చాను అమల్ నన్ను ఫష్టుక్లాసులో పంపిస్తా నన్నాడు! అంత కోరికగావుంటే ఫస్ట క్లాసుల్లో, సెకండు క్లాసుల్లో నువ్వు ప్రయా ణం చెయ్యి! నేను మాత్రం థర్డు క్లాసులోనే వెడతానని చెప్పి చక్కావచ్చాను.. న సంగతి సంజయకు బాగా తెలుసు! ఏదో నాలుగు డబ్బులున్నాయని ఎగిరెగిరి పడ తారా? కలకత్తాలో మూడు రోజులకంటే ఎక్కువ వుండవద్దని అమల్ చెప్పాడు. వాడొక్కడే వుండలేడట! తెలిసిందా బహూరియా! వాడికి ఆ రెండు ముక్కా పడితేగాని నాకు మనశ్శాంతి వుండదు"

ఆ తరువాత?

ఆతరువాత అసంభవమైన సంఘటనలు కొన్ని జరిగిపోయాయి.

"మూడు రోజులా? ఇంత దూరం వచ్చి మూడు రోజుల్లో తిరిగి వెళ్ళడానికి వీల్లేదు పిన్నీ! ..పైగా నా చెల్లెల్ని చూపించమన్నావుగా! ఆమెను చూపించకుండా నిన్ను వెళ్ళనివ్వను అని అన్నది దీపా ప్రేమను ఒలకబోస్తూ!

"ఎవరినీ..మీ చెల్లెలినా? ఆమె ఏవేవో పెద్దపెద్ద పరీక్షలు ప్యాసైందన్నావు! పెద్ద హోదాలో వున్న భర్తను కోరుకుంటున్నదని చెప్పావుగా?..."

"ఆఁ ఏదో అన్నాననుకో! ఈరోజుల్లో పెళ్ళికావలసిన పిల్లల ఆకాంక్షలు అంబరాలను అందుకుంటూ వుంటాయి! వాళ్ళు అనుకున్నవన్నీ జరుగుతాయా?"

తెలివితేటలనేవి నాకే తెలుసుననుకో కూడదు ఎదుటి వాళ్ళకుకూడా కొంత తెలుసుననుకోవాలి. విధూపిన్ని తన [illegible] జ్ఞానాన్ని బహిర్గతం చేసుకున్నది.

"అమ్మాయీ! ఇప్పుడిక మరెవరినీ చూసే ప్రశ్నేలేదు. అక్కడ మాట యిచ్చేశాను. నిన్ననే అన్నీ మాట్లాడుకొని ఆ సంబంధం ఖాయం చేసుకున్నాం"

"నిన్ననే ఖాయం చేసుకున్నారా?"

"అవునమ్మా! రేపు సాయంత్రం బండికి తిరిగి వతన్‌కోట వెళ్ళిపోతాను

"నిజంగానా?" అని దీపా అడిగింది, భర్తవైపు తిరిగి!

'అవును!' అన్నాడు భర్త ముక్తసరిగా!

ఆ రెండవరోజు విధూపిన్ని వెళ్ళిపోయింది ఆమెను పంపించడానికి భార్యభర్తలిద్దరూ స్టేషన్‌కు వెళ్ళారు. [illegible] వెళ్ళబోయేప్పుడు పిన్ని — "ఈ రెండు రోజులు ఎంత కులాసాగా గడిచిపోయాయి. మిమ్ము చాలా శ్రమపెట్టాను పెళ్ళికి మీ యిద్దరూ తప్పకుండా రావాలి. రాకపోతే ఊరుకునేదిలేదు ముహూర్తం నిర్ణయించిన తరువాత ఖర్చులు మనియార్డరు చేయిస్తాను. రానంటే ఏమాత్రం కుదరదు! శుభకార్యాలు మాటిమాటికి వస్తాయా?" అని అంటూ ఆమె తన చెంగుచాటునుంచి ఏదో ఒక వస్తువును బయటికి తీసి —

"అమ్మాయ్! నిన్నటినుంచి చెబుదామనుకున్నానే కాని — ధైర్యం చాలలేదు. నువ్వేమైనా అనుకుంటావేమోనని భయపడ్డా. నిన్న సంబంధం ఖాయం చేసుకునేప్పుడు వధువుకి పెట్టవలసిన నగలు కొంటూవుంటే ఈ వస్తువు నాకెంతో నచ్చింది నీకోసం కొన్నాను. వద్దనడానికి వీల్లేదు పుచ్చుకోనవలసిందే!" అని అంటూ పిన్ని నాల్గుపేటల బంగారు హారాన్ని దీపా మెడలో వేసింది

"ఇదేమిటి పిన్నీ? ఎందుకింత కిమ్మత్తుగల హారం నాకు?"

"నువ్వు కాదనడానికి వీల్లేదు నేను నీకు ముందే చెప్పాను" అని అంటూ ఆమె సజలనయనాలతో యిలా అన్నది

'నీ పెళ్ళినాడు నేను నీ కేమీ యివ్వలేకపోయాను ఒక ఇత్తడి కుంకుమభరిణె మాత్రం యివ్వగలిగాను ఆనాడు నా తాహతు అది! నీ పసుపు కుంకుమ శాశ్వతంగా వుండాలి తల్లీ! ప్రేమతో యిస్తున్నాను. దీన్ని కాదనకు!"

రైలు కదిలి వెళ్ళిపోయింది.

దీపాకు సంజయమీద పట్టరాని కోపం వచ్చింది.

"ఈ సంబంధం మా చెల్లికి మాట్లాడవలసింది! మీరు మాటమాత్రంగా అని వుంటే విధూపిన్ని ఒప్పుకొని వుండేదే! మీ చేతులారా చెడగొట్టారు!"

సంజయ భార్యవైపు ఒకసారి తలెత్తి చూశాడు.

ప్లాటుఫారం దాటి బయటికి వచ్చారు

"అసలీకు మనం ఏదైనా బహుమతి యివ్వవద్దూ పెళ్ళిరోజున?" దీప ప్రశ్నించింది.

సంజయ ఈసారికూడా భార్యవైపు ఒకసారి తలెత్తి చూశాడు.

"మాటా పలుకూ లేకుండా, ఎందుకు మీరలా నావైపు చూస్తున్నారు?" దీపాకు కోపం వచ్చింది. "నేనేదో దొంగతనం చేసినట్టు ఏమిటా చూపులు?...... అసలు తప్పంతా అమ్మదే! చిన్న మురికి బట్టల మూట ఒకటి చంకన బెట్టుకొని వచ్చింది — అతి మామూలు మనిషిలాగా! కొంచెం ఘనంగా వచ్చివుంటే నేనలా దురభిప్రాయపడివుండేదాన్ని కాదు!"

సంజయ ముందు నడుస్తున్నాడు అతని వెనుక దీపా కోపంతో రుసరుసలాడుకుంటూ బుసలుకొట్టుకుంటూ ఎవరినో ఆక్రోశించుకుంటూ నడుస్తున్నది!

ఆ ఆక్రోశం సంజయమీదనా?

లేక తనమీదనా?

ఏమో!



# ప్రగతి పథంలో

ఆదిలాబాదు జిల్లా

*పనిముట్ల తయారీ*

ఆదిలాబాదు జిల్లా పరిషత్తువారు 1963 జూన్ 27 వ తేదీన సమావేశమైనప్పుడు పనిముట్లు మున్నగు వాటిని తయారు చేసే నిమిత్తం వ్యవసాయ-పారిశ్రామిక సంస్థను నేలకొల్పేందుకై మథోల్, లక్సెట్టిపేటల మధ్య నివేశన స్థలాన్ని ఎన్నిక చేసే విషయంలో సాంకేతిక నిపుణుల అభిప్రాయాన్ని తెలుసుకోవడానికి నిశ్చయించారు ఆదిలాబాదులోని పరిశ్రమలు, వాణిజ్యశాఖ అసిస్టెంట్ డైరెక్టరు సాంకేతిక నివేదికను సమర్పిస్తారు

అనంతపురం జిల్లా

*గ్రామీణ చికిత్సశాల*

మండలపల్లి గ్రామంలో రూ 4,000ల వ్యయంతో శ్రమదానంద్వారా నిర్మించినగ్రామీణ చికిత్సశాలకు జూన్ 5 వ తేదీన ప్రారంభోత్సవం జరిగింది

చిత్తూరు జిల్లా

*బావుల మంజూరీ*

1963 జూన్ లో 20 బావుల త్రవ్వకాలకై 20 మందికి సబ్సిడీలు మంజూరయ్యాయి సేద్యపునీటివనరులను పెంపొందించుకోవడానికీ, భూములను అభివృద్ధిపరచి సేద్యయోగ్యం చేసుకోడానికీ రూ 25,000 లను మంజూరు చేయడంకూడా జరిగింది

తూర్పుగోదావరి జిల్లా

*వంతెనకు ప్రారంభోత్సవం*

కొత్తపేట పంచాయతీసమితి రావుల పాలెంలో రూ 25,000 ల ఖర్చుతో నిర్మించిన ఫుట్‌పాత్ వంతెనను, ప్రణాళిక, పంచాయతీరాజ్ శాఖల మంత్రి జూన్ 26 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు

*ఎరువుల పంపిణీ*

పెద్దాపురం పంచాయతీసమితి ప్రాంతంలో 1963 జూన్ లో 1064 మణుగుల మేలు జాతి వరివిత్తనాలను, 577 టన్నుల రసాయనిక ఎరువులను, 17 మణుగుల పచ్చిఎరువులను పంపిణీచేశారు 24 ఎకరాల విస్తీర్ణంలో జపానుపద్ధతిలో వరిసేద్యంచేశారు

గుంటూరు జిల్లా

*సవరించిన సాంద్రవ్యవసాయకార్యక్రమం*

ఈమని, దుగ్గిరాల, మొరంపూడి, పెదకలపూడి, పెదపాలెం గ్రామాలలో, సవరించిన సాంద్ర వ్యవసాయ కార్యక్రమాన్ని అమలుపరుస్తున్నారు ఈమని బ్లాకులో, గ్రామీణ జనాభాలో నూటికి పదివంతుల మంది గ్రామీణ స్వచ్ఛంద సేవకదళాలలో చేరారు రక్షణ శ్రామిక బ్యాంకులలో 50 శాతం జనాభాను చేర్పించడానికి కృషి జరుగుతున్నది

కరీంనగర్ జిల్లా

*గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం*

కోరట్ల పంచాయతీ సమితిలోని మన్నెగూడెం గ్రామంలో జూన్ 6 వ తేదీనసమితి అధ్యక్షుడు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు మన్నగూడెం, కల్వకోట, దమ్మన్నపేట గ్రామాలకు చెందిన 50 మందికి శిక్షణ ఇచ్చారు

*వనమహోత్సవం*

జూలై 6 వ తేదీన కరీంనగర్‌లో వనమహోత్సవాన్ని జరిపారు ఆ సందర్భంలో జిల్లా పరిషత్తు భవన నిర్మాణానికి ఉద్దేశించిన స్థలంలో ఫలవృక్షాలను, ఇతరరకాల మొక్కలను నాటారు. జిల్లా పరిషత్తు అధ్యక్షులు ఉత్సవాన్ని ప్రారంభించారు

*శ్రమదానం*

గూడూరు పంచాయతీ సమితిలో, గ్రామీణ స్వచ్ఛంద సేవక దళానికి చెందిన 1054 మంది స్వచ్ఛంద సేవకులు, వారం రోజులపాటు శ్రమదానంచేసి చెరువులు, కాలువలు మొదలైనవాటిని మరమ్మతు చేశారు భూములను సేద్యయోగ్యం చేసే పనులనుకూడా వారు చేపట్టారు ఈ పనుల విలువ సుమారు రూ 11067లు వుంటుంది

ఖమ్మం జిల్లా

*శిక్షణ శిబిరం.*

ఖమ్మం జిల్లా సమాచార కేంద్రంలో జూలై 3 వ తేదీన స్థానిక కళాశాల సాంఘిక సేవా మండలి సభ్యులకొరకు ఒక రోజు శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు

కృష్ణా జిల్లా

*రైతుల ఉత్సాహం*

కేతనకుండ గ్రామంలో జూలై 28 వ తేదీనుంచి మూడు రోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరాన్ని నిర్వహించి వ్యవసాయ విషయాలలో శిక్షణ ఇచ్చారు జూపూడి, ములపాడు, కొటికలపూడి, చిలుకూరు, దములూరు గ్రామాలకు చెందిన 50 మంది పురోగాములైన రైతులు శిక్షణ శిబిరానికి హాజరయ్యారు

కర్నూలు జిల్లా

*రోడ్డు నిర్మాణం*

నిడ్జూరు గ్రామంలో పంచాయతీ సమితి వారు జరిపిన శ్రమదానం ఫలితంగా ఒక మైలు

పొడవుగల రోడ్డు నిర్మాణం పూర్తయింది. ఈ పని విలువ సుమారు రూ. 2,000లు వుంటుంది. గ్రామీణ స్వచ్ఛంద సేవక దళానికి చెందిన 266 మంది స్వచ్ఛంద సేవకులు శ్రమదానంలో పాల్గొన్నారు. జూన్ 6 వ తేదీన జిల్లా కలెక్టరు ఈ శ్రమదానోద్యమానికి ప్రారంభోత్సవం జరిపారు.

మహబూబ్‌నగర్ జిల్లా

*స్వచ్ఛంద సేవకురాండ్రు:*

ధన్వాడకుచెందిన సుమారు 400 మంది స్త్రీలు, మహిళామండలి అధ్యక్షురాలు శ్రీమతి సుమిత్రాదేవి నాయకత్వాన స్వచ్ఛంద సేవకురాండ్ర దళాన్ని స్థాపించుకొని ధన్వాడలో బస్సుస్టాండును నిర్మించారు. ఈ పనివిలువ దాదాపు రూ. 700 వుంటుంది.

మెదక్ జిల్లా

*ప్రాథమిక ఆరోగ్యకేంద్రం:*

ఎద్దుమైలారంగ్రామంలో స్థాపించిన మెదక్ పంచాయతీ సమితిబ్లాకు ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి జిల్లాకలెక్టరు జూన్ 25 వ తేదీన పారంభోత్సవం చేశారు.

నల్గొండ జిల్లా

*గ్రామసహాయకుల శిక్షణ శిబిరం:*

ఆలేరు పంచాయతీ సమితి మసీపేటలో జూన్‌నెలలో 3 రోజులపాటు గ్రామసహాయకుల శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు. ఈ శిబిరంలో వివిధ పంచాయితీలకు చెందిన 45 మంది గ్రామసహాయకులు శిక్షణ పొందారు. బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు.

*పంచాయత్ ఘర్:*

కోదాడ పంచాయతీ సమితిలోని దొరకుంటగ్రామంలో స్థానిక ప్రజలు రూ.5,000ల వ్యయంతో పంచాయతీ ఘర్‌ను నిర్మించారు. జూన్ రెండవవారంలో ప్రణాళిక, పంచాయతీ రాజ్‌శాఖలమంత్రి దీనికి ప్రారంభోత్సవంచేశారు.

కోదాడు పంచాయతీ సమితి ప్రాంతంలో రూ. 6,000/- ల వ్యయంతో నిర్మించిన శ్రీరంగాపురం రోడ్డుకుకూడా ప్రణాళికా మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

నెల్లూరు జిల్లా

కొండపి పంచాయతీ సమితిలోని చోడవరంలో గ్రామసహాయకుల శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు. 50 మంది గ్రామసహాయకులు ఈ శిబిరంలో శిక్షణ పొందారు.

నిజామాబాదు జిల్లా

*ఎరువుల పంపిణీ:*

నరీపేట పంచాయతీ సమితి బ్లాకులోని వ్యవసాయదార్లకు 1962-63 వ సంవత్సరంలో, రూ. 50,000 లు ఖరీదుచేసే 2,710 మణుగుల మేలుజాతి విత్తనాలను, 68,462 మణుగుల ఎరువులను పంపిణీచేశారు. 173 ఆధునిక వ్యవసాయ పనిముట్లను కూడా పంచారు. 13210 ఎకరాల విస్తీర్ణంలో జపాను పద్ధతిలో వరిసేద్యం చేశారు.

శ్రీకాకుళం జిల్లా

*సమితి ప్రారంభోత్సవం:*

చింతాడ మొదటిదశ పంచాయతీ సమితికి జూన్ 16 వ తేదీన విద్యామంత్రి ప్రారంభోత్సవం చేశారు. ఇది బొబ్బిలికి 8 మైళ్ళ దూరంలో వుంది.

వరంగల్ జిల్లా

*మడికొండ సమితి:*

మడికొండ పంచాయతీ సమితికి రెవెన్యూ మంత్రి జూన్ 6 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. కలెక్టరు ఉత్సవ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు.

*ప్రజోత్సాహం:*

ములుగు పంచాయతీ సమితి గ్రామాలన్నింటిలోనూ జూన్ 8 వ తేదీనుంచి వారంరోజులపాటు "శ్రమదాన" సప్తాహం జరిపారు. గ్రామీణ స్వచ్ఛంద సేవక దళం, రక్షణ శ్రామిక బ్యాంకులవారు ప్రజల సహకారంతో ఉత్పత్తి, ఆరోగ్యం, పారిశుద్ధ్యం, రవాణాసౌకర్యాల అభివృద్ధి పనులను చేపట్టారు. ఇప్పటివరకు సుమారు రూ. 445/- లు విలువచేసే పనులు అమలు జరిగాయి.

*గ్రా. స్వ. సే. దళంవల్ల ఇతోధిక ఉత్సాహం:*

శ్యాంపేట సర్కిలులోని తహర్‌పూర్ గ్రామంలోనూ, నర్లపూర్ సర్కిలులోని చర్లపల్లి గ్రామంలోనూ రెండు ఓరియంటేషన్ శిక్షణా శిబిరాను నిర్వహించారు. జనబాహుళ్యానికి విద్య గరపడం, అధికాహారోత్పత్తిని సాధించడం మొదలైన విషయాలలో శిక్షణ ఇచ్చారు. ఇప్పటివరకు 1,995 మంది గ్రామీణ స్వచ్ఛంద సేవక దళంలోనూ, రక్షణశ్రామిక బ్యాంకులలోనూ చేరారు.



# మదినమ్ము రత్నాలు

[30 సంవత్సరాల క్రిందట (1933 లో) కీర్తిశేషులైన శ్రీ బలిజపల్లి చిన రామమూర్తి కవిగారు 3583 పద్యాలతో శివాజీ చారిత్రము ఉదాత్తకవనస్ఫూర్త కావ్యంగా రచించారు. ఆ కాలంలో విజయనగరంలో సన్మానం పొంది "కవితా వినోద" బిరుదంతో గౌరవింపబడ్డారు. వీరిది విశాఖ జిల్లా విజయనగరం తాలూకా కనిమిగ్రామం. ఆ గ్రామానికి కరణంకూడా శుశ్రూష చేయకుండానే దివ్యమత్కారమైన కవితాపాటవాన్ని అద్భుత పాండిత్యాన్ని సంపాదించారు. బంధ కవితా నిర్మాణంలో కూడా వీరు సిద్ధహస్తులు. ఈ కృతికర్త ప్రస్తుతం ఎ. పి. సి. పి. ప్రధానకార్యదర్శి అయిన శ్రీ పెమ్మరాజు వెంకట్రావుగారికి పినతండ్రి. ఈ వ్రాతప్రతి ప్రస్తుతం శ్రీ వెంకట్రావుగారి వద్దనే ఉన్నది. 20 వ శతాబ్దపు ఆంధ్ర కవితామాతకు మణికిరీటంవంటి యీ అముద్రిత ఉత్తమ కావ్యంనుంచి "శివాజీ అఫ్జల్ ఖాను"ను వధించిన ఘట్టంలోని పద్యాలను ఇక్కడ ప్రచురిస్తున్నాము.]

ఖానుని పొందునొందగల
ఘస్రము నయ్యది యాటవేకువన్
స్నానముఁజేసి సన్నుత
నాకినుఁడై ద్విజకోటికెక్కుడా
దానములిచ్చి భక్తిఁదన
తల్లి పదంబుల వ్రాలి యంబ! నా
పూనిన కార్యముంజయముఁ
బొందగ దీవనలీయుమీ యనన్॥

పాదాబ్జంబుల వ్రాలు
నాత్మజునకున్పబ్లీవన ల్నించిన
మ్మోదంబంది శరీరము
న్నిమిరి యిమ్మూర్ఖుండవౌ పాపిదు
ర్మ్మదుండై భవదగ్రజున్నికృతి
సంగ్రామంబులోఁ జంపెనా
డాదిన్వీడు నశింప నీశ్వరిని
నత్యంతంబు సేవించితిన్॥

బలహీనుఁడయ్యెనిపు డీ
కలుషాత్ముఁడు వీనిఁదొడరిఖండింపంగా
దలపెట్టిన నీకాయుమ
యలఘుబలం బొసఁగుగాక నా యమ
మఱియున్॥

సాధు గోహంతకు సమయింప
నూహించు
నృపతిరక్షించు సర్వేశ్వరుండు
పరకాంతలను బల్మి బట్టుపాపినణంచు
ధరణీశు మదినిల్పు ధైర్యలక్ష్మి
సత్యంబు దూఱుదుర్జను నేచనరిగెడి
ప్రభువుతో గలయు ధర్మంబుమూర్తి
ప్రజలదోపిడివెట్టు వృజనాత్ముదండింపు
జననాథుఁ బురికొల్పు సాహసంబు
సకలజన కంటకుని ద్రుంప జనినతేని

> కీర్తిశేషులు
> శ్రీ బలిజపల్లి చినరామమూర్తి కవి
> అముద్రిత కృతి
> "శివాజీ చరిత్ర" నుంచి

కాయు రారోగ్య మొసఁగు
దివ్యావతారుఁ
డనుచు దీవింప పుల
కాంకితాత్ముఁడగుచు
నృపతి ఖానుని దరికేగ నిశ్చయించె॥

కఱుకు కత్తుల నొండొరునఱికికొనుచు
పోరుటకుఁగాని నా మెత బుత్తిఁగామి
దెలియు చాయమ కొడుకును
కలనకంపె
మహితసత్కీర్తి ధ్యాపీరమాతయాట॥

జనని రొయిసంగిన దీవన
గొనియాతఁడు భానుదెస
కకుంఠితమతియై
జననెంచి మొదటనుండియు
చెనటులు యావనులటంచు చెచ్చెరఁ
జనుచున్॥

పృధ్వీ మహారాజు పెనగులాటలనోడి
ఘోరి యొనర్చిన క్రూరవృత్తి
భీమసింగమ్ముదోర్వీర్యంబునకు నోడి
యల్లాయుదీన్జేయు నధమచర్య
రాయచూరున కృష్ణరాయ
లాజికనోడి
యేదులఖాన్జేయు హీనచర్య
లళియరామమహీశు నవనంబునందుండి
యిభరామొనర్చిన వృజినవృత్తి
మఱియు జయపాలుడాదియౌ
మనుజవరుల
చెలిమిఁగావించి యవనులు జేయుచేటు
లఫజులాఖానుతోసంధి కరుగు నప్పు
డాత్మకును దట్టి శివమహీశాధిపతియ॥

మా యోపాయము లెన్ని యో
గఱచి మున్మల్కాశిదన్జిక్కుల
న్దోఁయంగా సమకట్ట తప్పిన

యసాధ్యుండౌటచే నమ్మహా
రాయుండాయస లోహకంకట
శిరస్త్రాణంబులందాల్చి కౌ
క్షేయంబున్ ఛురికంబులోఁ
గలుగు నంగీపాగలం బెట్టుచున్ ॥
ద్వీపినఖాకృతిందనరు తీక్ష్ణ
నఖంబులు వ్రేళ్ళపట్టులన్
గోపనఁ జేసి రచ్చకడకుం
బయనంబయి రాకఁ జెప్పగా
నోపిన చారునయ్యవను
నొద్దకుఁ బంప నతండుకృత్రిమ
స్థాపితమైన హార్ద్రము
నతత్యథ చెంతకు నేగుచున్నెడన్ ॥
పంచశత సైంధవములతో బయలుదేర
గాంచి భూసుర వర్యుఁడాఖానుతోడ
తత్తరంబునఁ బల్కెనుదాత్తశౌర్య
మీరలిటువేగ భయమొందు
ఘోరమణుఁడు ॥
దిట్టయతఁడని యెంచితా గుట్టునీకు
దెలియ దక్కటు పిరికివాడలతి బంటు
దవ్వుకొండలు నునుపని దలపవద్దు
గాన నీ వొంటి జనకున్న కార్యము
చెడు ॥
అనిన సంతస మొందియయ్యవనవర్యుఁ
డొంటిదానేడి చేజేత నంటునపుడు
కౌగిలించుచు వడిబట్టి కట్టనెంచి
హృదయ సంతోషముప్పొంగ
నేగుదెంచి ॥
సంధితలమున కర్థ యోజనముదవ్వు
బలములను నిల్పి శిబికపై బయలుదేరి
వెంటనొక బంటురా సభామంటపమున
కరిగి యటరాయుఁడుండమి
కళుకుఁజెంది ॥
సేవకుంగనుంగొని॥
ఏరా రాయుఁడు రాని కారణమ
దేమియే యెడన్వచ్చునా
డౌరాయంచుఁ దపించులోనగుహాలో
హార్యత శార్దూలముల్
స్వాంగంబునుబట్టవచ్చు గతి
కాంతన్వచ్చెతానాజితో
నా రాజేంద్రుఁడు వారిఁగాంచి
మదినయ్యబ్బుల్ తురుష్కేశుఁడున్ ॥
కాలుని చందంబునమై
గ్రాలుచు కటినంటి రెండు
ఖడ్గములిలపై
వ్రేలాడు వాఁడు భటుఁడే
వాలుంగై లేనివాఁడువసుధేశుఁ
డగున్ ॥
శుండాదండనిభోగ్ర దోర్యుగళము
మ్మూనజ్మావలగ్నంబు ను
ద్దండ భ్రాజదురః కవాటమతి
రౌద్ర ప్రస్ఫురద్వక్త్రమున్
చండాంశుప్రతి మాన తేజమును
నీశానాంశమున్ గల్గి
యీతండ ప్రాజ్ఞుని రీతిభీతిలుట
కర్థంబెన్న మత్తేజమే ॥
నావాక్యంబులు నిక్కమంచు
మదిలో నన్నమ్మి మసైన్యత్రికీ
తావుంజేరగు వొంటి వచ్చెనిఁక
నన్దప్పించుకో శక్యమే
యీ వంకన్ దన కంచులోనలరి
ఈఁడేలామముంజేరఁగా
దావైవర్ణ్యము నొందెఁదెల్పుమన
దత్తాజీద్విజుండిట్లనెన్ ॥
దేవాదేవర సన్నిధి
నేవేళల మెలఁగుమాకు నెదవణకమహా
గ్రావాగ్రచరులుఁ దలకరె
తావకభీష్మాస్యమింత దర్శించినచో ॥
అదియునుంగాకతమ యొద్దన స్త్రీధారి
యైన భటుఁడుండఁ గనుగొని
యళకుజెందె
రాయుడని పల్లిభటునిదూరముగబంపి
పిఱికివాఁడనినవ్వుచుఁ బెదవి విఱిచి ॥
తనమనోభీష్టమీడేఱు నని దలంచు
నపుడుశివరాజుఁ దడబడ నడుగులిడుచు
నికటమున కేగ నెదురయ్యె
నొకరి నొకరు
కుశలముల నెంచు తఱి తురుష్కుఁడు
కడంగి ॥
తానాశ్లేషముఁ జేయుభంగి
వెసదోర్దండరబురన్పట్టి వి
ట్టానసైన్యవ వరుండుఁ దప్పికొన
శక్యంబింతయుంగామి నె
ద్దానింజేయఁగలేక ఖాన్వరుని
తుందంబంటి పెన్గోళ్ళలో
లోనంజొన్పి విదుల్ప గోలుమని
పాలుంబూని ఖానుగ్రుఁడై ॥
ఓరీ ! రాజకులాధమా ! నిను
మదీయోగ్రాసి చేఁజెండినా
హారంబిచ్చెదనియ్యెడ న్మెలఁగు
మూకాకొట్ట గృధ్రాళి కిం
పారన్బాలక యుండుమంచు
లయకాలాదభ్రనిర్ఘాతమా
ఘోరాసిన్దల వ్రేయగంటు
వడియెన్ గుల్మాషమాత్రంబుగన్ ॥
డానన్ రౌద్రంబున్గ న్గోనల
నిప్పుకలజాలుఁగురియుచుం బతియున్
దానానేక పశోశిత పానాగత
సింహముట్లు పటువేగమునన్. ॥
ప్రావృట్కాల ఘనాఘనాంతర
తటి చ్ఛాభ్రాంతిచ్ఛటాజాలము
న్గ్రాహోదగ్రవిదారి తోద్ధము
శతారప్రాభవాదభ్రమున్
దేవీదత్తము నొక్కపాణమురు
శక్తింబూని యఖాను బ
ల్గ్రీవాంసంబుల సంధినేయ్యఁ
దెగియెన్ బేవులుప్పువింబొర్లఁగన్॥ ★

# వ్యవసాయరంగంలో అభివృద్ధి

వి. వెంకటేశ్వరరావు

స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచి వ్యవసాయోత్పత్తుల పెంపుదలకు ప్రయత్నాలు ప్రారంభమైనప్పటికీ, నిర్దిష్టమైన లక్ష్యాలుగల. బృహత్పథకాలను అమలు జరిపే కార్యక్రమం ప్రథమ పంచవర్ష ప్రణాళికతోనే మొదలైనది.

దేశ ఆర్థిక వ్యవస్థకు మూలాధారమైన కారణంగా వ్యవసాయానికి, తత్సంబంధమైన ఇతర కార్యక్రమాలకు ప్రణాళికలలో అనన్య ప్రాధాన్యం ఇచ్చారు. పరదేశ పాలనవల్ల చితికిపోయిన బ్రతుకుల ఆకలి బాధను తీర్చడం ప్రాథమిక లక్ష్యంగా, రెండున్నర దశాబ్దాల తర్వాత గ్రామీణ ప్రజల తలసరి ఆదాయం రెట్టింపు కావడం కడపటి లక్ష్యంగా ప్రణాళికలను రూపొందించారు. ప్రజాస్వామ్య జీవన విధానాన్ని, రానున్న సంవత్సరాలలో జనాభా పెరుగుదలను, మిగతా రంగాలలో అభివృద్ధిని దృష్టిలో పెట్టుకుని లక్ష్యాలను, కార్యక్రమాలను నిర్ణయించారు.

అభివృద్ధి పథకాలవల్ల ఒక్కుమ్మడిగా మార్పు రానప్పటికీ వ్యవసాయ రంగం పరిస్థితి క్రమక్రమంగా మెరుగుపడినది. నిర్ణయించుకున్న లక్ష్యాలన్నీ అక్షరాలా నెరవేరకపోయినా ఒక్కొక్క ప్రణాళిక వ్యవధి ప్రాతిపదికగా పరిశీలిస్తే స్పష్టమైన అభివృద్ధి కనిపిస్తుంది. మూడవ ప్రణాళిక సగపడుతున్న ప్రస్తుత సమయానికి పుష్కలంగా కాకపోయినా దాదాపు సరిపడేటంతగా ఆహార ధాన్యాలను ఉత్పత్తి చేసుకునే శక్తిని సంపాదించుకొనగలిగాము. 1957–58 సంవత్సరంలో మాదిరిగా అప్పుడప్పుడు అవాంతరాలు సంభవించకపోతే వ్యవసాయ పరిస్థితి ఇంతకంటే ఇంకా ఎంతో మెరుగుగా ఉండే దనడంలో సందేహంలేదు.

మొదటి ప్రణాళిక ప్రారంభ సమయంలో దేశ వ్యవసాయోత్పత్తులు 522 లక్షల టన్నులు మాత్రమే. ఐదు సంవత్సరాల అభివృద్ధి కృషి ఫలితంగా ఉత్పత్తి మొత్తం 658 లక్షల టన్నుల వరకు పెరిగింది. వరి ధాన్యం ఉత్పత్తి 336 లక్షల వద్ద నిలకడగా ఉన్నప్పటికీ గోధుమ ఉత్పత్తి 116 లక్షల టన్నులకు, బార్లీ 31 లక్షల టన్నులకు, నూనె గింజలు 68 లక్షల టన్నులకు, జనప నార 63 లక్షల బేళ్ళకు పెరిగింది. రెండవ ప్రణాళిక అఖరుకు తిరిగి వ్యవసాయోత్పత్తి 790 లక్షల టన్నులకు పెరిగింది. మూడవ ప్రణాళికలో గడిచిన రెండు సంవత్సరాలలోనూ ఉత్పత్తి 808 లక్షల టన్నులకు మించలేదు. తృతీయ ప్రణాళిక ముగిసే నాటికి పది కోట్ల టన్నుల ఆహార ధాన్యాల ఉత్పత్తి లక్ష్యాన్ని సాధించవలసి ఉన్నది. ప్రణాళికల మధ్యకాలంలో అప్పుడప్పుడు ఉత్పత్తులు – అంతకు క్రిందటి సంవత్సరంతో పోల్చి చూస్తే – తగ్గడంకూడా సంభవించింది. ఉదాహరణకు 1957–58 వ సంవత్సరంలో ఉత్పత్తి 625లక్షలటన్నులకు పడిపోయింది. అంటే మొదటి ప్రణాళిక చివరకు సాధించిన లక్ష్యంకంటే ఇది 33 లక్షల టన్నులు తక్కువ. అయితే ఇలా అప్పుడప్పుడు ఉత్పత్తుల తగ్గుదల సంభవిస్తుండటం దురదృష్టకరమైనప్పటికీ, అంత మాత్రాన సాధించిన అభివృద్ధి యావత్తు కోల్పోయినట్టు భావించ నవసరంలేదు. మన దేశంలో సేద్యం జరుగుతున్న భూమిలో ఐదోవంతు విస్తీర్ణానికి మాత్రమే నీటి పారుదల సౌకర్యాలు ఉన్నాయి. మిగతా ప్రాంతాలన్నీ వాతావరణదయాదాక్షిణ్యాలపై ఆధారపడవలసినదే. ఇటువంటి పరిస్థితులలో అప్పుడప్పుడు ఉత్పత్తి దెబ్బతినడం సహజమే. అందువల్ల జరిగిన అభివృద్ధిని సమీక్షించడం ఏయేటి కాయేడు లెక్కలను బట్టి గాక ఐదు సంవత్సరాల వ్యవధిని బట్టి జరగవలసి ఉంటుంది.

1946–47నుంచి 1950–51 సంవత్సరం వరకు అంటే మొదటి పంచవర్షప్రణాళిక ప్రారంభమయ్యేటంతవరకు సగటున యేటా 581 లక్షల టన్నుల ఉత్పత్తి జరిగింది. ఐదుసంసవత్సరాల ప్రణాళికా బద్ధమైనకృషి ఫలితంగా ఉత్పత్తి పెరిగింది. ప్రథమ పంచవర్షప్రణాళికలో సగటు ఉత్పత్తి 658 లక్షల టన్నులు. ఇలాగే రెండవ ప్రణాళికలో సగటున యేటా 749 లక్షలటన్నుల ఉత్పత్తి జరిగింది. మూడవ ప్రణాళిక సగపడుతున్న ప్రస్తుత సమయంలో ఉత్పత్తి 808 లక్షల టన్నుల వద్దనిలచిపోయినమాట నిజమే. అయితే ప్రణాళిక అఖరుకు పెట్టుకున్న లక్ష్యాన్ని సాధించలేమని నిరుత్సాహ పడ నవసరంలేదు. మొదటి ప్రణాళికా కాలంలో 2.8 శాతం, రెండవ ప్రణాళికా కాలంలో

.8 శాతం అభివృద్ధి సాధించినందున మిగతా ప్రణాళికా కాలంలో (మూడుసంవత్సరాలు) 6 శాతం వంతున అభివృద్ధి లక్ష్యాలను సాధించడం సాధ్యమా కాదా అని కొందరు సందేహించడం జరుగుతున్నది. రెండవ ప్రణాళిక ఆఖరు సంవత్సరంలో ఆశించిన లక్ష్యాలకు మించి ఉత్పత్తిజరిగింది. ప్రతి సంవత్సరం అదేవిధంగా ఉత్పత్తి జరగడం అసాధ్యం కాకపోయినప్పటికీ సర్వసాధారణం కాజాలదు. ఆ సంవత్సరం లెక్కలతో పోల్చిచూడడంవల్ల తర్వాత సంవత్సరాలలో అభివృద్ధి శూన్యమనిఅనడం జరుగుతున్నది. మూడవ ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలలో వాతావరణ స్థితి గతులు అనుకూలించక అనుకున్నంత అభివృద్ధి జరగలేదు. అయితే మిగతా సంవత్సరాలలో ఇతోధికంగా ఉత్పత్తి చేయడానికి అవసరమైన సన్నాహ కార్యక్రమాలు నిరాటంకంగాజరిగిపోయాయి. మొదటి, రెండవ ప్రణాళికల అనుభవం దృష్ట్యా మిగతా సంవత్సరాలలో తీవ్రతరకృషిద్వారా పదికోట్ల టన్నుల లక్ష్యాన్ని సాధించడం దుర్లభం కాజాలదు.

దేశంలో అత్యవసర పరిస్థితిప్రకటించిన అనంతరం ఆహార ధాన్యాల ఉత్పత్తి విషయంలో మరింత శ్రద్ధాసక్తులు ద్యోతకమైనవి. రక్షణ కృషిలో భాగంగా వ్యవసాయోత్పత్తులను మరింతగా పెంచడం అత్యంతావశ్యకమైనది కేంద్రస్థాయిలోనూ రాష్ట్ర స్థాయిలోనూ ఇందుకుగాను పెక్కు చర్యలు గైకొన్నారు. గోధుమకు కనీస ధరను నిర్ణయించారు. వరిధాన్యానికి ప్రొక్యూర్‌మెంట్ ధరలను ప్రకటించారు. ప్రత్తి సీలింగ్ ధరనుపెంచారు. ఇట్టిచర్యల ద్వారా రైతులు అధికోత్పత్తికై కృషి చేయడానికి ప్రోత్సాహం లభిస్తుంది. జీవన వ్యయంలో మార్పుతెచ్చే సూచనల దృష్ట్యా వరి మొదలైన ధాన్యాల ఉత్పత్తిని రెట్టింపు చేయవలసి ఉంటుందని బడ్జెట్ సమయంలో కేంద్రఆర్థికమంత్రి హెచ్చరించారు. కొత్తగా పెట్టుకొన్న లక్ష్యాలను సాధించడానికై జాతీయాభివృద్ధి మండలి అనేకసూచనలు చేసింది. మైనర్ ఇరిగేషన్, భూసార రక్షణ కార్యక్రమాలకు మరో 50 శాతం కేటాయింపులు మంజూరుచేశారు. మెట్ట వ్యవసాయాన్ని 500 లక్షల ఎకరాలకు విస్తరింప జేయాలని సంకల్పించారు. కేంద్రవ్యవసాయ మంత్రిత్వశాఖ రుణాల మంజూరు నిబంధనలను సులభతరంచేశారు. విత్తనాలు, ఎరువులు, సస్యరక్షణమందులు, పంపుసెట్లు సరఫరా పుష్కలంగా జరిగేటట్టు ఏర్పాట్లు చేస్తున్నారు. సైనిక దళాల సహాయంతో అభివృద్ధి కృషిని తీవ్రతరం చేస్తున్నారు.

## ఆంధ్రప్రదేశ్‌లో అభివృద్ధి

అత్యవసర పరిస్థితి దృష్ట్యా నేమి, ప్రణాళిక పరంగా నేమి దేశం పెట్టుకున్న లక్ష్యాలను సాధించడంలో ఆంధ్రప్రదేశ్ శక్తి వంచన లేకుండా తోడ్పడుతున్నది. తృతీయ ప్రణాళికాకాలంలో ఆహార ధాన్యాలు 26.8 లక్షల టన్నులు, నూనె గింజలు 3.6 లక్షల టన్నులు, ప్రత్తి 60 వేల టన్నులు అధికంగా పండించాలని రాష్ట్రానికి లక్ష్యాలు నిర్ణయించారు. మొత్తం ఉత్పత్తులను 60 లక్షల 34 వేల టన్నుల నుంచి 87 లక్షల 11 వేల టన్నులకు పెంచాలని కార్యక్రమాలను రూపొందించారు. 1960-61 సంవత్సరంలో ఆహార ధాన్యాల ఉత్పత్తి 60 లక్షల 34 వేల టన్నులు కాగా తృతీయ ప్రణాళిక చివరి సంవత్సరంలో 26 లక్షల 77 వేల టన్నుల అధికోత్పత్తి జరగవలసి ఉన్నది. గత సంవత్సరం రాష్ట్రంలో అక్కడక్కడ అధిక వర్షాలు, తెగుళ్ళు, రంపపు పురుగు పట్టడంవంటి జబ్బులవల్ల పంటలు దెబ్బతిన్నప్పటికీ వర్తమాన సంవత్సరంలో పరిస్థితి మెరుగుపడినది. గడచిన రెండేళ్ళ పంటలను బట్టి దిగుబడి సంతృప్తికరంగానే ఉన్నట్టు చెప్పవచ్చు. అధికోత్పత్తికి గాను కొత్త కార్యక్రమాలను రాష్ట్ర ప్రభుత్వం ప్రారంభించింది.

## పైరుల రక్షణ కార్యక్రమం

పైరులకు తెగుళ్ళు తగిలి, చీడపట్టి తీవ్ర నష్టాలు రాకుండా నివారించడానికి ప్రభుత్వం సస్యరక్షణ కార్యక్రమాలను అమలు జరుపుతున్నది. ఈవిధంగా పంటలో పదవవంతును కాపాడటానికి అవకాశం కలుగుతున్నది. స్ప్రేయర్లు, డస్టర్ల వంటి పరికరాల సహాయంతో లక్ష ఎకరాలకు పైగా క్రిమి సంహారమందులను వాడారు. గత సంవత్సరం విమానాల ద్వారా మందులను చల్లించడానికి ఏర్పాట్లు చేశారు. ఈవిధంగా 24 వేల ఎకరాల భూమిలో పంటలకు రక్షణ కల్పించారు. మరో 40 వేల ఎకరాల పంటకు ఇట్టి సౌకర్యాన్ని కల్పించడానికి ఏర్పాట్లు చేశారు.

## సాంద్ర వ్యవసాయ పథకం

సాంద్ర వ్యవసాయ పథకాన్ని విస్తరింప జేయడానికి కూడా రాష్ట్ర ప్రభుత్వం చర్యలు గైకొన్నది. తొలుత పశ్చిమ గోదావరి జిల్లాలో మాత్రమే సాంద్ర వ్యవసాయ పథకాన్ని ప్రారంభించారు. 1960 వ సంవత్సరం నుంచి దీనిని అమలు జరుపుతున్నారు. గరిష్ఠ ఉత్పత్తులను సాధించడమే ఈ పథకం లక్ష్యం.

మరో మూడు సంవత్సరాలలో సాంద్ర వ్యవసాయ పథకాన్ని తగు విధంగా సవరించి కొత్తగా పది జిల్లాలకు విస్తరింప జేయాలని ప్రభుత్వం సంకల్పించినట్టు రాష్ట్ర ఆర్థికమంత్రి గత మార్చి నెలలో అసెంబ్లీలో ప్రకటించారు. తూర్పుగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కర్నూలు, మహబూబ్‌నగర్, నిజామాబాద్, వరంగల్, కరీంనగర్ జిల్లాలకు ఈ పథకాన్ని విస్తరింప జేస్తున్నారు. మొత్తం 150 బ్లాకులలో ఈ కార్యక్రమం అమలు జరుగుతుంది. ఉత్పత్తులను కనీసం 20 శాతం అభివృద్ధిపరచడం లక్ష్యంగా నిర్ణ

యించారు. పశ్చిమ గోదావరి జిల్లాలో సాంద్రవ్యవసాయ పథకంవల్ల జరిగిన అధికోత్పత్తి దృష్ట్యా రాష్ట్ర ప్రభుత్వం తలపెట్టిన కార్యక్రమంవల్ల ఉత్పత్తిలక్ష్యాలు శీఘ్రతరంగానే సిద్ధించగలవు. 1959 వ సంవత్సరంలో పశ్చిమ గోదావరి జిల్లాలో ఎకరాకు 1800 పౌన్ల వరి పండించారు. మూడేళ్ళ తర్వాత ఉత్పత్తి 1700 పౌన్లకు పెరిగినట్లు అధికారులు ప్రకటించారు. పశ్చిమ గోదావరి జిల్లాలోని మొత్తం పన్నెండు లక్షల ఎకరాలలోనూ 8 లక్షల 50 వేల ఎకరాలలో వరి పండిస్తున్నారు. వరి ఉత్పత్తి పెరుగుదల 50 శాతం కాగా ఇతర పంటల దిగుబడికూడా 40 శాతం వరకు పెరిగినట్టు అంచనా.

ఉత్పత్తిని పెంచడానికి సాంద్ర వ్యవసాయ పథకం ఉండితీరాలన్న నియమం లేదు. సాంద్ర వ్యవసాయపథకంలేని ఇతర జిల్లాలలో కూడా సాధ్యమైనంత వరకు అధికోత్పత్తిని సాధించవచ్చు. 1951–52 సంవత్సరం నుంచి 1956. 57 సంవత్సరం వరకు రాష్ట్రంలో సగటు ఎకరా ఉత్పత్తిని, అత్యధిక ఉత్పత్తి జరిగిన సందర్భాలను పరిశీలిస్తే సర్వత్రా అధికోత్పత్తికి అవకాశం ఉన్నట్టు స్పష్టం కాగలదు. ఆధునిక వ్యవసాయ విధానాలను అనుసరించి శ్రమిస్తే గరిష్ఠ ఉత్పత్తిలక్ష్యాన్ని సాధించడం కష్టసాధ్యంకాదని రుజువైనది. పైన పేర్కొన్న సంవత్సరాలలో వరుసగా సగటు ఉత్పత్తి ఇలాఉన్నది : 879 పౌన్లు, 905 పౌన్లు, 1078 పౌన్లు, 1087 పౌన్లు, 1015 పౌన్లు, 1006 పౌన్లు. ఇదే సంవత్సరాలలో అత్యధిక ఉత్పత్తిజరిగిన సందర్భాలలో ఎకరా దిగుబడి వివరాలు : 4710 పౌన్లు, 6154 పౌన్లు, 6652 పౌన్లు, 6707 పౌన్లు, 6859 పౌన్లు, 6075 పౌన్లు అంటే అత్యధిక దిగుబడి సగటుఉత్పత్తి కంటె 5.4 నుంచి 6 రెట్లవరకు ఉన్నది. అవసరమైన కృషి జరిగితే కనీసం రెట్టింపు ఉత్పత్తిని సాధించడం సులభం.

## పంటలపోటీ పథకాలు

పంటలపోటీ పథకాలు కూడా అధిక వ్యవసాయోత్పత్తులకు దోహదం చేస్తుంది. కేంద్ర ప్రభుత్వం అమలుజరుపుతున్న ఈ పథకంప్రకారం మూడు సంవత్సరాల సగటు పంటకంటే పదిహేనుశాతం ఎక్కువ ఉత్పత్తిచేసిన జిల్లాకు 10 వేల రూపాయలు, రాష్ట్రానికి 50 వేల రూపాయలు బహుమతులుగా ఇస్తారు. అధికోత్పత్తి చేసిన జిల్లాకు 'రాజ్యకలశం', రాష్ట్రానికి 'రాష్ట్రకలశం' కూడా ఇస్తారు. ఈ బహుమతుల పథకాన్ని ఆంధ్ర ప్రదేశ్ ఉపయోగించుకున్నది. 1958–59 రబీ పంటలపోటీలో 9 జిల్లాలకు నగదు బహుమతులు లభించాయి. 1959–60 సంవత్సరంలో విశాఖపట్టణం, కర్నూలు, చిత్తూరు, నిజామాబాద్, మహబూబ్ నగర్, నల్లగొండ, వరంగల్ జిల్లాలు బహుమతులు పొందాయి. 1958–59 సంవత్సరంలో రాజ్యకలశాన్ని పొందిన కృష్ణాజిల్లా ఆపై సంవత్సరంలో దానిని హైదరాబాదు జిల్లాకు కోల్పోయింది. వివిధ పంటల విషయంలో రాష్ట్రరైతులు ఉత్సాహం చూపించారు. అఖిల భారతపోటీలలో బహుమతులు సంపాదించారు. కృష్ణా, శ్రీకాకుళం జిల్లా రైతులు 1958–59, 1960–61 సంవత్సరాలలో చెరకుపంట పోటీలో ప్రథమ స్థానాలు పొందారు. మొత్తంమీద పంటలపోటీ పథకం రైతులకు తగు ప్రోత్సాహం ఇస్తున్నట్టు స్పష్టమైనది.

## ఇరిగేషన్ సౌకర్యాలు

శీఘ్రగతిని అధికోత్పత్తి సాధించవలసిన అవసరం దృష్ట్యా వెంటనే ఫలితానికి రాగల మైనర్ ఇరిగేషన్ సౌకర్యాల అభివృద్ధికి అత్యధిక ప్రాధాన్యం ఇచ్చారు. 1962–63 సంవత్సరంలో ప్రణాళికా కార్యక్రమాలక్రింద మైనర్ ఇరిగేషన్ పథకాలకు 30 లక్షల రూపాయలు మాత్రమే కేటాయించారు. ఇప్పుడు, అదనంగా 16 లక్షల 50 వేల రూపాయలను మంజూరుచేశారు. పంటబావుల పథకాన్ని పునః పరిశీలించి బావికి 2000 రూపాయలవరకు ప్రభుత్వ సహాయాన్ని పెంచాలని నిర్ణయించారు. జిల్లాలలోని భూ సారము త్రవ్వకపు ఖర్చులు మొదలైన లెక్కలు ఆధారంగా ప్రభుత్వం సహాయం చేస్తుంది. తృప్తికరంగా బావుల త్రవ్వకం, వినియోగం జరిగిన సందర్భాలలో సహాయ మొత్తంలోని కొంతభాగాన్ని విరాళంగా ఇస్తారు.

నీటి సౌకర్యాలు తక్కువగా గలప్రాంతాలలో సేద్యవిధానాలను మెరుగు పరచడానికి గాను పరిశోధనలు జరుగుతున్నాయి. బెంగుళూరులో పొలాలకు నీరుపెట్టడం గురించి నిపుణులుజరిపిన పరిశోధనఫలితంగాఅత్యంత ఫలప్రదమైన కొత్తపద్ధతులు కనుగొన్నారు. కేంద్ర ప్రభుత్వం ఇట్టి సౌకర్యాలను పరిశోధనా ఫలితాలను త్వరలోనే వివిధ రాష్ట్రాలకు వ్యాపింప జేయగలదని ఆశించవచ్చు.

1962–63 సంవత్సరానికి ఉద్దేశించిన భూసార రక్షణ కార్యక్రమాలను కూడా విస్తృతంచేశారు. ఇందుకుగాను రాష్ట్ర ప్రణాళికలో కేటాయించినమొత్తం 22లక్షల రూపాయలు మాత్రమేకాగా ఇప్పుడు అదనంగా 5 లక్షల రూపాయలు మంజూరు చేశారు.

## ఎరువుల సరఫరా

పెరుగుతున్న అవసరాల దృష్ట్యా ఎరువుల సరఫరా పరిస్థితిని మెరుగుపరచడానికి ప్రభుత్వం చర్యలు గైకొన్నది. రాష్ట్రానికి ఎరువుల కోటాలను పెంచారు. 1962–63 సంవత్సరంలో అదనంగా 72వేల నత్రజని సరఫరా జరిగింది.

రైతులకు ఎరువులను పంపిణీచేసే కార్యక్రమాన్ని సులభతరం చేశారు. పెట్టుబడి పెట్టుకోలేని రైతులకు సహాయంగా ఎరువులకై రుణాలను ఇచ్చేకార్యక్రమాన్ని అమలు జరుపుతున్నారు. ఇందుకుగాను 1963–64

( మిగతా 60వ పేజీలో )

# శ్రీశైలం ప్రాజెక్టు: చౌకగా విద్యుచ్ఛక్తి ఉత్పత్తి

ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ 1963 జూలై 24వ తేదీన శ్రీశైలం ప్రాజెక్టుకు శంకుస్థాపన చేశారు. ఈ ప్రాజెక్టు ఆంధ్ర ప్రదేశ్‌లోని కృష్ణానది నీటి వనరుల సమీకృత అభివృద్ధికి ఉద్దేశించిన పథకంలో ఒక భాగం. ఆంధ్ర ప్రదేశ్‌కు లభ్యంకాగల కృష్ణా నది నీటిని సంపూర్ణంగా వినియోగంలోకి తేవడానికై సిద్ధేశ్వరం, నాగార్జునసాగర్, పులిచింతల జలాశయాల నిర్మాణానికి ఖోస్లా కమిటీవారు ప్రతిపాదనలు చేయడం జరిగింది. అయితే ఈ ఆనకట్టలవల్ల కూడా సిద్ధేశ్వరం, నాగార్జునసాగర్‌ల మధ్య సుమారు 180 అడుగుల మట్టంలోని నీటి ప్రవాహాన్ని విద్యుదుత్పాదనకు వినియోగించడానికి వీలు పడదు. ఈ కారణంవల్ల, శ్రీశైలం వద్ద కృష్ణానది ప్రవహించే ఇరుకైన కనుమకు అడ్డంగా దాదాపు 180 అడుగుల ఎత్తున నాలుగవ ఆనకట్టను నిర్మించడం అవసరమని అభిప్రాయ పడటం జరిగింది.

శ్రీశైలంవద్ద సహజసిద్ధమైన పరిస్థితులు చాలా అనుకూలంగా వున్నాయి. ఈ స్థల పరిస్థితులను సమగ్రంగా పరిశీలించిన మీదట, శ్రీశైలం వద్ద 400 అడుగుల ఎత్తున ఒక ఆనకట్ట (సిద్ధేశ్వరం వద్ద నిర్మించడానికి ప్రతిపాదించినట్టిదే — ఇ. ఎల్. 885 —)ను నిర్మించడం చాలా లాభసాటి అనీ, అందువల్ల రెండు ఆనకట్టలను నిర్మించవలసిన అవసరం కూడా తప్పుతుందనీ భావించడం జరిగింది. కాబట్టి కృష్ణానదీ జలాలవల్ల గరిష్ఠ ప్రయోజనాలు సిద్ధించేందుకై ఈ నది నీటి వనరులను అభివృద్ధి పరచడానికి నాగార్జున సాగర్‌కు ఎగువన శ్రీశైలం వద్ద ఒకే ప్రాజెక్టును నిర్మించడానికి నిశ్చయించారు.

శ్రీశైలం ఆనకట్ట నిర్మాణానంతరం రెండు చోట్లకూడా 60 శాతం లోడ్‌తో సుమారు 4,65,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి లభించగలుగుతుంది. శ్రీశైలం, నాగార్జున సాగర్ విద్యుత్కేంద్రాలు ఆంధ్ర ప్రదేశ్ మధ్య భాగంలో వుంటాయి. ఈ రెండు విద్యుత్కేంద్రాలలో ఉత్పత్తి కాగల విద్యుచ్ఛక్తిని రాష్ట్రమంతటా వివిధ పారిశ్రామిక కేంద్రాలకు చౌకగా లభింపజేయడానికి వీలుంటుంది.

శ్రీశైలం విద్యుత్కేంద్రం నుంచి 60 శాతం లోడ్‌తో కనీసం 260 మెగావాట్ల విద్యుచ్ఛక్తిని నిరంతరం సరఫరా చేయవచ్చునని అంచనా.

## ప్రాజెక్టు వివరాలు

ఈ ప్రాజెక్టు క్రింద దిగువ నిర్మాణాలు జరుగుతాయి :

కర్నూలు జిల్లాలో సుప్రసిద్ధమైన శ్రీశైలం దేవాలయం సమీపంలో కృష్ణానదికి అడ్డంగా చాలా ఎత్తున ఒక ఆనకట్టను నిర్మిస్తారు. నీరు పొర్లిపారని భాగంతో సహా ఈ ఆనకట్ట మొత్తం పొడవు దాదాపు 1685 అడుగులు వుంటుంది. దీని ఎత్తు లోతైన నదీగర్భం మట్టానికి సుమారు 400 అడుగులు. పూర్తి జలాశయం మట్టం 885 అడుగులు. దీనిలో సుమారు 158 శతకోటి ఘనపుటడుగుల నీరు నిల్వవుంటుంది.

శ్రీశైలం ఆనకట్ట ఎడమ ప్రక్కన నిర్మించే విద్యుత్కేంద్రంలో ఒక్కొక్కటి 110 మెగావాట్ల విద్యుదుత్పాదక శక్తిగల ఏడు యూనిట్లను నెలకొల్పుతారు. ప్రారంభంలో నాలుగు యూనిట్లను మాత్రం స్థాపిస్తారు.

ప్రస్తుత 440 మెగావాట్ల స్థాపిత విద్యుదుత్పాదనకు, స్టెప్ అప్ ఔట్‌డోర్ స్టేషనుతో సహా విద్యుత్కేంద్రం, సివిల్ పనులకు మొత్తం రూ. 42 కోట్లు వ్యయం కాగలదని అంచనా. అంటే ఒక స్థాపిత కిలోవాటు విద్యుదుత్పత్తికి వెయ్యి రూపాయిలకు లోపే ఖర్చు అవుతుందన్నమాట. ఇది చాలా చౌక. నాగార్జునసాగర్, శ్రీశైలంల వద్ద మరో కొన్ని యూనిట్లను నెలకొల్పినప్పుడు ఒక స్థాపిత కిలోవాటు విద్యుదుత్పాదనకు వ్యయం మరింతగా తగ్గుతుంది. అందుచేత ఈ పథకం చాలా ప్రయోజనాత్మకమైనది. ఈ ప్రాజెక్టువల్ల ఉత్పత్తికాగల మొత్తం విద్యుచ్ఛక్తి నాలుగు సంవత్సరాలలోనే వినియోగంలోకి రాగలుగుతుంది.

## పనుల పురోగతి

ప్రాజెక్టుకు సంబంధించిన దర్యాప్తులు జరపడానికీ, రోడ్లు, భవనాలు, నీటి సరఫరా మొదలైన ప్రాథమిక పనులను చేపట్టడానికీ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉత్తర్వులు చేసింది. కాబట్టి ఈ క్రింద పేర్కొన్న పనులను ప్రారంభించడం జరిగింది. వాటి పురోగతిని గురించి దిగువ ఇవ్వబడినది :

1962 జూన్ వరకు నాలుగు డ్రిల్లింగ్ యంత్రాలు. ఆనకట్ట పునాదికి అనువైన స్థలాన్ని పరిశీలించే నిమిత్తం నదీ గర్భంలోనూ, పార్శ్వాలలోనూ డ్రిల్లింగ్ పనులను జరిపాయి. మొత్తం 1550 అ — 4½ అం. ల లోతున 21 రంధ్రాలు వేసి సాంపిల్స్ తీసుకున్నారు. 1962 జూన్ తరువాత మరి కొన్ని రంధ్రాలు వేశారు. 1963 మే నెలాఖరు నాటికి 4409 అడుగుల మేరకు డ్రిల్లింగ్ పూర్తయింది. 1164 అడుగుల లోతైన 17 రంధ్రాల విషయంలో ప్రయోగాత్మక చర్యలు కూడా సమాప్తమైనవి.

60 అ. × 60 అ. విస్తీర్ణంలో ఈ పరిశీలన ముగిసింది.

పునాదు త్రవ్వకం కార్యక్రమానికి రూ. 6.6 లక్షలు మంజూరు చేశారు. ముఖ్యమంత్రి ఈ కార్యక్రమానికి 1963 జనవరి 13 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. మే నెలాఖరు నాటికి 9,23,000 ఘనపు ఒడుగులమేరకు త్రవ్వకాలుపూర్తయ్యాయి.

ఒక ఉక్కు వంతెనకొరకు ప్రత్యామ్నాయ డిజైన్లను రూపొందించి టెండర్లను కోరుతూ ప్రకటించడం జరిగింది. ఉక్కు భాగానికి మాత్రం సీతానగరం వర్క్-షాపుల తరపున వచ్చిన ఒకే ఒక టెండరు తప్ప మరే టెండర్లూ రాలేదు. తరువాత 150 స్పానుల పోతపోసిన కాంక్రీటు వంతెన, 60 అ. స్పానుల ఆర్ సి. సి. 'టీ' దూలపు వంతెనల కొరకు తిరిగి టెండర్లను కోరడం జరిగింది.

ప్రస్తుత పనికాలంలోనే 'కాఫర్' డాము తదితర మళ్ళింపు పనులను ప్రారంభించడానికి ప్రతిపాదించారు. 1925 అ. ల పొడవు, 30 అ. ల వ్యాసం గల మళ్ళింపు సొరంగం కొరకు టెండర్లను కోరడం జరిగింది. 20,000 క్యూసెక్కుల నీటిని మళ్ళించడానికి ఈ సొరంగం ఉపయోగ పడుతుంది.

## అప్రోచ్ రోడ్డు

దోర్నాల — శ్రీశైలం రోడ్డుపై 44 వ కి. మీ. నుంచి ప్రాజెక్టు స్థలం వరకు ఆరు మైళ్ళ 2 ఫర్లాంగుల పొడవున ఒక రోడ్డు శాఖను నిర్మించారు. దీనికి ముఖ్యమంత్రి 1963 జనవరి 13 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. ఈ రోడ్డు మార్గంలో తారువేసే పని ప్రస్తుతం పూర్తికావచ్చింది.

వట్టివెలపల్లి నుంచి ఆనకట్ట ఎడమ పార్శ్వం వరకు జీపు వెళ్ళడానికి అనువైన మార్గాన్ని నిర్మించారు. ఇప్పుడు హైద్రాబాదు నుంచి నేరుగా శ్రీశైలం వరకు జీపులో ప్రయాణం చేయవచ్చు. హైద్రాబాదు నుంచి ఆనకట్ట ఎడమ పార్శ్వానికి 133 మైళ్ళ దూరం వుంటుంది రూ. 26లక్షల వ్యయంతో ఈ జీపు మార్గాన్ని పక్కా రోడ్డుగా నిర్మించడానికి ప్రతిపాదనలను రూపొందించారు.

## విద్యుచ్ఛక్తి సరఫరా

1962 జూన్ వరకు కాంప్ కాలనీకి 5.కి. వా.ల విద్యుదుత్పాదక యంత్రం ద్వారా విద్యుచ్ఛక్తి సరఫరా చేసేవారు. కాలనీకీ, పంపింగ్ అవసరాలకూ ఈ సరఫరా చాలనందున తాత్కాలిక డీసెల్ స్టేషను నొకదానిని నెలకొల్పి వినియోగంలోకి తెచ్చారు. ఒక్కొక్కటి 50 కి. వా. శక్తిగల 8 విద్యుదుత్పాదక సెట్లను ఈ స్టేషనులో నెలకొల్పారు. 1250 కిలోవాట్ల స్థాపిత విద్యుదుత్పాదక శక్తివుండే శాశ్వత డీసెల్ విద్యుత్కేంద్రాన్ని రూ. 16.65 లక్షల వ్యయంతో నిర్మించడం జరుగుతున్నది. రూ. 30 లక్షల ఖర్చుతో కర్నూలు నుంచి 33 కె. వి. లైను వేసే పనులు దాదాపు పూర్తికా వచ్చాయి. ★

(53 వ పేజీ తరువాయి)

సంవత్సరానికై ప్రభుత్వం 5( లక్షల రూపాయలను మంజూరు చేసింది. ఒక్కొక వ్యక్తికి 500 రూపాయలకు మించకుండా పంటలకుబట్టి ఎకరాకు కొంత వంతున రుణాలను ఇస్తారు. సమితుల వారీగా ప్రభుత్వం కేటాయించిన మొత్తాన్ని పంపిణీ చేశారు.

## సహకార వ్యవసాయం

సహకార వ్యవసాయం ద్వారా కూడా అధికోత్పత్తికై కృషి జరుగుతున్నది. ప్రయోగాత్మక ప్రాతిపదికపై రాష్ట్రంలోని 20 జిల్లాలలోనూ 200 సహకార వ్యవసాయ సంఘాలను నెలకొల్పడానికి పథకాన్ని రూపొందించారు. పైలట్ ప్రాజెక్టులుగా ఈ సంఘాలను నిర్వహిస్తారు. ఇవిగాక మరో 200 సహకార సంఘాలను నెలకొల్పడానికి ప్రభుత్వం అనుమతిస్తుంది. అయితే వీటికి పైలట్ ప్రాజెక్టులతో సంబంధం ఉండదు. ప్రస్తుతం ఒక్కొక పైలట్ ప్రాజెక్టు ప్రాంతంలో ఐదు సహకార వ్యవసాయ సంఘాలను మాత్రమే నెలకొల్పవచ్చు. వ్యవసాయమే జీవనాధారమై, భూములులేనట్టి రైతులకు పునరావాసవసతి కల్పించడానికిగాను రాష్ట్రప్రభుత్వం 250 ఎకరాల విస్తీర్ణం కలిగిన ఏక ఖండాలను ప్రత్యేకించింది. 5200 మంది పేద రైతులకుగాను ఈ విధంగా పదివేల ఎకరాల తరి, 12 వేల ఎకరాల మిట్ట బంజరుభూములు లభిస్తాయి. ఈ భూములలో సేద్యానికిగాను సహకార వ్యవసాయ సంఘాలను నెలకొల్పుతారు. సహకార వ్యవసాయసంఘాల కార్యదర్శులకు గత జూన్ నెలనుంచి రాజేంద్రనగర్ లో శిక్షణ ఇస్తున్నారు. వివిధ ప్రాంతాలలోని సహకార వ్యవసాయ సంఘాలకు చెందిన 40 మంది కార్యదర్శులు వచ్చే నవంబర్ నెల నాటికి శిక్షణకోర్సును పూర్తిచేస్తారు.

## విస్తరణ కార్యక్రమం

రైతులు ఆధునిక వ్యవసాయ విధానాలను అవలంబించేటట్టు విస్తరణ కార్యక్రమం అమలు జరుగుతున్నది. వ్యవసాయ కళాశాలలు ఈ విషయంలో సమర్థవంతంగా కృషిచేస్తున్నాయి. ప్రత్యేక వ్యవసాయాభివృద్ధి పథకాలు లేని ప్రాంతాలలో విస్తరణాధికారుల సలహా సహకారంవల్ల రైతులు అధిక ప్రయోజనాలు పొందుతున్నారు. ఉదాహరణకు రాజేంద్రనగర్ బ్లాకులోని ప్రయోగాత్మక క్షేత్రాలలో ఆరుగురురైతులు బంగాళా దుంప పెంపకంలో ఆధునిక సేద్యవిధానాలను అవలంబించడం ద్వారా సగటున 18 శాతం అధికోత్పత్తిచేశారు. పెద్దమొత్తాల పెట్టుబడి లేకుండానే ఎకరాకు అదనంగా రెండు వందల రూపాయలవరకు సంపాదించ గలిగారు.

వ్యవసాయ రంగంలో బహుముఖంగా జరుగుతున్న ఇట్టి కృషి ఫలితంగా ప్రణాళికలో పెట్టుకున్న లక్ష్యాలను సాధించగలమని ఆశించవచ్చు. ★

# ఆంధ్రదేశ నృత్యాలు



**శ్రీనివాస చక్రవర్తి**

అనాదినుండీ ఆంధ్రదేశం శాస్త్రీయ జానపద నృత్యాలకు ప్రసిద్ధి చెందినది. ఈ నృత్యాలు భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో ప్రచారంలోవున్న నృత్యాలకన్నా ప్రత్యేకమైనవి.

క్రీస్తుకుపూర్వమే రచింపబడిన 'గాథా సప్తశతి'లోనూ, భరతముని ( 200 క్రి.పూ. -200 క్రీ.త) ప్రణీతమైన 'నాట్య శాస్త్రం'లోనూ, పన్నెండవ శతాబ్దానికి చెందిన పాల్కురికి సోమనాథుని 'పండితారాధ్యచరిత, బసవ పురాణాల'లోనూ, పదమూడవ శతాబ్దానికి చెందిన జాయప సేనాని 'నృత్య రత్నావళి'లోనూ, ఆంధ్రదేశపు నృత్యాలకు సంబంధించిన ప్రసక్తి వున్నది,

'అభినయదర్పణా'న్ని రచించిన నంది కేశ్వరుడు ( 3-4 శతాబ్దాలమధ్యకాలం ), 'నృత్య రత్నావళి'ని రచించిన పదమూడవ శతాబ్దపు జాయపసేనాని-యిరువురూ ఆంధ్రులే. ఇవి రెండూ నాట్యశాస్త్రంలో ప్రామాణికాలుగా పేర్కొనబడుతున్నాయి, బెంగాలు రాష్ట్రంలో లభించే అభినయ దర్పణం తెలుగులిపితో వున్నది.

నృత్య, నాటక, సంగీతాలమీద వ్యాఖ్యానించగల సమర్థులయిన నానదేవుడు, భూలోకమల్లుడు, కుమారగిరి రెడ్డి, పెదకోమటి వేమారెడ్డి, లొల్లుభట్టు, సింగభూపాలుడు, మల్లినాథుడు-వీరంతా ఆంధ్రులే. వీరు 11-14 శతాబ్దుల మధ్యకాలంలో ఆంధ్రదేశంలో ఖ్యాతి కెక్కారు.

నాట్యశాల్లలగూర్చి; వరంగల్లులోని మాచలదేవి, కొండవీడులోని లకుమాదేవి మొదలయిన నాట్యకత్తెలనుగూర్చి అనేక చారిత్రక గ్రంథాలలోనూ, కావ్యాలలోనూ బహు పర్యాయములు ప్రస్తావింపబడినది.

అమరావతి, నాగార్జున కొండలలోని స్థూపాలలోనూ; విజయవాడవద్ద గల వుండవల్లి గుహలలోనూ, పాలంపేట, భిక్కవోలు, ద్రాక్షారామ మొదలయిన దేవాలయములలోనూ అనేక నృత్యభంగిమలు ఆంధ్రదేశపునృత్యాల ప్రాచీనతను చాటి చెప్పుతుంటాయి.

## శాస్త్రీయ నృత్యం

భారతదేశంలోని ఆయాప్రాంతాలలోగల నృత్యాలన్నింటికీ మూలమైన భరతనాట్యశాస్త్రమే ఆంధ్రదేశంలోని శాస్త్రీయ నృత్యాలకు కూడా మూలమైనది. భరతముని సూచించిన విధంగా (1) ఆంగిక (పెదవుల కదలిక ), (2) వాచికాభినయ (వాక్కు), (3) ఆహార్య (వస్త్రధారణ), (4) సాత్విక (హావ,

భావ ప్రకటన) భావాలు ఆంధ్రదేశంలో అనుసరింప బడుతున్నాయి. ఇక్కడవాడే సంగీతం స్వచ్ఛమయిన కర్ణాటక సంగీతం. కాని పాఠ్యగ్రంథంగా అభినయ దర్పణాన్నే వాడుతున్నారు. అందుకు కారణం ఆ గ్రంథరచయిత ఆంధ్రుడు కావడమే. అభినయ దర్పణంఎక్కువగా ఆంగికాభినయాన్నిగూర్చే తెలియ జేస్తున్నది. ఆంధ్రదేశంలో విశేషప్రచారంగల మరొకగ్రంథం భానుదత్తమిశ్రుని 'రసమంజరి'. ఇది శృంగారరస ప్రధానమైనది. అందుచేత నేకాలోలు ఆంధ్రదేశంలో వీరరసానికి, తాండవానికికన్న శృంగార రసానికి, లాస్యానికి (విలాసనృత్యం) ఎక్కువ ప్రాధాన్యత యివ్వబడుతున్నది.

ఆంధ్రదేశపు శాస్త్రీయ నృత్యాలను నాట్యమేళం, నట్టువమేళం అని రెండు ముఖ్యవర్గాలుగా విభజించవచ్చు. నాట్యమేళంలో నృత్యము, నాటకము సమ్మిళితమై వుంటాయి. నట్టువ మేళంలో వట్టి నృత్యం మాత్రమే వుంటుంది.

## కూచిపూడి నృత్యనాటకం

పదవ శతాబ్దానికి ముందే భారతీయ నృత్యంలో మతాభినివేశం సన్నగిల్లినదని కొందరు చరిత్రకారులు, కళావిమర్శకులు అభిప్రాయ పడుతున్నారు. భారతీయ నృత్యంలో మతాభినివేశాన్ని, వ్యక్తిత్వాన్ని తిరిగి ప్రతిష్టించడానికి విజ్ఞులైన పండితులు కొందరు ఒక ఉద్యమాన్ని లేవదీసినట్లు తెలుస్తున్నది. కూచిపూడి అలాంటి ఉద్యమానికి చెందినదే అని విమర్శకుల అభిప్రాయం. మరికొంతమంది, మిగతా భారతీయ నృత్యాలలో అలక్ష్యం ప్రదర్శింపబడిన వాచకాభినయాన్ని పునః ప్రతిష్ఠించి పూర్వాన్నత్యాన్ని సంతరింపజేసే ఉద్దేశ్యంతో బయల్వెడలిన ఉద్యమానికి యీ కూచిపూడి కేంద్రమని భావిస్తున్నారు. కూచిపూడి విధానంలో నృత్యం చేస్తున్న పాత్రే వాచికాభినయంచేస్తుంది. మిగిలిన విధానాల్లో తెరవెనుకనుండి ఆ ఫలితంసాధించబడుతుంది.

కూచిపూడి బ్రాహ్మణులు నృత్యనాటకాన్ని, నృత్యాన్ని వృత్తిగా తీసుకొనక పూర్వంనుండే నృత్యనాటకం జానపద సాంప్రదాయంలోనూ, శాస్త్రీయనృత్యం నట్టువమేళం రూపంలోనూ వుండేది. కూచిపూడి భాగవతులు నృత్యనాటకాన్ని జానపద స్థాయినుండి శాస్త్రీయస్థాయికి పునరుద్ధరించి, వ్యవస్థీకరించి; భగవంతునిపై మధురభక్తిని ప్రచారంచేసే బృహత్కార్యాన్ని తమ భుజస్కంధాలపై వేసుకున్నారు.

కృష్ణా జిల్లా దివితాలూకాలో మచిలీపట్టణానికి 15 మైళ్ళ దూరంలో కూచిపూడిగ్రామం ఉన్నది. వందలకొలదీ పదాలను వ్రాసిన క్షేత్రయ్య స్వగ్రామం అయిన 'మువ్వ' యీ కూచిపూడికి 2-3 మైళ్ళ దూరంలోనే వున్నది. శాతవాహనుల రాజధాని అయిన శ్రీకాకుళం, ప్రాచీనకాలంలో ప్రసిద్ధ సముద్రరేవుగా పేరందిన ఘంటశాల కూచిపూడికి కొద్ది మైళ్ళ దూరంలోనే వున్నాయి. ఈ ప్రాంతం క్రీస్తుకు పూర్వం మూడవ శతాబ్దినుండి కూడా సంస్కృతికి, లలిత కళకు ప్రసిద్ధిచెందినది. గోలకొండ నవాబు అబుల్ హసన్ కుతుబ్ షా (1672-1687) యీ గ్రామాన్ని బ్రాహ్మణులకు అగ్రహారంగా యిచ్చాడు.

వీరనరసింహదేవరాయుని (1506-1509) ఆస్థానంలో కూచిపూడి బ్రాహ్మణులు ఒక నాటికను ప్రదర్శించినట్టి మెకంజీ ప్రభువు రికార్డులవలన విశదమవుతున్నది. దీనిని బట్టి నృత్యనాటకం కూచిపూడిలో క్రి. శ. 1500 సం. నకు ముందుగానే వర్ధిల్లినట్లు తెలుస్తున్నది.

సాహిత్యంలోనూ, తత్వశాస్త్రంలోనూ గొప్ప ప్రజ్ఞావంతుడయిన సిద్ధేంద్రయోగి 'భామాకలాపం' ను వ్రాసి, దానిని కూచిపూడి బ్రాహ్మణులకు బోధించాడు. కూచిపూడి గ్రామంలో పుట్టే ప్రతి బ్రాహ్మణ పురుషుడూ, నాట్యాన్ని వృత్తిగా తీసుకుంటాననీ, లేదా కనీసం సంవత్సరానికొకసారయినా ప్రదర్శన యిస్తాననీ వారు ప్రతినబూనేట్టుచేశాడు. నృత్యాలలోనూ, నృత్య నాటకాలలోనూ స్త్రీల ప్రదర్శన నిషేధించబడినది. కూచిపూడి బ్రాహ్మణులు తమ ప్రదర్శనలకు భాగవతంనుండి యితివృత్తాలను ఎన్నుకోవడం వలన వీరికి కూచిపూడి భాగవతులు అని పేరువచ్చినది.

## భామా కలాపం

భామాకలాపం కృష్ణుని భార్య సత్యభామ నాయకిగా ఆమె ఒక్కర్తితోనే ప్రదర్శింపబడే ప్రదర్శన. భామాకలాపం అత్యద్భుతమైన కేళికగా, నాటకరచనలో పరాకాష్టగా భావించ బడుతున్నది. ఈ నాటకంలో నాథుని ఎడబాసిన సత్యభామ విరహవేదన చాలా విపులంగా వ్యక్తం చేయబడినది. సత్యభామను జీవాత్మగాను, కృష్ణుడిని పరమాత్మగాను తాత్వికధోరణిలో ప్రవచిస్తూ వుంటారు. సత్యభామ హృదయావేదనే జీవుని ఆవేదన.

ఈ ఒక్కచోటే సత్యభామ రంగస్థలం మీద కనిపిస్తుంది. ఆమెకు సేవకురాలిగా నటించే బృందనాయకుడే సూత్రధారి. సిద్ధేంద్రయోగి సత్యభామను ప్రేమకు, శృంగారానికి ప్రతిగా ప్రతిష్ఠించాడు. సత్యభామ పాత్రను ధరించేవ్యక్తి తప్పనిసరిగా నాట్యంలోనూ, అభినయంలోనూ సిద్ధహస్తుడై వుండాలి.

## గొల్ల కలాపం

కూచిపూడి ప్రదర్శనల్లో చేర్చదగిన మరోముఖ్యమైన కలాపం యిది. 19 వ శతాబ్ది చివరి నాల్గవ భాగంలో భాగవతుల బలరామయ్య దీనిని రచించారు.

ముఖ్యంగా యిది ఒక గొల్లవనితకు, బ్రాహ్మణునికి (సూత్రధారునికి) మధ్య జరిగిన తాత్విక సంభాషణ. వేదాంతం, ఆదర్శ కుటుంబ జీవనం, - వికాసం ఈ సంభాషణలో చర్చించబడినది. శ్రీమతి తరిగొండ వెంకమాంబ మరో గ్రంథాన్ని రచించింది. దీనిని దేవదాసీలు, రాజనర్తకిలు ప్రదర్శిస్తుండేవారు.

### వీధి నాటకాలు

తంజావూరు ప్రభువు అచ్యుతప్ప నాయక (1561-1614) కాలంలో కూచిపూడినుండి కొన్ని నాట్యాచార్యుల కుటుంబాలు తంజావూరుకు వలసవెళ్ళి 'ఆరాజుల పోషణలో మరోరకపు కొత్త నృత్య నాటకాలను వ్యాప్తిలోకి తెచ్చాయి. వీటిని వీధినాటకాలంటారు. ఈ నాటకాలలో, కలాపాలలోవలె కాకుండా, ప్రతిపాత్రా విడివిడిగా నటిస్తుంది. ప్రహ్లాద, రుక్మాంగద, ఉష, హరిశ్చంద్ర, మార్కండేయ, కంసవధ, నాటకాలు మెల్లట్టూరు నృత్య నాటకాలలో ప్రసిద్ధి కెక్కిన కొన్ని నాటకాలు మెల్లట్టూరు, కూచిపూడి ఆచార్యులు స్థిరపడిన ప్రదేశం.

సుమారు వందేళ్ళక్రిందట కూచిపూడి భాగవతులు యీరకపు వీధినాటకాలను చేపట్టి బాగా ప్రచారం చేశారు. మొట్టమొదటి నాటకంగా 'ప్రహ్లాదను' మూడు భాగాలుగా తీసుకున్నారు. ఆతర్వాత ఉషాపరిణయం, శశిరేఖా పరిణయం, హరిశ్చంద్ర, మోహినీ రుక్మాంగద, రామనాటకం, గయోపాఖ్యానం, రుక్మిణీ కళ్యాణాలను ప్రదర్శించారు,

ఇప్పుడు 'క్షీరసాగర మధనం, అనే కొత్త నృత్యనాటకం చేరడంతో వీరి ప్రదర్శనా నాటకాలలో మరోసంఖ్య పెరిగి దీనితో నృత్యనాటక ప్రదర్శనలో ఒక కొత్తశకం ఆరంభమైనది. కూచిపూడి చరిత్రలో ప్రప్రథమంగా స్త్రీలుకూడా నృత్యనాటక ప్రదర్శనల్లో పాల్గొనడం ప్రారంభించారు,

### ప్రదర్శన

కూచిపూడి నృత్య నాటకానికి రంగస్థలం ఆరుబయలు. ప్రేక్షకులు విశాలమైన ఆకాశం క్రింద మూడు వైపులా కూర్చుంటారు. నాలుగో వయిపున ఏ తెల్లనితెరో, రంగుతెరో వేలాడుతూ వుంటుంది. పూర్వపు రోజుల్లో కదిలే విధంగా తెరలు వుండేవి కావు. అందువల్ల తెల్లని గుడ్డను గాని, లేదా అలంకరించిన మరేదైనా గుడ్డనుగాని తొలగించే తెరగా వుపయోగిస్తుండేవారు. ఆముదపు దీపాలవల్ల వెలుగు లభించేది. తెర తొలగింపగానే, ప్రేక్షకులు పాత్రలను దూరంనించికూడా. సరిగా చూడడానికి వీలుగా, యీ దీపాల మీదకు గుగ్గిలం పొడిని జల్లుతుండే వారు. ఈ రోజుల్లో నయితే అధునాతన తెరల్ని. విద్యుద్దీపాలను వాడుతున్నారు.

ప్రార్థనానంతరం ఒక దూత వచ్చి రాజాగమనాన్ని తెలియజేస్తాథు. అంత, ఆరాజు రంగస్థలంమీదకువచ్చి తెరవెనుక నిలబడి తనపేరు, బిరుదు తెలియజేస్తాడు. దానితో తెర తొలగి నాటకం ప్రారంభమవుతుంది. సూత్రధారుడు నటులవెనుక నిలబడి నాటకాన్ని నిర్వహిస్తుంటాడు. పాత్ర చెప్పినదానిని సూత్రధారుడు గట్టిగా ఉచ్చరించి, దానిమీద వ్యాఖ్యానిస్తాడు. ఒక్కొక్కప్పుడు చిన్నచిన్న పాత్రలకు బదులుగా తనే నటిస్తాడు.

వాద్య బృందంలో మృదంగమో, పిల్లనగ్రోవోగాని 'తాంబురో' హార్మనియోగాని ఉండి యిద్దరుగాని అంతకన్న ఎక్కువగా గాని గాయకులు వుంటారు.

రాజులు, మంత్రులు, మిగిలినపాత్రలూ అందంగా తీర్చిదిద్దిన కిరీటాలతో, భుజకీర్తులతో, ఆభరణాలతో వారివారి యోగ్యతల కనుగుణంగా అలంకరించుకుంటారు. రాణులూ, మిగిలిన స్త్రీపాత్రలూ ధరించే ఆభరణాలు పూర్వకాలంనాడు ఆయా స్త్రీలు ధరించే ఆభరణాలకు నకళ్ళుగా వుంటాయి.

### కూచిపూడి ఏకపాత్ర నృత్యం

నృత్యనాటకాలే గాక కూచిపూడి భాగవతులు ప్రదర్శించేవాటిలో ఎన్నో ఏకపాత్ర నృత్యాలుకూడా వున్నాయి. వీటన్నిటినీ ఎంతగానో వీరు అభివృద్ధి పరిచారు.

జయదేవుని గీత గోవిందం, నారాయణ తీర్థుని కృష్ణలీలా తరంగం, క్షేత్రయ్య పదాలు ఏకపాత్ర నృత్యానికి చక్కగా సరిపోతాయి. అందుచేత కూచిపూడికళాకారులు యీ నృత్యగీతాలను తీసుకుని వాటిలో విశేష ప్రజ్ఞను సంపాదించారు. ఆతరువాత వీరు తమ ప్రదర్శనల్లో 'శబ్దాల'ను చేర్చారు. శబ్దాలు అనేవి క్లిష్టమైన నృత్యరీతులు. వీటిలో కొన్ని, ప్రతాపసింహుడు, దామెరసింహమేంద్ర భూపాలుడు మొదలయిన రాజులను కీర్తించేందుకని కూర్చబడ్డాయి. ప్రహ్లాద పట్టాభిషేకం, మండూక, రామ, దశావతారంఅనేవి ముఖ్యమైనశబ్దాలలోకొన్ని.

92 మాత్రలతోకూడిన వినాయకతలలోనూ, 108 మాత్రలతోకూడిన సింహనాదతలలోనూ చాలా ఆసక్తికరమైన ముఖ్యమైన నృత్యాలు వున్నాయి.

పూర్తిగా నీటితో నిండిన పాత్రను శిరస్సున వుంచి నృత్యం చేయడం మరో రకపు క్లిష్టమైన నృత్యం. ఈ నృత్యంచేసే వారు తలమీది పాత్రలోని నీరు ఒక్క చుక్కయినా చిందకుండ నృత్యంచేస్తారు. రాగిపళ్ళెం నృత్యం, దీపాల నృత్యం కూడా క్లిష్టమైనవే.

### ప్రదర్శన

ఈ ఏకపాత్ర నృత్య ప్రదర్శనల్లో నర్తకులు నృత్యానికి అనుగుణంగా వస్త్రధారణచేసి ఆభరణాల్ని అలంకరించుకుంటారు. నృత్యనాటకంలోని వాయిద్య సమ్మేళనమే దీనికికూడా సరి

పోతుంది. మొట్టమొదట కళాకారుని పూజతో ఈ ప్రదర్శన ప్రారంభమవుతుంది. ప్రతిపాటకు ఆంగిక, వాచక, సాత్వికాభినయాలలో భావ, రసాలను ప్రకటిస్తాడు. ప్రతి పదానికి అర్థాన్ని చేతులతో (హస్తముద్రలతో) తెలియజేస్తాడు. ప్రేక్షకులకు అర్థమయ్యేటట్టుగా రెండు హస్తాలనూ దగ్గరకుచేర్చి చెప్పదలచుకున్న అర్థంవచ్చేటట్టుగా అభినయిస్తాడు.

సాత్వికాభినయం ముఖంలో ప్రదర్శించబడుతుంది. కళాకారుడు పాటను వాచకాభినయంలో అభివ్యక్తం చేస్తాడు. ఈ నృత్యమేళం నాయకుడు గుర్తులను ఉచ్చరిస్తూ, 'తోంధిమి' అంటూ సూచనలు చేస్తూ నృత్యాన్ని నిర్వహిస్తాడు.

ఈ ఏకపాత్రనృత్యాలు, పూర్తి నృత్య-నాటకాలతోపాటు కూచిపూడి కళాకారులు 'దాదినమ్మ వేషం, బాలింత వేషం, అర్ధనారీశ్వర వేషం' లాంటి విరామకాల నృత్యాలు కూడా వేస్తుంటారు. వీటిని చిన్న కలాపాలుగా పేర్కొనవచ్చు.

ఇటీవలి కాలంలో యువతరం వారు చాలామంది స్త్రీ పురుష వయో జాతిమత భేధాలు లేకుండా యీ కూచిపూడి నృత్యాన్ని అభ్యసించి ప్రచారం చేస్తున్నారు.

## నట్టువ మేళం

నట్టువమేళం నాట్యమేళం కన్నా చాలా పురాతనమైనదనిపిస్తుంది. మతాన్ని ఆసరాచేసుకుని నట్టువమేళం తలయెత్తింది.. దేవుడిని నృత్యంద్వారా ఆరాధిస్తానని ప్రతిజ్ఞ తీసుకునే దేవదాసీలు; రాజుల దర్బారుల్లోనూ, జమీందారుల దర్బారుల్లోనూ నాట్యం చేసే నర్తకిలు యీ నట్టువమేళానికి చెందినవారు. దీనిలో స్త్రీ లే నృత్యం చేస్తారు. పురుషులు సూత్రధారులుగా వుంటారు. నాట్యమేళంవలె నట్టువమేళం కూడా కొద్దిపాటి తేడాతో భరతనాట్య సూత్రాలనే పాటిస్తుంది.

నట్టువమేళాలను ముఖ్యంగా (1) ఆరాధన నృత్యం అనీ (2) దర్బారు నృత్యం అనీ రెండు వర్గాలుగా విభజించవచ్చు.

**ఆరాధన నృత్యం :**

భగవంతుని ఆరాధనే యీ నృత్యం యొక్క ప్రధాన ఆశయం. దేవదాసీలు దేవాలయంలో కళ్యాణ మండపానికి ఎదుట వివిధ దేవతలను పొగుడుతూ నృత్యం చేస్తుంటారు. శివాలయాలలో ఇందుకు 'బలిపీఠం' అనబడే చిన్న వేదికను ఉపయోగిస్తుంటారు. విఘ్నాధిపతి విఘ్నేశ్వరుని పూజతో యీ నాట్యం ప్రారంభ మవుతుంది. ఆ తర్వాత పుష్పారాధన, మిగిలినవి ప్రారంభ మవుతాయి. సందర్భాన్నిబట్టి, ఆచారాలనుబట్టి వాటి కనుగుణంగా దేవదాసీలు నృత్యం చేస్తారు. వీటికితోడు ప్రత్యేక సమయాలలో, పండుగ దినాలలో ప్రత్యేకంగా నృత్యంచేస్తారు. దేవుడిని గుడి చుట్టూ ప్రదక్షిణలు చేయించేటప్పుడు అష్టదిక్పాలకులనూ ఆరాధించే 'అష్టదిక్పాలక నృత్యాన్ని' చేస్తారు. మొత్తం ఈ రకమైన నలభై నృత్యాలు ఆంధ్ర దేశంలో వున్నాయి.

కూచిపూడి కళాకారుల సహచర్యం కారణంగా దేవదాసీలు భామాకలాపాన్ని కూడా కొద్దిపాటి మార్పులతో ప్రదర్శించడం ప్రారంభించారు. కొంతమంది నారాయణ తీర్థుని పారుజాత నాటకాన్ని ప్రదర్శిస్తుండే వారు. కాని వాటి ధోరణీ; తిరుమణాలకు, శబ్దాలకు దేవదాసీలు యిచ్చే నిర్వచనాలూ కూచిపూడి వారి వలె వుండేవి కావు.

ఇప్పుడిప్పుడు ఆరాధన నృత్యాన్ని, నృత్యనాటకాన్ని నట్టువమేళంధోరణిలో తొల్లిటి ప్రాభవాన్ని కల్పించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

**దర్బారు నృత్యాలు :**

పూర్వపు రోజుల్లో రాజులు, జమీందారులు దర్బారు నర్తకినులను పెట్టుకోవడం ఒక ఆచారంగా వుండేది. వారు దర్బారులో రాజు ఎదుట నృత్యం చేస్తుండే వారు. పండుగ దినాల్లోనూ నృత్యం చేసేవారు. ఈ నృత్యాలు కూడా శాస్త్రీయనృత్యాల కోవకు చెందుతాయి.

ఈ నృత్యాలలో జయదేవుని గీతాలను, నారాయణ తీర్థుల పాటలను, క్షేత్రయ్య పదాలను, తమతమరాజులను పొగుడుతూ ప్రత్యేకంగావ్రాసిన పాటలను నర్తకిలు నృత్యరూపంలో అభినయిస్తుంటారు.

కాలక్రమేణా దేవదాసీలు, రాజ నర్తకిలు కూడా, చవకబారు అభినందనలను ఆకట్టుకోవడానికి ఉన్నత ప్రమాణాలనుండి పతనమయి జుగుప్సాకరమైన గీతాలను గానం చేయడం ప్రారంభించడం వలన, క్రమంగా నాట్యకళ దాని ఔన్నత్యాన్నే కోల్పోయే స్థితికి దిగజారిపోయింది.

## జానపద నృత్యాలు

జానపదకళలు శ్రమనుండి ఉద్భవించాయని సాధారణంగా కళా విమర్శకులు అభిప్రాయ పడుతుంటారు. మానవ పరిణామంలో మనిషి తన జీవితాన్ని, దృక్పథాన్ని మలచుకోవడానికి పరిశ్రమ ఎంతగానో దోహదకారి యైనది. వృత్తి పని జానపద కళల పుట్టుకకు ప్రధాన ఆలంబనం. ఉదాహరణకు, వేట వృత్తిగాగల మనిషి వేటాడి పెద్దపులిని ఒకదానిని చంపాడనుకుందాం. అతని కుటుంబంలోని వారూ, బంధువులూ వేటగురించి తెలుసుకోవడానికని అవ్యక్తి తను ఎలా వేటాడాడో ఆ విషయాన్నంతా విశదంగా వారికి తెలియజేస్తాడు. వేటనుగురించి చెప్పే యీ వివరణ క్రమంగా వేటనృత్యానికి నాంది ఐనది. ఆ విధంగానే వ్యవసాయం

ఎన్నో జానపద నృత్యాల పుట్టుకకు కారణమైనది. వాతావరణము, మతము, భౌగోళిక పరిస్థితులు యీ నృత్యాలను తీర్చిదిద్దాయి.

సోమనాథుడు, శ్రీనాథుడు, జాయప సేనాని మొదలయిన వారి రచనలవల్ల ప్రాచీన కాలంనుండికూడా ఆంధ్ర దేశంలో జానపదనృత్యాలు వెల్లివిరిసా యనే విషయం వ్యక్త పడుతున్నది.

జానపద నృత్యాలను సప్తవర్గాలుగా విభజించవచ్చు.

(1) సాంప్రదాయక నృత్యాలు (2) పండుగ నృత్యాలు (3) ఆరాధనా నృత్యాలు (4) వీరనృత్యాలు (5) ఆటవిక నృత్యాలు (6) ఉల్లాస నృత్యాలు (7) ఋతు నృత్యాలు.

**సాంప్రదాయక నృత్యాలు :**

ఈ నృత్యాలు సామాన్యుడి జీవితంతో ముడివేసి వుంటాయి. మనిషి జీవితంలో పుట్టుకనుండి చావువరకూ అన్ని ముఖ్య ఘట్టాలలోనూ ప్రజలు నృత్యబృందాలను ఏర్పాటు చేస్తుంటారు. ఈ బృందాలు ప్రత్యేకించి ఆయాసమయాలకు సంబంధించిననృత్యాలు చేస్తుంటాయి. శవాన్ని ఊరేగింపుగా స్మశాన స్థలికి కొనిపోయే టప్పుడు 'జోగాట' అనే సాంప్రదాయక నృత్యం చేస్తారు. ఈ నృత్యంలో మనిషి 'పుట్టుకనుండి చావువరకూ వున్న జీవిత మంతా సన్నాయి, డప్పులాంటి గ్రామీణ వాయిద్యాల సంగీతంతో మేళవించి చెప్పబడుతుంది. గంగానమ్మ, పోలేరమ్మవంటి గ్రామదేవతల ఉత్సవాలలో హరిజనులు కత్తిని చేతిలో ధరించి దేవత ఎదుట నృత్యం చేస్తుంటారు.

**పండుగ నృత్యాలు :**

బతుకమ్మ, గొబ్బి, దసరా మొదలయిన పండుగలలో చేసేనృత్యాలుయివి. బాలికలు ఆవుపేడతో ఉండలుచేసి, వాటిని పూలతో అర్చించి, ఆ వుండలను యింటి ముందువుంచి; వాటిచుట్టూ తిరుగుతూ నృత్యం చేస్తుంటారు. కొన్నికొన్ని ప్రాంతాలలో యీ సమయంలో వాయిద్యాలనుకూడా వాడుతూ వుంటారు.

దసరారోజుల్లో హరిజనులు గుర్రపు నృత్యం చేస్తారు. వీరుడుగానో, రాజుగానో అలంకరించుకుని, కర్రగుర్రాన్ని ఎక్కి, వీధులవెంట నృత్యం చేసుకుంటూ వెళ్తారు.

మొహరం ఉత్సవాల్లో కొంతమంది పెద్దపులులుగా, ఎలుగు గొడ్డులుగా, వేటగాండ్రుగా వేషంవేసుకుని వేట నృత్యం చేస్తారు.

**ఆరాధనా నృత్యాలు :**

చెక్కల భజన, తాళభజన, చిరతల భజన, తప్పెట భజన, కోలాట భజన ఈ కోవకుచెందిన నృత్యాలు. భక్తులు దేవుడిని గురించి పాటలుపాడుతూ, చుట్టు తిరుగుతూ నృత్యంచేస్తారు. చెక్కభజనలో రామాయణ, భారత, భాగవతాలనుండి యితి వృత్తాలను తీసుకుని నృత్య నాటకాలుగా ప్రదర్శిస్తారు.

ఈ రకంలో మైరావణనృత్యనాటకం బాగా ప్రసిద్ధిచెందినది. ఇందులో భజన తాళాలబదులు చెక్కలు ఉపయోగిస్తారు. పాత్రధారులందరూ గుండ్రంగా వృత్తాకారంలో నిలబడతారు. వారిలో ఒకడు ముందుకువచ్చి మధ్యలోనిలబడి అభినయ పూర్వకంగా ఏదో ఉచ్చరిస్తాడు. ఆపైన, బృందం నాయకుడు పాటను ప్రారంభిస్తే మిగిలిన వారంతా బృందగానంలా అనుసరిస్తారు. తాళానికి లయబద్ధంగా అడుగులు వేస్తూ గుండ్రంగా తిరుగుతారు. అలా వాళ్ళనృత్యం సాగుతుంది.

చిరతల భజనలో పాల్గొనే వారు గుండ్రంగా నిలబడి, పాట ప్రారంభించి, రెండు వృత్తాలుగా విడిపోయి ఒకరికొకరు ఎదురెదురుగా నిలబడి, ఒకరి చిరతలను మరొకరు బాదుతూ నృత్యంచేస్తున్నట్టుగా అడుగులు వేస్తూ గుండ్రంగా తిరుగుతారు.

వైగంటభాగవతులుకూడా యీ కోవకు చెందినవారే.

**వీర నృత్యాలు :**

ఆంధ్రదేశంలో శైవులు 'వీరభద్రుని పళ్ళెం' అనే కత్తినృత్యాన్ని చేస్తారు. ఒక చేతితో కత్తిపట్టుకొని, మరోచేత్తో రాగిడాలు పట్టుకుని 'అస్సరభ సరభ' అని అరుస్తూ వెనక్కూ ముందుకూఊగుతూ నృత్యం చేస్తుంటారు.

హైదరాబాదు ప్రాంతపు 'సిద్దీలు' మరోరకపుకత్తిసాముచేస్తారు. గుండ్రంగా వృత్తాకారంలో నిలబడి, వాయిద్యాలకు అనుగుణంగా కత్తిని అటూ యిటూతిప్పి విన్యాసం చేస్తారు. సంగీతం పరాకాష్ఠ నందుకోగానే వారు కత్తులను నోటితో బిగించి పట్టుకుని, పైకి క్రిందకూ ఎగురుతారు.

**ఆటవిక నృత్యాలు :**

ఇవి రాజగోండ, చెంచు, లంబాడీల లాంటి ఆటవికప్రజల నృత్యాలు. వీటిలో చాలామట్టుకు బృంద నృత్యాలే. రాజగోండలు అడవుల్లో నివసిస్తుంటారు. వీళ్ళ నృత్యాలను గసడి, దండ్రి అంటారు. నృత్యం చేసేటప్పుడు వీరు 'సెల్లా' లను ధరిస్తారు. కుర్రాళ్ళు స్త్రీ వేషాలను వేస్తారు. వీరు చిన్నచిన్న అద్దాలు, ముత్యాలు, కొమ్ములు మొదలయిన వాటితో అలంకరించిన పొడుగుటోపీలను ధరిస్తారు. ఈ టోపీనే గసడీ అంటారు. ఈ పేరే ఆ నృత్యానికి పెట్టబడినది.

గసడీనృత్యం ప్రారంభంలో అంతా రెండు వృత్తాకారాల్లో నిలుచుంటారు. ఒక వృత్తంలోని నర్తకులు రెండో వృత్తంలోని వారి చుట్టూ తిరుగుతారు. ఆ విధంగానే రెండో వృత్తంలోనివారూ మొదటి వృత్తంలోని వారిచుట్టూ తిరుగుతారు. ఒక వృత్తంలోని నర్తకులు రెండో వృత్తంలోని వారితో కలిపి తప్పట్లు

చరుస్తారు. దీనిలో మొత్తం యాభై మంది వరకూ పాల్గొంటారు.

**ఉల్లాస నృత్యాలు :**

ఉల్లాసం కొరకు సాధారణంగా బాల బాలికలుకలిసి యీ నృత్యం చేస్తుంటారు. బాల బాలికలు తప్పట్లు చరుస్తూ, గంతులేస్తూ పిల్లల పాటలు పాడుతుంటారు. కోలాటం, జడకొప్పులుకూడా యీ కోవకు చెందుతాయి.

**ఋతు నృత్యాలు :**

ఈ నృత్యాలు వివిధ ఋతువుల్లో వ్యవసాయదారుల నిత్యజీవితాన్ని ప్రతిబింబిస్తాయి. వీటన్నిటిలో 'పంట సిరి నృత్యం' అన్నిటికన్నా ఎక్కువప్రచారం గలదీ, అత్యాకర్షకమైనదీనూ. ఇది కూడా బృందనృత్యం. కోతల సమయంలో కొడవళ్ళు చేత్తో పట్టుకొని పని చేస్తునట్లు యీ నర్తకులు ప్రదర్శిస్తారు.

## జానపద నృత్య నాటకం

యక్షగానం అన్ని జానపదనృత్య నాటకాలకు మూలాధారమని భావించబడుతున్నది. యక్షగానం అంటే యక్షుల సంగీతం అన్నమాట. ఇది ఆంధ్రదేశంలో జక్కులు అనబడే ఒకజాతివారు ప్రదర్శించే జానపద నాటక రీతని సంగీత ప్రవీణులు చెప్తారు. 'క్రీడాభిరామం'లో మహాకవి శ్రీనాథుడు ఒక జక్కులస్త్రీ పదర్శనను వర్ణించాడు. నృత్యం చేయడానికి వీలుగా ఆమె వస్త్రాల్ని ధరిస్తుంది. ఆమె నృత్యంచేస్తూ పాటపాడుతూ ఒక కథను చెప్తుంది. ఆతర్వాత మిగతా పాత్రలు ప్రవేశిస్తాయి. వాటికి సంభాషణలుకూడా కూర్చబడ్డాయి. క్రమక్రమంగా యక్షగానం సర్వతోముఖమైన నృత్య నాటకంగా అభివృద్ధి చెందినది. ఇందులో ప్రయోగించబడుతున్న సంగీతము, నృత్యము దేశీయమైనది. గరుడాచల యక్షగానము, సుగ్రీవ విజయము బహుపురాతనమైన యక్షగానాలు.

సర్వతోముఖమైన యక్షగాన నృత్య నాటకాలు తంజావూరు రాజుల అధ్వర్యంలో ఖ్యాతిలోకి వచ్చాయి. తంజావూరు పరిపాలకులయిన విజయరాఘవ నాయక వంటి నాయక రాజులు, సహ రాజులవంటి మహారాష్ట్ర ప్రభువులుకూడా చాలా యక్షగానాలను రచించారు. కాని తంజావూరు యక్షగానాలలో భాష అంత వినసొంపుగా వుండదు.

యాదవ భాగవతులు, మాల భాగవతులు, యానాది భాగవతులు యీ రకపు నృత్య నాటకాలను ప్రదర్శిస్తారు. గరుడాచల నాటకం, లేపాక్షి కృష్ణ నాటకం, సారంగధర నాటకం, విరాట పర్వ నాటకం బాగా ప్రసిద్ధికెక్కిన నాటకాలు. తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయంలో నలభై పై చిలుకు యక్షగాన వ్రాతప్రతులు ప్రస్తుతం వున్నాయి. నిజం చెప్పాలంటే ఆంధ్రదేశంలోని జానపద నృత్యాలు మిగతా ప్రాంతాలవాటికన్నా వస్తుతః అతిసాధారణమైనవీ, వాస్తవమైనవీ, స్వతంత్రమైనవీనూ. ఈ జానపద నృత్యాలు ప్రజల ఉత్సాహాభినివేశాలను నేరుగా వ్యక్తం చేసే సాధనాలు.

# జానపద నృత్యాలు: మరికొన్ని విశేషాలు

*బి. రామరాజు*

ఆంధ్రదేశంలో వివిధ జానపద కళా రూపాలు-అంటే సాహిత్యం, సంగీతం, నృత్యం, చిత్రలేఖనం మొదలైన వన్నీ ఎంతో ప్రాచీనకాలంనుండే ప్రచారంలో ఉన్నట్లు మన కనేకాధారాలున్నవి. నన్నెచోడుని కుమారసంభవమూ, పాల్కురికి సోమనాథుని బసవ పురాణమూ, పండితారాధ్య చరిత్రమూ ఇందుకు సాక్ష్యాలు. మార్గసంప్రదాయానికి భిన్నమైన ఈ దేశీయ జానపద నృత్యాలను, వానికాశ్రయమిచ్చిన జనాన్ని బట్టి, మూడు తరగతులుగా విభజించవచ్చు.

1. మొదటి తరగతివి - సంస్కారం కొంత ఎక్కువగా ఉన్నవాళ్ళకు సంబంధించినవి. కురవంజి, యక్షగానం, జిక్కిణి, గొండి, జంగంకథ, వీధిభాగవతం మొదలైనవన్నీ ఈ తరగతిలోనికి వచ్చే నృత్యాలు. వీనిలో సంగీత సాహిత్యాలకు కూడ ఎక్కువ ప్రమేయం ఉన్నది. కురవంజి, యక్షగానమూ ప్రారంభదశలో అచ్చపు జానపద నృత్యాలైనా, రానురాను సంగీత సాహిత్యాలు, శాస్త్రపు కట్టుబాట్లు, సాత్వికాహార్యాంగికాభినయాలు కలిసి మార్గ సంప్రదాయంతో పోటీ పడుతున్నట్లు మారిపోయిన కళారూపాలు. తొలిదశలో ఇవి ఏకపాత్రాభినయాలు. కాని ఈ నాటి పరస్థితి తారుమారైనది.

2. రెండవతరగతివి - అచ్చపు జానపదనృత్యాలు. చిందు భాగవతులు, గొల్లసుద్దులు, బుట్టబొమ్మల నృత్యాలు, చిరుతల భజనలు, చెక్క భజనలు, కోలాటాలు, బొడ్డెమ్మ, బతుకమ్మ, గొబ్బి మొదలైన కుండలాకార నృత్యాలు, డేగాట నృత్యాలు, మాదిగవారి జోగాటలు, లెల్లపదాల నృత్యాలు, జేగంట భాగవతులు, గంటెభాగవతులు, గొల్ల భాగవతులు, జాలరులు, గొరగలు ప్రదర్శించేవన్నీ నృత్యానికే అధిక ప్రాధా

న్యం ఇచ్చే జానపద నృత్యాలు. వీనిలో సంగీత సాహిత్యాల పాళ్ళు కొంచం తక్కువగా ఉంటవి.

3. మూడవ తరగతివి - ఆటవికుల, అనాగరికజాతుల నృత్యాలు. ఆంధ్ర దేశంలో చెంచులు, కోయలు, గోండుల వంటి ఆటవికజాతులు; లంబాడి, ఎరుకల, యానాదివంటి అనాగరకజాతులు ఉన్నవి. ఆటవిక జాతులవారికి జీవితంలో నృత్యం ఒక భాగం. పుట్టుకకు, బారసాలకు, పెండ్లికి, విందుకు, ఆతిథ్యానికి, వేటకు, పండుగలకు చివరకు అంత్యక్రియలకు కూడా - ఈ విధంగా జీవితంలోని ప్రతి సంఘటనకూ నృత్యం వెన్నంటి ఉంటుంది. ఒక్కొక్క ఋతువుకు ఒక్కొక్క నృత్యం ప్రదర్శిస్తారు. పొలందున్నటం ఆరంభించినప్పటినుండి పంటలు ఇల్లు చేరుకొనేదాకా ప్రతిపనికి ముందు నృత్యం ఉంటుంది. ఆటవికుల, అనాగరికుల నృత్యాలు కేవలం తాళలయాశ్రితాలు. వీటిని నృత్తాలనవచ్చు.

ఈ మూడు తరగతులవారి నృత్యాలను ఆయానృత్యాల స్వభావాలనుబట్టి ఆరాధననృత్యాలనీ, వినోదనృత్యాలనీ, ప్రచారక నృత్యాలనీ మూడువిధాలుగా విభజించవచ్చు. ఈ మూడు విధాల నృత్యాలను గూర్చి కొంత విపులంగా మనవిచేస్తాను.

*1. ఆరాధన నృత్యాలు:—* మార్గ సంప్రదాయంలోవలెనే ఆయా దేవతల ప్రీతికై, మంగళాన్ని శుభాన్ని ఆకాంక్షించి చేసేవి ఆగాధన నృత్యాలు. ఇవి ఒక పండుగునుకాని, ఒక ఋతువును కాని, ఒక ఉత్సవాన్నికాని, ఒక దేవతనుకాని పురస్కరించుకొని చేసేవి. తెలంగాణా, రాయలసీమల్లో బొడ్డెమ్మ బతుకమ్మ పండుగలప్పుడునూ, సాగరాంధ్రంలో సంక్రాంతి పండుగప్పుడూ చేసే కుండలాకారనృత్యాలు, గొబ్బినృత్యాలు మొదలైనవన్నీ ఆరాధన నృత్యాలే.

బొడ్డెమ్మ పండుగ పెండ్లికాని ఆడపిల్లల పండుగు. ఇది తొమ్మిది దినాలుంటుంది. పితృ అమావాస్యతో ఐపోతుంది. అటుతరువాత ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి మహార్నవమి వరకు బతుకమ్మ పండుగ. ఇది పిన్నలూ, పెద్దలూ, అన్ని వర్గాల ఆడవాళ్ళు చేసుకొనే పండుగు. ఈ రెండు పండుగులూ లక్ష్మీ పార్వతుల సమారాధనలు. బొడ్డెమ్మను మధ్యలో పెట్టి చుట్టూ కన్యకలూ, బతుకమ్మలను మధ్యలో పెట్టి చుట్టూ పిన్నలూ పెద్దలూ కుండలాకారంగా తిరుగుతూ, అడుగులు వేస్తూ, చేతులతో చప్పట్లు చరుస్తూ, ఒక్కొక్కప్పుడు కుడిఎడమలకు వంగుతూ వాలుతూ, మరొకప్పుడు ముందుకు వంగి వెనుకకు లేస్తూ పాడుతూ నృత్యం చేస్తారు. సాగరాంధ్రంలో పెండ గొబ్బెమ్మలను మధ్యనపెట్టి ధనుర్మాసంలో చేసే గొబ్బినృత్యం కూడ ఇట్టిదే. ఉత్తరాది వాళ్ళ 'గర్భోనృత్యం' మన 'గొబ్బి నృత్యం' ఒకటేనని పండితుల అభిప్రాయం.

సింహాచలస్వామి సేవలో బృందనాయకుడు నెమిలికుంచె పట్టుకొని "నాయు'' చెప్పుతుంటే తక్కినవాళ్ళు వలయాకారంగా ఉండి తాళాలు వాయిస్తూ పాడుతూ నాట్యంచేస్తారు. దేవీ నవరాత్రుల సందర్భంగా అమ్మవారి జాతర్లలో పంచశిరస్సుల నాగులతో రంగురంగుల బట్టలతో అలంకరించిన బిందెలను నెత్తినపెట్టుకొని డప్పులచప్పుళ్లకనుగుణంగా 'గరగనృత్యాలు' చేస్తారు. కాకినాడ ప్రాంతాల్లో దీనికి ప్రచారమధికం. విశాఖ జిల్లాలో 'తప్పటగుండు' అనేనృత్యం బాగా ప్రచారంలోఉంది. పురుషులు మెడలకు తప్పెట్లు కట్టుకొని వాని మీద తాళలయలు ప్రదర్శిస్తూ వలయాకారంగా తిరుగుతూ నృత్యం చేస్తారు. ఇదికూడ అమ్మవారి కొలుపులప్పుడు ప్రదర్శించే ఆరాధన నృత్యమే.

శీరాంధ్రంలో సముద్రతీరపు పల్లెల్లో ఉండే జాలరివాళ్ళు వరుణదేవుని ప్రీత్యర్థమై గొప్ప పండుగుచేస్తారు. "చేపలపంట" కొరకూ, చేపల వేటకు వెళ్ళి సముద్రంనుండి సురక్షితంగా తిరిగిరావటానికీ, జాలరులీ పూజలు చేస్తారు. చేటల్లో, మొంటెల్లో పసుపు కుంకుమలూ, వక్కలాకులూ, కొత్తబట్టలూ, నెత్తిమీద బిందెల్లో నీళ్ళు, వంటకాలు పట్టుకొని సముద్రుణ్ణిపూజించి నృత్యాలు చేస్తారు. ఆటుపోటుకు లేచే కడలి కెరటాలవలె, వానిమీద ఫేనఖండాలవలె, వారి కాళ్ళ కదలికలూ హస్తవిన్యాసాలు చూస్తుంటే జలదేవతలు సముద్రంనుండి వెలికి వచ్చి నృత్యంచేస్తున్నట్లుంటుంది. బాపట్ల రేవుదగ్గరా, ఉప్పాడరేవుదగ్గరా ఈ నృత్యాలుపూజలు చాలా వైభవంగా జరుపు కుంటారు.

తెలుగుదేశంలో వీరశైవం ముమ్మరంగా ఉన్నప్పుడు వీరశైవభక్తులు తాండవపద్ధతికి చెందిన వీరనాట్యాలుచేసేవారు. ఒకచేత డాలు మరొకచేత కత్తి పట్టుకొని 'ఖడ్గాలు' చదువుతూ, డోళ్ళు మద్దెలలు, జేగంటలు, వీరణాలు మున్నగు వాద్యాల చప్పుళ్ళతో నృత్యంచేసేవారు. యుద్ధనాట్యాన్ని పోలిన ఈ వీర రసోచిత నృత్యం ఇప్పటికీ జంగాలు, వీరముష్టులు, బలిజలు మున్నగువారు శివరాత్రి ఉత్సవాలప్పుడు తెలంగాణాయందలి కొత్తకొండ, వేములవాడ, కొమిరెల్లి, ఐలోని, మున్నగు శైవ క్షేత్రాలల్లో ప్రదర్శిస్తుంటారు. కొత్తకొండ వీరభద్రేశ్వర క్షేత్రము అచ్చట వీరోచితనృత్యాలు, అగ్గిగుండాలు త్రొక్కడం మున్నగునవి ఇప్పటికీ ఏటేటా జరుగుతుంటవి. మైలార దేవుని ఉత్సవాలప్పుడు మైలార భటులు వీరనృత్యాలు, గొరగపడుచుల నృత్యాలు ఐలోని క్షేత్రంలో చూడవచ్చు. హైద్రాబాదు సికింద్రాబాము పట్టణాల్లోని శక్తి దేవతలకు మహంకాళికి బోనాలు తీసే సమయాన చేసేవన్నీ ఆరాధన నృత్యాలే.

పల్నాటి యుద్ధంలో వీరస్వర్గం అలంకరించిన ఆంధ్రవీరులను స్మరిస్తూ కారెంపూడి, మాచెర్ల, గురిజాల మున్నగు ప్రాంతాల్లో ఏటేటా వీరుల కొలువులు చేస్తారు. అప్పుడు ప్రదర్శించే ఆరాధన నృత్యాలు కూడా తాండవ పద్ధతికి చెందినవే. ఎల్లమ్మ-రేణుకాదేవి కొలుపులు చేసే వారు, బవనీలు — పంబలు — జమిడికలు వాయిస్తూ ఎల్లమ్మ పాటలు పాడుతూ చేసే నృత్యాలు కూడ వీర రసోచితమైన ఆరాధన నృత్యాలు. గోదావరి జిల్లాలో ఉండే కోయలూ, ఆదిలాబాదు అడవుల్లో ఉండే గోండులూ ఆయాదేవతల ప్రీతికై, పాడిపంటల అభివద్ధికై చేసేవి "ఖర్మ" నృత్యాలు. ఈ "ఖర్మ" నృత్యాలు ప్రపంచమందలి ప్రతి ఆటవికజాతికి ఉన్నవే. ఒక్కొక్క జాతి, వానిని ఒక్కొక్క తీరుగా ప్రదర్శిస్తుంది. ఇవి ప్రకృతిని అనుకరించిచేసే నృత్యాలు. ఆటవికులు ప్రకృత్యుపాసకులు. ఆయా ఋతువుల ప్రకృతులకు తగిన ఆహార్యాలు ధరించి వారి నృత్యాలు చేస్తారు. కోయవారి వృషభ నృత్యము, గోండులహోళీ నృత్యము చాలా ప్రసిద్ధమైనవి.

**2. వినోద నృత్యాలు :—** మార్గ సంప్రదాయంలో వినోద నృత్యాలున్నట్లే జానపదులకు కూడ, కేవలం వినోదం కోసం-వేడుకకోసం చేసే వినోద నృత్యాలున్నవి. పనిపాటలులేని తీరిక సమయాల్లో, శరద్రాత్రుల్లో, వేడుక సమయాల్లో, విందుల సమయాల్లో, సంతలు సాగినప్పుడు ఇవి ప్రదర్శిస్తారు. కోలాటములు, బుట్టబొమ్మల నృత్యాలు, చెక్కభజనలు, చిరుతల నృత్యాలు, గుఱ్ఱపు నృత్యాలు, పెద్దపులి నాట్యాలు మొదలైనవన్నీ వినోదనృత్యాలు.

కోలాటములు పురుషులువేరే స్త్రీలు వేరే వేస్తారు. స్త్రీల కోలాటములు కొంత కోమలంగాఉంటవి. పురుషుల కోలాటపు కోపులు ఉద్ధతంగాను, చిత్రవిచిత్రపు గతులతోను ఉంటవి. సమ, విషమ, వికట నృత్తరీతులన్నీ ఈ పురుషుల కోలాటాల్లో చూడవచ్చు. కోలాటముల్లో సంగీతము సాహిత్యము, నృత్యము, మూడూ సమపాళంలోఉంటవి. ఎగురుతూ, కూర్చుంటూ, గఱ్ఱున తిరుగుతూ దావటికీ వలపటికీ సవ్యంగా అపసవ్యంగా కోలలు తడుతూ,ఏకవలయంగా, వలయంలో వలయంగా, ఒకేవలయంనుండి చీలిచిన్నచిన్న వలయాలుగా ఏర్పడిచేసే బృందనాట్యమీ కోలాటం. కోలాటం ద్రుతగతితో సాగినప్పుడు చూడ ముచ్చటగా ఉంటుంది. నల్లగొండ, పాలమూరు మండలాల్లో "జడకోలాటం" బాగా ప్రచారంలో ఉన్నది. దీనిని కన్నడిగలు "వేణికోలాటం" అంటారు. ఊరిబయట ఊడల మట్టి క్రిందనో, రచ్చవీధి చావడి చింత క్రిందనో జడకోలాటం వేస్తారు. పైన చెట్టుకొమ్మకు ఒక చోట సన్నపు త్రాళ్ళు కట్టి కోలాటం వేసేవారు. ఒక్కొక్కరు ఒక్కొక్క త్రాడును తమ నడుములకు గాని చేతులకుగాని కట్టుకుంటారు. వారి నృత్య విన్యాసంలో ఒకరి ప్రక్కనుండి చీలి మరొకరి ప్రక్కన చేరటంలో ఆ త్రాళ్ళు ఒక జడవలె అల్లుకొంటవి. ఆ కోలాటమే తిరిగి అపసవ్యంగా వేస్తే జడ విచ్చుకపోతుంది. అందుకే దీనికి జడకోలాటం అనిపేరు. ఇందులో ఏమాత్రం క్రమభంగం జరిగినా జడ అల్లటం కాని విప్పటం కాని సాధ్యంకాదు. అఖిల భారత యువజనోత్సవాల్లో కన్నడ విద్యార్థులు విద్యార్థినులూ రంగురంగుల దుస్తులు ధరించి రంగు రంగుల రిబ్బన్లు నడుములకు కట్టుకొని స్టేజీలమీద ఈ వేణీ కోలాటాన్ని ప్రదర్శించి మెప్పు పొందినారు. తెలుగు నాగరికులకీ నృత్యం పట్టుబడలేదు.

ఆంధ్రదేశంలో బుట్టబొమ్మల నృత్యాలు చాలా ప్రచారంలో ఉన్నవి. తిరునాళ్ళప్పుడు పెండ్లిండ్ల ఊరేగింపులప్పుడు వారంవారం సంతలు జరిగే చోటా, ఉత్సవాలప్పుడు, దేవుని "శావలు" తీసేటప్పుడూ, ఈ బుట్ట బొమ్మల నృత్యాలు ప్రదర్శిస్తారు. స్త్రీ పురుషులవి, జంతువులవి పెద్దపెద్ద బొమ్మలు, కాగితపుకూటు, పెండ, చెక్కపొట్టు మొదలైనవానితో చేసి రంగులు వేస్తారు. ఈ బొమ్మలు లోపల డొల్లగా వుంటవి. కండ్లు, ముక్కు, నోరు కాళ్ళదగ్గర, కడుపులో ఈ బొమ్మలకు రంధ్రాలుంటవి. నృత్యంచేసేవాళ్ళీ బొమ్మల్లోదూరి అనువైన వాద్యాల చప్పుళ్ళతో — ప్రత్యేకంగా డప్పు చప్పుళ్ళతో—నాట్యాలు చేస్తారు. ఆ బొమ్మలే నాట్యంచేస్తున్నట్లు మనకు కనపడుతుంది. తెలంగాణాలో పెద్దమ్మలవాళ్ళు ముఖాలకు మాత్రం శక్తిముఖం బొమ్మనో లేదా పెద్దపులిముఖం బొమ్మనో తొడుక్కొని నాట్యం చేస్తారు. పీరల పండుగ లప్పుడు దసరా దీపావళీ పండుగలప్పుడు పులివేషాలు వేసి డప్పుచప్పుళ్ళతో వీర రసోచితమైన పులినాట్యాలు చేస్తారు. హైద్రాబాదు, సికింద్రాబాదు పట్టణాల్లో దీపావళి సందర్భంగా బత్తెలకూ దున్నపోతులకూ రంగులువేసి ఢంకాలు, డప్పులూ వాయించుతూ పాలవాళ్ళుచేసే వీర రసోచితమైన నాట్యాలుకూడ పులినాట్యాలకు అనుకరణములే. పులి నాట్యానికి కొంచెం"వీరపానం" కూడ అవసరం. పెండ్లిండ్లలో ప్రదర్శించే డేగాట నృత్యంకూడ వినోద నృత్యమే. తెలంగాణా పల్లెల్లో ఆరెవాండ్లు, కోమట్లు ఈ డేగాట సంప్రదాయాన్ని పాటిస్తారు. పెండ్లిపిల్లనొకరూ, పిల్లవాణ్ణి మరొకరూ ఎత్తుకొని 'డేగాట'ఆడుతారు. ఆటకుతోడుపాట,వాద్యం కూడ ఉంటవి.

మాదిగవారి డప్పుచప్పుళ్ళు చాలా వీర రసోచితంగా ఉంటవి. డప్పులనే కొన్ని ప్రాంతాల్లో కనకతప్పెట్లంటారు. జనన మరణాలకు, వీరపూజలకు, వినోదాలకు, విహారాలకు, అనుగుణమైన లయలతో

డప్పులు వాయిస్తూ, లెల్లెపదాలు పాడుతూ నాట్యంచేస్తారు. మాదిగలు ప్రదర్శించే "జోగాట" గొప్ప కళాఖండం. శవాన్ని స్మశానానికి తీసుకొనిపోయే సమయాన జోగాటవాళ్ళు ప్రదర్శించే పిండోత్పత్తిక్రమం గొప్పనృత్యం. మాతృగర్భంలో జీవుడు ప్రవేశించినప్పటి నుండి పిండవికాసం, పరిణామం, ప్రసవం జీవితంలోనివివిధఘట్టాలు అత్యద్భుతంగా నృత్యరూపంలో ప్రదర్శిస్తారీజోగువారు.

తెలుగువాళ్ళ వినోదనృత్యాల్లో విచిత్రమైనదీ, ప్రత్యేకమైనదీ గుఱ్ఱపునాట్యం. గుంటూరు మండలంలో దీనికి చాలా ప్రచారం ఉంది. తాళలయానుగుణంగా ముక్తాయింపులుకూడ కాళ్ళతో పలికించేటట్లు గుఱ్ఱాలకు శిక్షణ ఇస్తారు. వాటి కాళ్ళకు గజ్జెలుకట్టి చక్కగా అలంకరించి వాద్యానుగుణంగా పాటపాడుతూ ఆడిస్తారు. తిరునాళ్ళప్పుడూ, వివాహాల్లోనూ ఈ గుఱ్ఱపునాట్యం గుంటూరు మండలంవారికి ఒక చక్కని వినోదం. జానపదులీ వినోదనృత్యం చాలా ఉత్సాహంగా చూస్తారు. ఫిరంగిపురం క్రిస్మస్ వేడుకల్లో ఈ గుఱ్ఱపు నాట్యాలను జనులు తండోపతండాలుగా కూడి ఉత్సాహంతో చూస్తారు.

**3. ప్రచారక నృత్యాలు** :—ఆంధ్రదేశమంతటా కొన్నికులాలవాళ్ళు, కొన్ని వృత్తులవాళ్ళు తాము పొట్టపోసుకోవటానికి, ఇతరులకు విజ్ఞాన వినోదాలు సమకూర్చటానికి ఈ నృత్యాలు ప్రదర్శిస్తారు. ఈ వృత్తులవాళ్ళుప వానకాలమో తప్ప తక్కిన ఏడాది పొడుగునా ఊళ్ళు తిరుగుతూ నృత్య ప్రదర్శనలు చేస్తారు. కనుక వీటిని ప్రచారక నృత్యాలనవచ్చు.

ప్రచారక నృత్యాల్లో చాలా ప్రాచీనమైనవి కురవంజి, యక్షగానం మొదలైనవి. కురవంజి దక్షిణదేశమంతటా ప్రచారంలో ఉంది. కురవలనే జాతివారి, అంజి-అడుగు కాబట్టి ఈ నృత్యానికి కురవంజి అనేపేరు వచ్చింది. పుణ్యతీర్థాలల్లో, యాత్రాస్థలాల్లో ప్రారంభమై ఈ నృత్యం సంగీత సాహిత్యాలు పెంచుకొని నాయకరాజుల ఆస్థానరంగ మంటపం అలంకరించింది. మన యక్షగానంకూడ ఇట్టిదే. ప్రారంభంలో యక్షులు-జక్కులు అనే తెగవారు ప్రదర్శించిన ఈ నాట్యం రానురాను దృశ్యప్రబంధమై దక్షిణాంధ్ర వాఙ్మయ శాఖల్లో మకుటాయమానమైనది. పాల్కురికి సోమనాథుడు దీని ప్రశస్తిని బాగా ఉగ్గడించినాడు. 16, 17 శతాబ్దాల్లో ఈశాఖ పరాకాష్ఠ నందుకున్నది. దీనినిచూచి కూచిపూడివారు వీధి భాగవతులు, చిందు భాగవతులు, యానాది భాగవతులు, దాసరిభాగవతులు, బయలాటవారు తమతమ శక్తులనుబట్టి మార్పులూ కూర్పులూ చేసి ప్రచారంచేస్తున్నారు.

చెంచులు ప్రదర్శించే చెంచిత నాటకము, శివభిల్లనాటకము (కిరాతార్జునీయం కథ)కూడా ప్రచారక నృత్యాలే. మొదట ఇవి తాళలయ ప్రధానమైన నృత్తాలు. పల్లెలతో పట్టణాలతో ఈ ఆటవికులకు పరిచయం ఏర్పడ్డతరువాత ఈ నృత్తరీతుల్లో చాలా మార్పులు వచ్చి నృత్య నాటకాలకు సమీపానికి వచ్చినవి. కోయవాళ్ళు పొట్టపోసుకోవటానికి ఉత్సవాల్లో తిరునాళ్ళలో అప్పుడప్పుడు తీరిక సమయాల్లోకూడ నెమలినృత్యమూ, లేడిపిల్ల—వేటకాని నృత్యమూ ప్రదర్శిస్తుంటారు. లంబాడీలు (బంజారీలు) కూడ పల్లెల్లో పట్టణాల్లో హోలీనృత్యాలు ప్రదర్శించి యాచన చేస్తుంటారు. ఇవి ఎక్కువగా తాళలయలు ప్రధాన నృత్యాలు. సంగీత సాహిత్యాలపాలు వీనిలో చాల తక్కువ.

చేతిలో పెద్ద జేగంట, కాళ్ళకు గజ్జెలు, నోటితోపాట, కాళ్ళతో నృత్యం సీతారామ లక్ష్మణుల విగ్రహాల దీపపు స్తంభం పట్టుకొని రామదాసు బంధికానా పాట్లు వర్ణిస్తూ యాచించే జేగంట భాగవతుల్యూ, కృష్ణలీలలు పదర్శించే గొల్ల భాగవతులూ, యాదవులను, కురుమలనూ యాచిస్తూ ప్రదర్శనలిచ్చే గొల్ల సుద్దులవారూ, వీరన్నలవారూ పనిపాటలు లేని సమయాల్లో పల్లెటూరి ప్రజలకు విజ్ఞాన వినోదాలు ప్రసాదించే చక్క భజన బృందాలూ, హరిజనులకు వినోదం కూర్చే యానాది భాగవతులూ, మొదలైనవాళ్ళందరూ ప్రచారక నృత్యాలు ప్రదర్శించేవారే. నవనాగరకత కారణంగా ఈ కళలు మెల్లమెల్లగా సన్నగిల్లిపోతున్నవి.

జంగంకథలు ప్రదర్శించే బుడిగె జంగాలు చాలా ప్రాచీనులు. విశాఖ గుంటూరు మండలాల్లోనూ, తెలంగాణ మంతటా, ఈ జంగంకథలకు బాగా ప్రచారం ఉన్నది. తొలుదొలుత ఈ జంగాలు శైవమత ప్రచారంకోసం కేవలం శివుని లీలలే ప్రదర్శించేవారు. కాని తరువాత అన్ని యితివృత్తాలూ స్వీకరించినారు. రానురాను శారద కాండ్రు, పిచ్చుకగుంట్లు వీరిననుకరించి తందాన కథలు చెప్పుతూ ఆయాకులాల వాళ్ళను యాచించటం ప్రారంభించినారు. బాలనాగమ్మకథ, కామమ్మకథ, లక్ష్మమ్మకథ, బొబ్బిలికథ, సర్వాయి పాపనికథ, దేశింగురాజుకథ, గాంధారి కథ మొదలైన తీరు తీరుల కథలు పాడుతూ రసోచితంగా నాట్యంచేస్తూ ప్రదర్శిస్తున్నారు. ఈ జంగం కథా పద్ధతిని ఆధునిక రాజకీయ వర్గాలవారు, ప్రభుత్వ ప్రణాళికలను ప్రచారం చేసేవారు, తమతమ ఆశయాలను ప్రచారం చేయటానికి బుఱ్ఱకథ, జముకుల కథలనే పేర్లతో చాలా మార్పులు కూర్పులు చేసి ప్రదర్శిస్తున్నారు. నాజరువంటి కళాకారులు బుఱ్ఱకథకు వన్నెనూ వాసినీ కూర్చినారు.

ఈవిధంగా తెలుగునాటి జానపద నృత్యాలెన్నో కాలక్రమాన మారుతూ కొన్ని పోయినా కొన్నైనా ఈనాటికి కూడా జానపదులకు విజ్ఞాన వినోదాలు కూర్చుతున్నవి. ★

[సవరణ: 61వ పేజీ 6వ పంక్తిలో "సతి"ని "శతి"గా చదువుకొనవలెను.]

# నిర్బంధ డిపాజిట్ల పథకం

కేంద్ర ఆర్థిక మంత్రి శ్రీ మొరార్జీ దేశాయ్ నిర్బంధ డిపాజిట్ల పథకం గూర్చి ఈమధ్య ఢిల్లీ కేంద్రంనుంచి రేడియో ఇంటర్వ్యూ యిచ్చారు. ఇంటర్వ్యూ చేసిన వారు శ్రీమతి రజా శరణ్. ఆ ఇంటర్వ్యూలో యీ క్రింది అంశాలున్నాయి.

నిర్బంధ డిపాజిట్ల పథకం ప్రయోజనాలను, అమలుజరపవలసిన కారణాలను తెలుసుకోవాలంటే ఆ పథకాన్ని సక్రమ దృక్పథంతో పరిశీలించాలి. అందరి ఆమోదం పొందిన కొన్ని సులభాంశాలున్నాయి. మనదేశ ప్రజల సౌభాగ్యాన్ని పెంపొందించాలనీ, లేక వ్యవసాయ పారిశ్రామిక ఉత్పత్తుల పెంపుదల రీత్యా ప్రజల దారిద్ర్యాన్ని నివారించాలనీ మనం కోరుతున్నాము. ఆర్థికస్థితి పెరుగుదల సాలుసరి రేటు, జనాభా పెరుగుదల రేటుకంటె ఎక్కువగా వుంటేతప్ప నిజమైన అభ్యుదయం సాధించజాలము. ఇక ఆ పెరుగుదల రేటు ప్రజలు ఆదాచేసేటటువంటి, పెట్టుబడి పెట్టేటటువంటి మొత్తాలమీద ఆధారపడి వుంటుంది. ఈ మూడు అంశాలను అంగీకరిస్తే, అభివృద్ధి, పెరుగుదల రేట్లు ఒకకనీస మొత్తాలలో వుండేందుకు అవసరమైన సాధన సంపత్తిని సమీకరించుకోవడంలో మనకుగల శక్తి సామర్థ్యాలమీదే మన భవిష్యత్తు ఆధారపడివుంది. తృతీయ ప్రణాళికలో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అధిక పన్నులు, అధిక ఋణాలు కేటాయించడం ఆ దృష్టితోనే జరిగింది.

ఇంతలోకే కొత్త ప్రమాదం — చైనాచే భారతదేశ దురాక్రమణ — ప్రారంభమైంది. దానిని మనం ప్రతిఘటించక తప్పదు. మన రక్షణ శక్తిని పటిష్ఠం చేయవలసి వచ్చింది. సైనిక దళాలను పెంపొందించి అదనపు ఆయుధాలను సమకూర్చవలసి వచ్చింది. దేశ ప్రజలు యింతకుముందెన్నడూ లేని ఐకమత్యాన్ని ప్రదర్శించి, మన రక్షణ దళాలను పటిష్ఠం చేయడానికి అవసరమైన సాధన సంపత్తినంతనూ సమకూర్చాలని కోరారు. రక్షణ కృషి ఆర్థిక వ్యవస్థయొక్క స్తోమతుపై ఆధారపడి వున్నందున అభివృద్ధి కృషిని త్రోసిరాజనడానికి వీలులేకపోయింది.

అందువల్ల బడ్జెటు రూపొందించేటప్పుడు అభివృద్ధి కృషి వనరులను మళ్ళించకుండా అదనపు వనరులు ఏవిధంగా లభ్యమౌతాయా అని ఆలోచించవలసి వచ్చింది. అదనపు పన్నులు, అధిక ఋణాలు తప్పవని స్పష్టపడింది. పన్నులకు సంబంధించిన కొన్ని లక్షణాలుగల నిర్బంధ డిపాజిట్ల పథకం అమలుపరిచే విషయమై ఆలోచన అప్పుడే కలిగింది.

## పన్నులు లేక ఋణాలు?

ఋణం తప్పనిసరి లక్షణంపన్ను విధింపునకు మరో రూపమని అనిపిస్తుంది. డిపాజిట్ల పథకం క్రింద లభించే మొత్తం డిపాజిటుదారుకు వడ్డీతో సహా తిరిగి యివ్వవలసి వున్నందున అది నిజంగా ఋణమే. ఆ పథకం సశాస్త్రీయమూ, సంప్రదాయ సిద్ధమూ కాకపోయినా హేతువాద దృష్ట్యా సరైనదే.

ఒక వ్యక్తి పన్ను చెల్లించినా లేక అదే మొత్తం సేవింగ్సు ఖాతాలో వేసినా అతని బడ్జెటులో తక్షణం కలిగే లాభ నష్టాలు ఏమీలేవు. ఖర్చుపెట్టే మొత్తం తగ్గుతుంది. అయితే ఒక పెద్ద తేడా వుంది. అతను పన్ను చెల్లిస్తే ఆ మొత్తం ఎప్పటికీ వదులుకోవలసిందే. తిరిగి రాదు. ఆ మొత్తాన్ని సేవింగ్సు ఖాతాలో వేస్తే, 5 ఏళ్ళ తర్వాత సాలుకు నాలుగు శాతం వడ్డీతో ఆ మొత్తం అతనికి తిరిగి వస్తుంది. అతడు అప్పుడు ఆ మొత్తాన్ని కుటుంబ క్షేమంకోసం అమ్మాయి పెళ్ళికో, అబ్బాయి చదువుకో వినియోగించవచ్చు. ప్రావిడెంటు ఫండ్లు కూడా నిర్బంధ పొదుపు మొత్తాల వంటివే. ప్రావిడెంటు ఫండుకు ప్రతినెలా కొంత మొత్తం జమ కడుతున్నాడంటే, ప్రతినెలా అతని ఖర్చు కొంత తగ్గుతుంది. అదే సూత్రాన్ని కొంత విస్తరిస్తే నిర్బంధ డిపాజిట్ల పథకం రూపొందింది. దాని ప్రత్యేక లక్షణం ఏమిటంటే ఆ ఖాతాలో జమకట్టిన మొత్తం నేడు దేశ రక్షణను పటిష్ఠం చేయడానికీ, అభివృద్ధి కృషి పెంపుదలకూ వినియోగమౌతుంది.

## స్వల్పాదాయ వర్గాలు

వ్యక్తులు, సంస్థలు చెల్లించగల పన్నులను హెచ్చించి, ఆర్థిక యిరవులను గరిష్ఠ మొత్తంలో సేకరించడం మొదటియత్నం. అధిక లాభాల పన్ను, ఆదాయపు పన్ను చట్టంక్రింద వ్యక్తిగత పన్నుల పెంపుదల యిదే దృష్టిలో చేయబడ్డాయి. ఐతే దేశంలో ఆదాయపు పన్ను చెల్లించేవారు 15 లక్షల మందే వున్నారు. ఒక వ్యక్తి చెల్లించవలసిన పన్నుకు పరిమితికూడా వుంది. ప్రస్తుతం అమలులో వున్న చట్టాలరీత్యా తమ మొత్తము ఆదాయాన్ని మించి ప్రభుత్వానికి పన్ను చెల్లించేవారు కొందరున్నారు. సంస్థలపై విధించే పన్నులకుకూడా పరిమితి వుంది. ఉత్పత్తులు పెరగాలనీ తద్వారా ఎక్కువ మందికి ఉపాధించాలనీ, అందుకోసం పరిశ్రమలు పెంపొందాలనీ కోరుతున్నాం. అందువల్ల హెచ్చుమంది ప్రజలను రంగంలోకి లాక్కురావల్సి వచ్చింది. ఆదాయపు పన్ను విషయములో మినహాయింపు సౌకర్యం మరికొంత తగ్గించి వుండవల్సిందని కొందరంటున్నారు. మనదేశంలో సాలుసరి ఆదాయం రూ. 3000 కంటే

తక్కువ వున్నవారు ఆదాయపు పన్ను చెల్లించ నవసరంలేదు. ఇంతకంటే సౌభాగ్యవంతమైన దేశాలలో, జీవనవ్యయ ప్రమాణం మెరుగుగావున్న దేశాలలో అంతకంటే తక్కువ ఆదాయం వచ్చేవారుకూడా పన్నులు చెల్లిస్తారు. సాలుకు 3000 కంటె తక్కువ ఆదాయం వచ్చేవారిని పన్నుకట్టమనడంకంటే తప్పని సరిగా కొంతపొదుపు చేయాలని నిర్ణయించడం జరిగింది. పన్నుల రూపంలో చెల్లించే మొత్తము తిరిగిరాదు. పొదుపు చేసిన మొత్తము తిరిగి వస్తుంది. కుటుంబానికి ఉపయోగపడుతుంది.

ప్రజలు అదనముగా ఆదా చేయాలంటే ఖర్చు తగ్గించుకోక తప్పదు. వాస్తవికపరిస్థితులను తప్పించుకోడం సాధ్యంకాదు. ఉత్పత్తి అయ్యే సిమెంటు, ఉక్కు, నూలు వస్త్రాలు, ఉన్ని వస్త్రాలలో హెచ్చు మొత్తం సాయుధదళాలకు అవసరమైతే మనప్రజలు విలాసవస్తువులు కానటువంటి అవసరవస్తువుల వాడకంసైతం తగ్గించుకోవలసి వుంటుంది. యుద్ధములో నిమగ్నమయినటువంటి దురాక్రమణనుప్రతిఘటించే ఏ దేశానికైనా యిది తప్పదు.

క్రిందటి ప్రపంచ యుద్ధ సమయములో బ్రిటన్‌లో జీవితావసర వస్తువులయిన ఆహారం, వస్త్రాలు మొదలైన వాటన్నిటికీ రేషనింగ్ పెట్టారు. మన హిమాలయ సరిహద్దులను రక్షిస్తున్న జవాన్‌లకు ఉన్ని వస్త్రాలు, పాదరక్షలు సప్లయిచేయక తప్పదు. వాటి వాడకాన్ని మనం తగ్గించుకోక తప్పదు. మనరక్షణ అవసరాలదృష్ట్యా ఆర్థిక వ్యవస్థపైపడిన భారాన్ని భాగ్యవంతులతోపాటు సామాన్యులుకూడా కొంతవరకూ పంచుకోక తప్పదు.

ప్రతినెలా మనంకొంత కనీస మొత్తం ఖర్చుపెట్టి తీరాలనుకోడం పొరపాటు. సాలుకు రూ. 1500 ఆదాయం వచ్చేవారు అంతకంటె తక్కువతో బ్రతకలేమంటారు. అంతకంటే తక్కువ ఆదాయముతో బ్రతుకుతున్న భారతీయులు లక్షలమంది ఉన్నారు. నిర్బంధ చర్యవల్ల కొంత మొత్తము ఆదా చేయడం ప్రారంభిస్తే, మొదట్లో కష్టంగావున్నా పోనుపోను అది మంచికేగాని చెడ్డగా పరిణమించదు.

## గ్రామప్రజల పరిస్థితి

బడుగు రైతులు దేశంలో అందరికంటె బీదవారు. ఆ కారణం వల్లనే సాలుకు 5 రూపాయలకంటే తక్కువ శిస్తుచెల్లించే వారందరినీ యీ పథకంనుంచి మినహాయించడం జరిగింది. శిస్తులు చెల్లించేవారు దేశములో 5,6 కోట్లమంది వున్నారు. వారిలో సగంమందేనిర్బంధ డిపాజిట్లపథకం క్రిందకు వస్తారు. వారు డిపాజిటు చేయవలసిన మొత్తంకూడ తక్కువే. 1959–60 లో వున్న రేటునుబట్టి ఒక్కొక్కరు చెల్లించే శిస్తులో సగం నిర్బంధ డిపాజిట్లలో జమ కట్టాలి. 1960 నుంచి శిస్తులు పెరిగినచోట్ల కూడ ఈ పథకంక్రింద హెచ్చు మొత్తం చెల్లించ నవసరంలేదు. ఆరైతు, వరదలు, అనావృష్టి సంభవిస్తే శిస్తు రెమిషన్‌యిచ్చినట్లే ఈ మొత్తం ఆయా సందర్భాలనుబట్టి తగ్గించ బడుతుంది. ఆయారైతులభారం తగ్గించడానికి ప్రయత్నించినా గ్రామ ప్రజలలోకూడ పొదుపు పద్ధతి మన భవిష్యత్తుకు అత్యవసరం. పూర్వం నుంచీ మనరైతులు అప్పులలో మునిగి ఉండడం సహజమే. వడ్డీ ఆర్జించడంకంటె వడ్డీ యివ్వడమే వారికి తెలుసు. అందువల్ల ఈ నిర్బంధ డిపాజిట్ల పథకం గ్రామ ప్రజలందరికీ మేలు కలిగిస్తుంది. ఈ విషయాలను అర్థం చేసుకున్నవారు ఈ పథకం దేశరక్షణకు, రానున్న సంవత్సరాలలో రైతు కుటుంబాలకు మేలు కలిగిస్తుందని సగర్వంగా రైతులకు నచ్చచెప్పాలి.

## స్వచ్ఛంద పొదుపు పద్ధతి

నిర్బంధ డిపాజిట్ల పథకం అమలులో స్వచ్ఛందముగా పొదుపుచేసే మొత్తాలు ఇంకిపోతా యంటున్నారు – నిర్బంధ డిపాజిట్ల నిమిత్తం కొందరు తాము స్వచ్ఛందముగా ఆదాచేసే మొత్తాలను కోతకోస్తారని కొందరంటున్నారు. ఈ పని జరగరాదని ప్రభుత్వం కోరుతున్నది. నేటి రైతులు యీ పథకంక్రింద చెల్లించే మొత్తాలు, నికరపు అదనపు ఆదా మొత్తాలు సాలుకు రూ.1500లు అంతకు మించిన ఆదాయంవచ్చే ఆదాయపు పన్నులేనివారు ప్రావిడెంటుఫండు, జీవిత భీమా, గడువు డిపాజిట్లు రూపంలో 11 శాతం ఆదా చేస్తున్నవారికి యీ పథకం నుంచి మినహాయింపు యివ్వబడింది.

## నిర్వహణ వ్యయం

నిర్బంధ డిపాజిట్ల సేకరణ ప్రస్తుతమున్న శాఖలద్వారానే జరగాలన్నది మొదటినుంచీ ప్రభుత్వ లక్ష్యం. ఈ విషయంలో అందరి ఆమోదం పొందడానికి కొంతకాలం పట్టింది. ఆదాయపు పన్ను చెల్లించేవారు ఇందు నిమిత్తం ప్రభుత్వం పరిగణించిన బ్యాంకులలో డిపాజిట్ల చెల్లింపునకు ఏర్పాట్లు చేసుకోవచ్చును. రైతులు శిస్తు వసూలుచేసే అధికారులతో ఏర్పాటు చేసుకోవచ్చును. ఇందుకోసం సిబ్బందిని పెంచరాదన్నది ప్రభుత్వ కోర్కె. డిపాజిట్లు తిరిగి యిచ్చేటప్పుడు ఆలస్యము జరగకుండా చూడాలనిప్రభుత్వం తాపత్రయ పడుతున్నది.

కొన్ని అత్యవసర పరిస్థితులలో అయిదేండ్లు గడువు పూర్తి కాకముందే డిపాజిటు మొత్తాలను తీసుకునే సౌకర్యం ఈ పథకంలో కల్పించబడింది. ఉదాహరణకు ఈ డిపాజిటు చేసిన వ్యక్తి మరణిస్తే అతడు డిపాజిటు చేసిన మొత్తం వడ్డీతో సహా ఆయన వారసులు గాని, ఆయన అధికారం పొందినవారు గాని తీసుకోవచ్చు. దీనికి సంబంధించిన ఏర్పాట్లుకూడ త్వరలోనే కట్టుదిట్టం చేయబడతాయి. దేశవ్యాప్తంగా తలపెట్టిన ఈ బృహత్ కార్యక్రమంలో ప్రారంభంలో ఇబ్బందులు తప్పకపోవచ్చు. ఈ పథకం కొలది వారాలలోనే సాఫీగా, డిపాజిటు దార్లకు ప్రయోజనకరముగా, దేశానికి లాభసాటిగా కొనసాగుతుందని ఆశిస్తున్నాము. ప్రజలు బుద్ధిపూర్వకంగా సహకరించకపోతే ప్రయోజనం ఎక్కువ వుండదు. 

# కృష్ణాష్టమి

శిష్ట రక్షణకు – దుష్ట శిక్షణకు భగవంతుడు అప్పుడప్పుడూ అవతరిస్తాడని, మన పురాణాలు చెప్తాయి. ముఖ్యమైన విష్ణ్వవతారాలు పదింటిలోనూ కృష్ణావతారం ఒకటి. కంసుని దుండగాలవల్లనూ; పూతన, నరకుడు, శిశుపాలుడు, దంతవక్త్రుడు మొదలయిన రాక్షసుల ఆగడాలవల్లనూ; కౌరవుల దుశ్చేష్టితాల వల్లనూ ప్రజలకు యిక్కట్లు సంభవించగా శ్రీమహావిష్ణువు కలియుగారంభంలో కృష్ణావతారమెత్తి జన్మించాడు. చిన్నతనంనుంచి కూడా కృష్ణుడు అనేకమంది రాక్షసులను హతమార్చి, జరాసంధాది దుష్టులను చంపించి, కౌరవుల దుశ్చేష్టితాలకు తగిన సమాధానం చెప్పి లోకపూజ్యులైన పాండవులను సింహాసనాసీనుల్ని కావించాడు శ్రీకృష్ణుడు యుద్ధతంత్రజ్ఞుడు; రాజనీతి విశారదుడు; కురుక్షేత్ర సంగ్రామాన్ని విజయవంతంగా నడిపిన నేర్పరి; జన్మజీవన మరణ తత్వ రహస్యాలకు నిలయమైన గీతా ప్రబోధకుడు.

ఇట్టి మహామహుని జన్మదినోత్సవాన్ని బాలగోపాలమూ జరిపి కృష్ణునిపట్ల తమకు గల భక్తిప్రపత్తులను వ్యక్తం చేసుకుంటారు. కృష్ణుడు శ్రావణ బహుళ అష్టమీ రోహిణీ నక్షత్రంలో జన్మించాడు. అదే కృష్ణాష్టమి పర్వదినం. కృష్ణ జయంతి – ఉట్లపండుగ – అని దీనికే నామాంతరాలు వున్నవి.

కొందరు తిథికీ, మరికొందరు నక్షత్రానికి ప్రాధాన్యం యివ్వడంవల్ల ఈ పండుగను జరపడంలో కొంచెం ముందువెనుకలు వున్నవి. కృష్ణ జయంతీ వ్రతమునాడు ఉపవాసముండి ముందుగా చంద్రుడిని పూజించి ఆ పిదప కృష్ణుడిని పూజించవలెనని భవిష్యోత్తర పురాణంలో గలదు. బంగారంతోగాని, వెండితోగాని స్థిరపరచిన చంద్రుడిని బంగారు పాత్రలో వుంచి ముందుగా పూజించి, అర్ఘ్యమిచ్చి, ఆపిదప కృష్ణుని పూజించాలి.

కృష్ణాష్టమి రోజున పగలు ఉపవాసముండి, సాయంకాలం ఊరేగింపులతోను, భజనలతోను గడుపుతారు. ఉయ్యాల కట్టి, కృష్ణ విగ్రహాన్ని ఆ ఉయ్యాలలో వేసి ఊపుతూ పాటలు పాడుతారు. చాలా ప్రాంతాలలో ఉట్లు కొట్టే ఆచారం వున్నది. అటూ యిటూ పాతిన రెండు కొయ్యలమీద అడ్డుగా ఒక కర్రను కట్టి, దానిని అన్నిరకాల ఫలాలతోనూ అలంకరిస్తారు. దానిమీదుగా ఒక తాడును లాగి ముంతలో డబ్బులు నింపి పైన కొబ్బరికాయ పెట్టి, దానిని ఒక ఉట్టిలో పెట్టి ఒక చివర కట్టి, మరోచివర ఒకవ్యక్తి పట్టుకొని క్రిందకూ పైకీ లాగుతుంటాడు. ఆ ముంతను అందుకోవాలని ఒక్కొక్కరుగా అనేకమంది ప్రయత్నిస్తారు. దూరంనుండి పరుగెత్తుకొనివచ్చి, ఒక్క ఎగురు ఎగిరి అందుకోవాలనే ప్రయత్నం చేస్తుంటారు. అతను దూరంగా వుండగా క్రిందికి దించి, దగ్గరకు వచ్చి పైకెగరగానే అది అతని కందకుండా ఉట్టిని పైకి లాగుతారు. అతని యెదురుగా ఉన్నవారు, అతని ప్రయత్నాన్ని సాగనీయకుండా మొహాన నీళ్ళు చల్లుతుంటారు. వసంతం చల్లడానికి వుపయోగించే వెదురు బొంగులతో చేసిన పిచికారీలతోను, చెంబుల తోను నీళ్ళు కొడుతూవుంటారు. ఆ ఉట్టిని ఎవరో ఒకరు అందుకునేవరకూ అలా సాగుతూనేవుంటుంది. కొన్ని ప్రాంతాలలో ఒక మనిషి బుజాలమీద మరొకరుగా ముగ్గురు నలుగురుదాకా యెక్కి ఉట్టి కొట్టించే సాంప్రదాయంకూడా వున్నది. ఈ ప్రదర్శనలో చిన్న పిల్లలకంటే పెద్దలే యెక్కువగా పాల్గొంటారు. శ్రీకృష్ణుడు చిన్నప్పుడు చేసే అల్లరను యిది జ్ఞాపకం చేస్తుంది. వ్రేపల్లెలోని కృష్ణుని చిన్నతనపు దుడుకు పనులను ప్రత్యక్షంగా వ్యక్తం చేస్తూ ఆరోజు ఆనందంగా, ఉత్సాహంగా గడిపివేస్తారు. ఉట్ల పండుగకు వారం రోజుల ముందుగానే పిల్లలు పిచ్చికారీలతో యిళ్ళల్లో, రోడ్లమీద నానా అల్లరీ చేసి చిన్నికృష్ణుని దుడుకు పనుల్ని ప్రత్యక్షంగా కళ్ళకు కట్టినట్లు చూపించడం, ఆ ఆగడాలకు చాలామంది పెద్దవాళ్ళు ఇబ్బంది పడడం మనందరకు అనుభవంలోని విషయమే. ఉట్లపండుగ ఒకరకమైన వ్యాయామానికి ఆస్కారం కల్పిస్తుంది. ఉట్టికొట్టి అందులోని డబ్బు తీసుకోవాలనే ప్రయత్నం చేసే ప్రతివ్యక్తి శక్తికిమించి పరుగెత్తుకొచ్చి ఎగిరెగిరి అందుకొనే ప్రయత్నం చేస్తుంటాడు. శరీరానికిది చక్కని వ్యాయామం. ఇటువంటి కృష్ణాష్టమి వేడుకకు సంబంధించిన దృశ్యమే యీ వెల ఆంధ్రప్రదేశ్ ముఖ చిత్రం. ★

# లలనావనం



## * ఉత్పత్తి కేంద్రాలు *

— అవుల జయప్రదాదేవి

మనదేశంలో సాంఘికఆర్థిక ప్రణాళికలు కొన్ని ఏర్పాటు చేయబడ్డాయి. భారతదేశం స్వాతంత్ర్యం పొందాక దేశాభ్యుదయ కార్యక్రమాలలో అతి ముఖ్యమైన వీ ప్రణాళికలు. అట్టి ప్రణాళికల్లో స్త్రీలకు సంబంధించి ఉత్పత్తి కేంద్ర విధానం ఒకటి యేర్పరచబడింది.

ఏదో కొద్దిచదువు ఉన్నవారు తమ విద్యను అభివృద్ధిపరచుకొని తద్వారా స్వయంపోషకులుకావడానికి స్త్రీలకు ప్రత్యేక సంక్షిప్తవిద్య ఏర్పాటు చేయబడింది. అయితే చదువు సంధ్యలు లేని అసహాయ స్త్రీల గతి ఏమిటి? అనేదే ఇప్పటి మనప్రశ్న. ఇట్టి స్థితిలోవున్న స్త్రీలూ, లేక ఆర్థిక స్తోమతు ఏమాత్రమూ చాలని కుటుంబస్త్రీలూ, ఏమి చెయ్యాలి అనే విషయం మన సంఘ వాతావరణాన్ని బట్టి ఒక పెద్దసమస్య అయిపోయింది. కొన్ని ప్రాంతాలలో కొన్ని కొన్ని కుటుంబాలలోని స్త్రీలు బయట పొలము పనులో, లేక ఫ్యాక్టరీల పనులో కూలీనాలో చేయటానికి వెళ్తూ ఉంటారు. కొన్ని కొన్ని ప్రాంతాలలో కొన్ని కొన్ని కుటుంబాల ఆచారాలనుబట్టి స్త్రీలు ఆకలి బాధతో అలా అవస్థపాలైనా అవుతారుకాని బయటి పనులకుపోరు. అటుకూలిపనీ చేయలేరు; ఇటు ఆర్థికాభావంతో కుటుంబ నిర్వహణా చేయలేరు. ప్రత్యేకంగా అటువంటి వారికి ఈ స్కీములు అనుకూలంగా వుంటాయనడంలో సందేహంలేదు. ఈ సాంఘిక, ఆర్థికప్రణాళికలద్వారా (Socio Economic Programmes) అట్టి కుటుంబాలకు చక్కని ఆర్థిక సహాయం లభించవచ్చు.

ఈ ఉత్పత్తి కేంద్రములను సంస్థల ద్వారా మాత్రమే నడపడానికి అవకాశముంటుంది. ప్రత్యేక వ్యక్తులద్వారా నడపడానికవకాశంలేదు. కేంద్ర సంక్షేమ సంఘంవారు ఈ కేంద్రాలను ప్రత్యేకంగా స్త్రీల ఆర్థికాభివృద్ధికై ఏర్పాటుచేశారు. ఒక్కొక్క ఉత్పత్తి కేంద్రంలో 35 మంది స్త్రీలకు అవకాశం లభింపజేయవచ్చును. ఏ యే ప్రాంతములలో, ఏ యే ముడి పదార్థములు దొరకుతాయో ఆయా ప్రాంతాలలో ఆయా ముడి సరుకులను ఉపయుక్తాలయ్యే వస్తువులుగా తయారు చేయడం వీటి ముఖ్య కర్తవ్యం. ఆవిధంగా తయారు చేయబడిన వాటిని తిరిగి మార్కెట్టులో అమ్మి అమ్మకంవల్ల వచ్చే ఆదాయంతోనే ఈ ఉత్పత్తి కేంద్రములను నడుపుతూ తద్వారా అటు స్త్రీలకూ, ఇటు సమాజానికీ కూడా ఉపయోగపడడం జరుగుతున్నదీ.

అయితే వీటిని నడపడానికి మొదట ఆర్థికాధార మేమిటన్న సందేహం రావచ్చు. వాటిల్లో ఒక్కొక్క కేంద్రానికి 50 వేలనుండి లక్షల రూపాయలవరకూ కేంద్ర సంక్షేమ సంఘం గ్రాంటును ఇస్తుంది. ఈ డబ్బుతో కేంద్రమునకు కావలసిన మిషనరీ వగైరా సామానులు, ముడిపదార్థములు కొనవచ్చును. ఇంతేగాక ఈ ఉత్పత్తి కేంద్రాలలో ప్రారంభింపబడే పనిలో స్త్రీలకు శిక్షణ యివ్వడానికి కొంత కాలవ్యవధిని కూడా యిచ్చివున్నారు. తర్ఫీదుపొందే స్త్రీలకు స్టయిఫండు కూడా యివ్వడానికి ఈ డబ్బులో కొంత ఖర్చుపెట్ట వచ్చును. ఈ కేంద్రంలో శిక్షణ నిచ్చేసిబ్బందికి కూడా డబ్బు వాడవచ్చును. అంటే కేంద్రానికి కావలసిన ఆర్థిక సహాయాన్నంతనూ ప్రభుత్వమే యిస్తున్నదన్నమాట.

ఇంతేగాక ఈ కేంద్రాల ఆవశ్యకతను గురించి మనకు మహత్తరమైన నిదర్శనం వొకటి కన్పిస్తున్నది. దేశరక్షణావసరానికై ప్రస్తుత క్లిష్టపరిస్థితులను ఎదుర్కొనడానికై ప్రణాళికలలోని కొంత భాగాన్ని ప్రభుత్వం తగ్గిస్తున్నది. కాని ఈ ఉత్పత్తి కేంద్రముల విషయంలో ఏమాత్రమూ బడ్జెటును తగ్గించలేదు. దీనిని బట్టి ఈ కేంద్రాలకున్న ప్రాధాన్యతను మన మూహించుకొనవచ్చును. వీటిల్లో అనేకరకాలైన వస్తువులను తయారు చేస్తున్నారు. తోలు వస్తువులు (బ్యాగ్‌లు, పర్సులు వగైరా), కాగితపు కవర్లు, మైనపు వత్తులు, నూలు, వస్త్రములు మొదలైన వాటిని రకరకములుగా తయారు

చేయడానికి యీ పరిశ్రమలను స్థాపించి వినియోగించడం జరుగుతున్నది.

రెండవ ప్రణాళికాకాలంలో ఒక ఉత్పత్తి కేంద్రాన్ని నడపడానికి హైదరాబాదులోని కస్తూర్బా గాంధీనేషనల్ ట్రస్టువారికి 30 వేల రూపాయలు గ్రాంటును శాంక్షనుచేశారు. దీనిలో ప్రస్తుతం కొవ్వువత్తులు, కవర్లు, తయారు చేస్తున్నారు. వీటి తయారీకి ప్రత్యేకంగా తర్ఫీదు నివ్వవలసిన అవసరం లేదు. ఇటువంటి కేంద్రాలలో కేవలం వస్తువులు తయారుచేసే పనిమాత్రమే చేసేవారికి రోజువారీ వేతనం ఇవ్వవచ్చును. ప్రప్రథమంలో పని నెమ్మదిగా సాగినా, తరువాత అలవాటు ననుసరించి చురుకుగానే పని సాగుతుంది. కవర్లు చేసే వారికి 1000 కవర్లకు 1 రూపాయి చొప్పున వేతనం లభించుతున్నది. కొవ్వువత్తుల పనిలో రోజుకు 1 రూపాయి 50 నయాపైసలు లభిస్తున్నది. ఈ విధంగా ఇక్కడ పనిచేసే స్త్రీలకు కొంతవరకూ ఆర్థిక సహాయం లభిస్తున్నది. 25 మంది స్త్రీలు ప్రస్తుతం యిందులో లాభం పొందుతున్నారు. దీనికి లభించే ఆర్థిక సహాయంలో 15 వేల రూపాయలు మిషనులు, ముడిపదార్థాలకై కేటాయింపబడింది. మిగిలిన 15 వేల రూపాయలు వర్కింగు కాపిటలుగాను ఏర్పాటు చేయబడినది. ఈ కేంద్రం స్త్రీలకు జీవనోపాధిని కలుగజేస్తూ చక్కగా నిర్వహింపబడుతున్నది.

మూడవ ప్రణాళికలో ఆంధ్రప్రదేశ్‌కు గాను 10 లక్షలు రూపాయలు ఈ కేంద్రముల నిమిత్తమై కేంద్ర సంక్షేమసంస్థ కేటాయించింది. అనగా ఒక్కొక్క దానికి రూ. 50 వేల వంతున యిచ్చినా 20 కేంద్రాలను నెలకొల్పవచ్చునన్నమాట. అంటే దాదాపు జిల్లాకు ఒకటి చొప్పున ఏర్పాటు చేయవచ్చును. ఈ ప్రణాళిక క్రిందనే విజయనగరంలో ఒక ఉత్పత్తి కేంద్రం టౌను మహిళా సంఘంవారికి శాంక్షన్ చెయ్యబడింది. ఈ కేంద్ర నిర్వహణకై 47 వేల రూపాయలు గ్రాంటు మంజూరు చేయబడింది. ఇది ప్రత్యేకంగా స్త్రీ పురుషులకు కావలసిన చెప్పులు మొదలైన పాదరక్షలు, కాన్వాసు గుడ్డతోనూ, తోలుతోనూ కూడా చెయ్యబడే హోల్డాలులు, సంచులు వగైరా వస్తువులు తయారు చేయడానికి యేర్పరచబడింది. ఇందులో పనిచేయడానికి ప్రత్యేకంగా శిక్షణ కాలంలో నెలకు 25 రూపాయల చొప్పున స్టయిఫండు యివ్వడానికి అవకాశ మున్నది. గ్రాంటుసొమ్మునుండి ఈ స్టయిఫండు క్రింద గాని ముడిపదార్థములు కొనుగోలు క్రిందగాని 27 వేల రూపాయలు ఖర్చుపెట్ట వచ్చును. మిగిలిన 20 వేలు మిషనరీ మొదలైన వస్తు సముదాయానికి ఏర్పాటు చేయబడింది. దీనిని ప్రారంభించడానికి గాను ముందుగా 6 గురు స్త్రీలకు లము పరిశ్రమల శాఖలో ప్రస్తుతం ట్రయినింగ్ యిస్తున్నారు.

ఇంతేకాక ప్రత్యేకంగా వీటిలో చేనేత పరిశ్రమకు సంబంధించిన విధానం మరొకటున్నది. దీనికై కూడా ఒక సంవత్సర కాలం తర్ఫీదునిచ్చి అనగా మొదట శిక్షణ కేంద్రంగా నడిపి తరువాత దీనిని ఉత్పత్తి కేంద్రంగా రూపొందించుతున్నారు. ఇది కూడా కేవలం సాంఘిక ఆర్థిక ప్రణాళికల ననుసరించే యేర్పాటు చేయబడింది. అఖిల భారత చేనేత పరిశ్రమ సంఘంవారి ఆధ్వర్యాన ఈ ప్రణాళిక ఏర్పాటయింది. కేంద్ర సంక్షేమసంఘం ప్రత్యేకంగా స్త్రీలకు ఉపయుక్తమయ్యే విధంగా కొన్నింటిని కేటాయించమని కోరగా మన రాష్ట్రంలో రెండింటిని కేంద్ర సంక్షేమ సంఘంద్వారానే కేటాయింపు చేశారు. అనగా కేంద్ర సంక్షేమసంఘం సిఫారసు చేసిన సంస్థలకు ప్రభుత్వం గ్రాంటు నిస్తున్నదన్నమాట.

ఇటువంటి కేంద్రం హైద్రాబాదులోని ఆంధ్ర మహిళా సభవారికొక దాని నిచ్చారు. ఇందులో 15 మంది స్త్రీలు శిక్షణ పొందారు. శిక్షణ పొందేవారికి నెలకు 25 రూపాయల చొప్పున 12 నెలలు స్టయిఫండు కూడా ఇవ్వబడింది. గ్రాంటు సొమ్ములో ఈ స్టయిఫండులకుగాను 4500 రూపాయలను కేటాయించారు. కేంద్రానికి కావలసిన మగ్గాలు వగైరా సామాగ్రికి 9917 రూపాయలు, నూలు మొదలైన ఇతర ముడి సరుకులకుగాను 4759 రూపాయలు ఏర్పాటు చేశారు. శిక్షణ నిచ్చేవారికి, ఇతర సిబ్బందికిగాను 12705 రూపాయలు కేటాయించారు. అంటే మొత్తం కేంద్రం నడపడానికి 31881 రూపాయలు గ్రాంటును యిచ్చారు. అంతే గాక దానిని నడపడానికి వర్కుషెడ్డుకుగాను 15750 రూపాయలు ప్రత్యేకంగా గ్రాంటుగా యిచ్చారు. ఈ విధంగా కేంద్ర సంక్షేమ సంఘం, అఖిల భారత చేనేత పరిశ్రమశాఖ నుంచి స్త్రీల ఆర్థికాభివృద్ధికై ఆర్థిక సహాయాన్నందించుతున్నది. ఇంతేగాక కేవలం ఆర్థిక సమస్యను మాత్రం పరిష్కరించడమే కాక సాంకేతిక నిపుణుల ద్వారా ఈ కేంద్రాన్ని ఏ విధంగా నడుపవలసిందీ, దీనికి కావలసిన బడ్జెటు మొదలైనవి తయారు చేయడం మొదలైన సలహా సంప్రదింపులను కూడా అందిస్తున్నది. ఈ పద్ధతిపై శిక్షణా కేంద్రాన్ని ఆంధ్ర మహిళాసభ నడిపించింది. దానిని గత జూన్ నెలనుండి ఉత్పత్తి కేంద్రంగా మార్చారు.

సాధారణ ఉత్పత్తి కేంద్రాలకంటే ఈ చేనేత ఉత్పత్తి కేంద్రాలకు ఎక్కువ ఆర్థిక స్తోమతులభించుతుంది. ఉత్పత్తి కేంద్రంగా మారిన పిమ్మట ఆంధ్రమహిళా సభవారు నడుపుతున్న యీ కేంద్రానికి 10734 రూపాయలు గ్రాంటుగానూ 15030 రూపాయలు అప్పుగానూ మొత్తం 25764 రూపాయలు లభించుతున్నది. అనగా ఏ విధమైనఆర్థిక బాధ లేకుండా యీ కేంద్రాన్ని నడుపవచ్చునన్న మాట. రికరింగు ఖర్చులతో 75% డబ్బును అనగా నూటికి 75వంతుల చొప్పున గ్రాంటుగా 7385 రూపాయలు మిగిలిన 25 వంతులపైకం 900 రూపాయలు అప్పుగానూ, ఇవ్వబడినది. ఇక జీత భత్యాలకై ఖర్చుపెట్టే డబ్బును పూర్తిగా అప్పుగా

(తరువాయి 82 వ పేజీలో)

# తల్లిపాలు

—డాక్టర్ : వేమిరెడ్డి రాజేశ్వరమ్మ

పిల్లలకు మొదటినెల ఆఖరి వారంనుండి పాలతోపాటు విటమిన్ 'సి'ని కూడా యివ్వడం మంచిది. నారింజపండు రసాన్ని అలాగే యివ్వవచ్చు. లేదా చక్కెరకలిపి యివ్వవచ్చు. సాధారణంగా దీనిని స్పూనుతోగాని, సీసాతోగాని పాలివ్వడానికి ఒకగంట ముందే యివ్వాలి. పళ్ళు మంచివి దొరకకపోతే విటమిన్ 'సి' బిళ్ళను పొడిచేసి, 25 మిల్లీగ్రాముల పొడిని పాలు తాగించే ముందు పాలలోకలిపి యివ్వవచ్చు. ఆరవ వారంనుండి కాడ్ లివర్ ఆయిల్‌ను పట్టవచ్చు. మొదటి రోజున ఒకచుక్క కాడ్ లివర్ ఆయిల్‌తో ప్రారంభించి, రెండు చెంచాలయ్యేవరకూ రోజుకు ఒక్కొక్కచుక్క చొప్పున పెంచుతుంటూ పోవాలి. అందువల్ల పిల్లలు యిబ్బందిలేకుండా అంటేకక్కకుండా తీసుకునే అవకాశం వుంటుంది. ఒకవేళ అలా తీసుకోవడంవల్ల పిల్లలకేమన్నా యిబ్బంది కలిగితే, కాడ్ లివర్ ఆయిల్ బదులు హాలిబట్ లివర్ ఆయిల్‌ను ఆరేసి చుక్కలచొప్పున యివ్వడం మంచిది. ఈ మందును యివ్వడానికి ప్రత్యేకంగా ఒక చెంచాను వుంచుకోవాలి. స్నానం చేయించడానికి ముందు యీ మందు పడితే మంచిది. కావాలనుకుంటే పాలివ్వడానికి ముందుగా కూడా పట్టవచ్చు. ఈ మందు బట్టమీద పడితే వాసనవస్తుంది.

వేసవికాలంలో ఎండ లెక్కువగా వున్నప్పుడు పాలనేగాక కాచి చల్లార్చిన నీటిని గూడా పట్టడంమంచిది. లేదా నారింజ రసాన్ని, కాచి చల్లార్చిన నీటిలోకలిపి పట్టవచ్చు. పిల్లలకు ఆకలి వెయ్యనప్పుడు కూడా కొద్దికొద్దిగా నీటిని స్పూనుతోనో, సీసాతోనో పట్టాలి. ఎందువల్లనంటే ఒక్కొక్కప్పుడు అకస్మాత్తుగా తల్లిపాలు ఆగిపోయి, పైపాలు పట్టించాల్సివస్తే స్పూనుతో, సీసాతో వాళ్ళు తాగకపోవచ్చు. అందువల్ల స్పూనుతోనూ, సీసాతోనూ తాగడం ముందుగా అలవాటు చేయాలి.

పిల్లలకు పాలు సరిపోకపోతే, మామూలుగా లేచేవేళకంటే యింకా ముందుగానే లేచి ఏడవడం ప్రారంభిస్తారు. అలాంటప్పుడు పాలు చాలవనుకొని తల్లి ఎక్కువసార్లు పాలను కుడపాలి. ఎక్కువసార్లు పాలు యివ్వడమే కాకుండా పైపాలు కూడా యిస్తూ వుండాలి.

పిల్లలకు రెండుప్రక్కలా పాలిచ్చి, త్రేపు వచ్చేదాకా వుంచి, ఆ తర్వాత పైపాలు త్రాగించాలి. పైపాలు తాగించేటప్పుడు, ఒక్కొకప్రక్క పదేసి నిమిషాల చొప్పున తల్లి పాలిచ్చేబదులు 6 నిమిషాలు మాత్రమే యివ్వాలి. పాలు లేనప్పుడుకూడా తాగడానికి ప్రయత్నిస్తే, వాళ్ళ నోటిలోకి పాలు రాక విసుగయి, గాలి ఎక్కువగా లోపలికిపోయి, ఆ తర్వాత యిచ్చే పైపాలు త్రాగరు. కాబట్టి పాలిచ్చే సమయాన్ని తగ్గించాలి. కొంతమంది పిల్లలు పైపాలు సీసాతో తాగించినప్పుడు, అలా సీసాతో తాగడానికి అలవాటుపడి, ఆ తర్వాత తల్లి పాలు తాగడానికి యిబ్బంది కలిగిస్తారు. అలాంటి పిల్లలకు పైపాలను చెంచాతో పట్టడం మంచిది.

పైపాలను పట్టేప్పుడు కొన్ని విషయాలను దృష్టిలో వుంచుకోవాలి. 2 ఔన్సులు కాచిన ఆవుపాలలో 1 ఔన్సు కాచిన నీళ్ళు కలిపి పట్టాలి. డబ్బా పాలనుకూడా తాగించవచ్చు. కాని డబ్బామీద వ్రాసిన కొలతలకంటే తక్కువగా పాలపొడిని కలిపి తాగించాలి. రెండు చెంచాల పొడిని మూడు ఔన్సుల నీళ్ళలో కలిపితే సరిపోతుంది. పైపాలు కొద్దికొద్దిగా అవసరమైనచోట యీవిధంగా చేయాలి. ఎక్కువ పైపాలు కావలసినచోట ఒక ఔన్సు నీళ్ళల్లో ఒక చెంచా పొడి వేసి కలపాలి.

పైపాలు పిల్లల ఆకలిని తీర్చేటట్టుగా వుండాలి. అవి తాగిన తర్వాతకూడా యింకా ఆకలి తీరకపోతే మరికొంత ఎక్కువ పాలు పట్టాలి. ప్రతిసారి తల్లి పాలిచ్చిన తర్వాత ఒకటి, రెండు ఔన్సుల పైపాలు యిచ్చి, అవి సరిపోతున్నాయో లేవో, యింకా ఎక్కువ చేయాలో చూడాలి. పిల్లలు తాగేపాలకన్నా ఎక్కువ పాలు కలపడం మంచిది. అందువల్ల ఆకలినిబట్టి తాగించవచ్చు.

ఉదయంపూట తల్లిదగ్గర పాలు ఎక్కువగా వుంటాయి. అందువలన ఉదయపు వేళల్లో పైపాలు తక్కువ పడతాయి.

పిల్లలకు పాలు పట్టి పడుకోబెట్టిన తర్వాత తల్లిదగ్గర యింకా ఏమన్నా పాలు మిగిలి వుంటే వాటిని ఒక కప్పులోకి తీసి వుంచాలి. అవి కొద్దిగా మాత్రమే వుంటే వాటిని పారబోసేయవచ్చు. ఎక్కువగా మిగిలితే వాటిని జాగ్రత్తగా దాచి, తర్వాతసారి పాలిచ్చినప్పుడు పైపాలగా పట్టవచ్చు. అవి చాలకపోతే మూడు నాలుగుసార్లు తీసినవి జాగ్రత్తచేసి, కలిపి యివ్వవచ్చు. అలా దాచి యిచ్చే పాలను తాగించేముందు కాచి యివ్వడం మంచిది.



# పండ్లు-పానీయాలు

యోగేశ్వరరావు :: సత్యనారాయణ.

పండ్లు ఆహారాలలో కెల్లా ఉత్తమ ఆహార మని అనాదినుండి తెలిసిన విషయమే. పూర్వకాలంలో ఋషులు, సామాన్య ప్రజలు పండ్లను ఆహారంగా ఉపయోగిస్తూ ఆయురారోగ్యాలతో జీవించారని మన పురాణేతిహాసాల్లో పేర్కొనబడింది. కాని యిప్పుడు పండ్ల స్థానంలో మనం యిడ్లీ, ఉప్మా, మొదలయిన ఉపాహారాలను ఉపయోగించడంవల్ల సరైన ఆరోగ్యం సమకూరడం లేదు. దీనికి కారణం పండ్లలోవున్నన్ని పోషకపదార్థాలు, ఈ ఉపాహారాలలో లేకపోవడమే. పండ్లలో మన శరీరానికి శక్తి విచ్చేటువంటి కర్బనోదజనితాలు ఎక్కువగా ఉంటాయి. ఈ కర్బనోదజనితాలు కంద చక్కెర (Sucrose) ఫలచక్కెర (Fructose) ద్రాక్ష చక్కెర (Glucose) రూపంలో వుంటాయి. ఉదాహరణకు ఖర్జూరపండ్లలో చక్కెర 75_80 శాతం వరకూ వుంటుంది.

పండ్లలో కర్బనోదజనితాలేగాక మన శరీరానికి కావలసిన విటమినులు, ఖనిజాలు కూడా లభిస్తాయి. మామిడి, బొప్పాయి, ఖర్జూర, పనసపండ్లలో విటమిన్ "ఎ", జామ, రేగు, ఉసిరి, నారింజ_నిమ్మ, నేరేడు జాతులలో విటమిన్ "సి", అనాస, అత్తి, దానిమ్మ, బొప్పాయి, అరటి, సపోటా పండ్లలో విటమిన్ "బి" మంచి పరిమితులలో లభిస్తాయి. నారింజ_నిమ్మ జాతులలో విటమిన్ "పి" కూడా లభిస్తుంది. పానీయాలను తయారుచేయడానికి పనికివచ్చే ముఖ్యమైన పండ్లలోని వివిధ పోషక పదార్థాలు ఈ క్రిందచూపబడిన విధంగా వుంటాయి.[1]

పండ్లు ఆరోగ్య రక్షణకే కాక, రైతులకు ఎక్కువ ఆదాయాన్ని కూడా చేకూర్చుతాయి. ద్రాక్ష అరటి తోటలు ఎకరానికి 25,000_50,000 పౌమల ఫలసాయాన్నిస్తాయి. ఇంత ఫలసాయం మరి ఏ యితర పంటనుండి కూడా రాదు. హైదరాబాద్ పరిసర ప్రాంతాల్లో ద్రాక్ష తోటలనుంచి ఎకరానికి సుమారు 20,000 రూపాయల ఆదాయం వస్తున్నది. ఇంత ఆదాయం మరి ఏ యితరపంట నుండీ లభించదు. మనదేశంలో భూములు, వాతావరణం పండ్లతోటల పెంపకానికి అనుకూలంగా వున్నప్పటికీ, పండ్లతోటలు తగినంతగా అభివృద్ధి చెందలేదు. అమెరికాలో ఒక ఎకరంలో పండిన పండ్లను సగటున ముగ్గురు మనుష్యులు వుపయోగించుకొంటున్నారు. మన దేశంలో ఒక ఎకరంలోని ఫలసాయాన్ని సగటున 75 మంది వుపయోగిస్తున్నారు.

మనదేశంలో చాలావరకు పండ్లను తాజాగానే వాడుతున్నాము. అందువల్ల ఒక జాతిఫలం ఒక కాలంలో అధికంగా లభ్యమై వేరొకకాలంలో అసలు దొరకక పోవడం జరుగుతున్నది. ఒకవేళ, కొన్ని జాతులఫలాలు వేరేకాలంలో దొరికినా, వుత్పత్తిచాలా తక్కువగా వుండడంవల్ల, ధర ఎక్కువగానుండి సామాన్య ప్రజలకు అందుబాటులో వుండడంలేదు. పండ్లు బాగుగా లభ్యమయేకాలంలో, వాడకం కంటే అధికంగా వుండడంవల్ల చాలావరకు కుళ్ళిపోవడంకూడా జరుగుతున్నది. మన దేశంలో పండే పంటలో సుమారు 2 శాతం ఈ విధంగా కుళ్ళి చెడిపోతున్నది. కాబట్టి ఆయా పండ్లను అవిదొరికే కాలంలోనే తాజాగాకాక, పానీయం, హల్వా, మురబ్బాల రూపాలలోకి మార్చి వాడుకొనడంవల్ల, వాటిని సంవత్సరమంతా వుపయోగించడానికి వీలవుతున్నది. అంతేకాక పండ్లు వృధాగా పోకుండా చేయవచ్చును. పండ్లు ఎక్కువగా లభ్యమయేకాలంలో చవకగా కూడా లభిస్తాయి.

### ముఖ్య ఫలజాతులలోని పోషకపదార్థముల వివరణ పట్టిక

| ఫలజాతులు | పోషక పదార్థముల శాతం: పిండిపదార్థములు | మాంసకృత్తులు | క్రొవ్వుపదార్థములు | ఖనిజములు | సున్నము | భాస్వరము | ఇనుము | ఇంధనశక్తి క్యాలరీల్లో | విటమినులు ప్రతి 100 గ్రాములలో: విటమిన్ 'ఎ' I.U. | విటమిన్ 'బి' W.G. | విటమిన్ 'సి' మి.గ్రా. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మామిడి | 11.8 | 0.6 | 0.1 | 0.3 | 0.01 | 0.02 | 0.3 | 50 | 4800 | 40 | 13 |
| ద్రాక్ష | 10.2 | 0.8 | 0.1 | 0.4 | 0.03 | 0.02 | 0.4 | 45 | 15 | 40 | 3 |
| నారింజ | 10.6 | 0.9 | 0.3 | 0.4 | 0.05 | 0.02 | 0.1 | 49 | 350 | 120 | 68 |
| నిమ్మ | 10.9 | 1.5 | 1.0 | 0.7 | 0.09 | 0.02 | 0.3 | 59 | 26 | 20 | 63 |
| దబ్బ | 11.1 | 1.0 | 0.9 | 0.8 | 0.07 | 0.01 | 2.3 | 57 | — | 20 | 39 |
| అనాస | 12.0 | 0.6 | 0.9 | 0.5 | < 0.02 | 0.01 | 0.9 | 60 | 60 | — | 63 |
| జీడిమామిడి | 11.6 | 0.2 | 0.1 | 0.2 | 0.01 | 0.01 | 0.2 | 48 | — | — | — |
| పాషన్ ఫ్రూట్ | 20.0 | 0.9 | < 0.1 | 0.7 | 0.01 | 0.06 | 2.0 | 93 | 90 | — | — |
| నేరేడు | 19.7 | 0.7 | 0.1 | 0.4 . | 0.02 | 0.01 | 1.0 | 83 | — | — | — |

ఆధారం:- Health Bulletin by *W. R. Aykroyd-et-al.*

పండ్లనుంచి పానీయాలను తయారు చేయడం, హల్వా, మురబ్బాల తయారీ కంటే సులభమే. పానీయంగా రూపొంది నప్పుడు పండ్ల రుచిలోగానీ, విటమినుల పరిమితులలోగాని ఏమాత్రమూ మార్పు వుండదు. పానీయాలు కూడా పండ్లంత విలువైనవి. పండ్ల పానీయములలో రసములు. షర్బత్‌లు (Squashes) అనే రెండు రకాలున్నాయి. పానీయాలను ముఖ్యంగా, నారింజ, నిమ్మ, ద్రాక్ష, మామిడి, అనాస, ఫాల్సా, జీడిమామిడి మొదలైన పండ్లనుంచి తయారు చేయవచ్చును.

పక్వానికి వచ్చి, చెడిపోకుండా వున్నటువంటి మేలురకపు పండ్లను ఎంచుకోవాలి. ఆయా పండ్ల జాతులలో రసానికి పనికివచ్చే రకాలుంటే, ఆ రకములనే తీసుకొనవలయును. ఉదాహరణకు మామిడి పండ్లలో పెద్దరసం, ఫిరంగిలడ్డువ, చెరకురసం, పంచదారకలశం మొదలైన మేలురకాలనే ఎంచుకొలవలయును. అదే విధంగా ద్రాక్ష రకాలలో బాగారసాన్నిచ్చే బెంగుళూరు బ్లూ, కరాచి గులాబి, గ్రాస్ కాల్మన్‌వంటి రకములను ఎన్నుకొనవలయును. పండ్లను ఎంచిన తరువాత నీటితో శుభ్రంగా కడిగివేయాలి. పండ్లమీదవుండే క్రిమిసంహార ద్రవ్యములు, మలినం మొదలైన వాటినుండి పండ్లను శుభ్రపరచడం కోసం పండ్లను ఒక శాతం హైడ్రో క్లోరికామ్లం (HCl) తో కడిగి, తరువాత వేడినీటితో కడగవలయును. ఈ శుభ్రపరచిన పండ్లనుండి రసం తీయడం కొరకు, పండ్లను ముక్కలుగాకోయవలెను. నారింజ – నిమ్మ జాతుల పండ్లను అడ్డంగా రెండు భాగాలుగా కోయవలయును. అనాస, జీడిమామిడి పండ్లను ముక్కలుగా కోయవలెను. మామిడి, నేరేడు, ఫాల్సా, పండ్లను కోయనవసరంలేదు. పండ్లను కోయడానికి "స్టెయిన్ లెస్ స్టీల్" కత్తిని ఉపయోగించవలయును. లేకపోతే యినుపకత్తులకుండే తుప్పువల్ల పండ్లముక్కలు చెడిపోవును.

పండ్లనుండి రసమును తీయడానికి ఆయా జాతులనుబట్టి వివిధ పరికరాలను ఉపయోగించవలయును. ఉదాహరణకు, నారింజ – నిమ్మపండ్లనుండి రసమును తీయడానికి కొన్ని ప్రత్యేక పరికరములు (పటంలో చూపిన "మిక్స్ మాష్టర్" యంత్రం లేక చేతితో త్రిప్పే "చక్రపు" రకం రసం తీసేపరికరం) వుపయోగించ వలయును. ఈ ఫలములనుండి రసం తీసేటప్పుడు వాటిపై తోలుగాని, గింజలుగాని నలిగిపోకుండా వుండవలయును. లేకపోతే రసం చేదెక్కుతుంది.



(పటం 1) "మిక్స్‌మాష్టర్" యంత్రం



(పటం 2) "చక్రపు" రకపు రసంతీసే పరికరం

మామిడిపండ్లను చేతితో బాగా పలిపి, తొడిమ భాగమును తీసివేసి, తరువాత రసమును పిండవలయును. ఫాషన్ ఫ్రూట్‌ను అడ్డంగా రెండుభాగాలుగాచేసి, వాటిలోని గుజ్జును తీసి, గింజలులేకుండా చేయవలెను. తరువాత ఈ గుజ్జును తగినంతనీరుతో కలిపి వడకట్టవలయును. ఈ విధంగా రెండు మూడు దఫాలుగాచేసి, వచ్చిన రసమునంతటినీ కలిపి వడపోయవలెను. అనాస పండ్లలో పై చర్మాన్నంతను తీసివేసి, తరువాత చిన్నముక్కలుగా కోయవలెను. ఈ ముక్కలనుంచి "బాస్కెట్ ప్రెస్" అనే పరికరముతోగాని, లేక "స్క్రూ"రకపు రసంతీసే పరికరంతోగాని రసం తీయవలయును. జీడిమామిడి పండ్లను ముక్కలుగాచేసి "బాస్కెట్ ప్రెస్"తో రసం తీయవలయును. జీడిమామిడిరసంలోని వగరును పోగొట్టడంకోరకు రసాన్ని మరగకాచి, చల్లార్చి తరువాత నిమ్మరసంగాని, నిమ్మ ఉప్పుగాని కలుపవలయును. "బెంగళూర్ బ్లూ" మొదలయిన రంగు కలిగిన ద్రాక్ష పండ్లను బాగా పిసికి 140°F ఉష్ణోగ్రత వద్ద 10 నిముషాలు ఉడకబెట్టవలయును. తరువాత "బాస్కెట్ ప్రెస్"తో రసంతీయవలెను. నేరేడు, ఫాల్సా పండ్లను పిసికి, పండ్లబరువునకు 2–3 రెట్లు నీళ్ళుకలిపి వడపోయవలయును.

వడకట్టిన రసాలకు చక్కెర, రసాలను నిలువ వుండేట్లుగా రసాయన పదార్థములు (ప్రిజర్వేటివ్స్) అవసర మయినట్లయితే నీరు, ఈ క్రిందచూపిన పాళ్ళలో కలపవలయును.

## పండ్ల రసముల తయారీలో కలుపవలసిన వివిధ పదార్థముల పట్టిక

(గ్రాములలో)

| వివిధ పదార్థముల వివరములు | నిమ్మరసం | దబ్బరసం | అనాసరసం | * ద్రాక్షరసం | జీడిమామిడి రసం |
|---|---|---|---|---|---|
| పండ్లరసం | 2270 | 2270 | 2270 | 2270 | 2270 |
| నిమ్మ ఉప్పు | — | — | — | — | 175 |
| పంచదార | 5100 | 4540 | 175 | — | 175 |
| నీరు | 1700 | 1135 | — | — | — |
| ప్రిజర్వేటివ్(గ్రెయినులలో) (పొటాషియమ్ మెటాబై సల్ఫైట్). | 80 | 80 | 30 | 40 | 30 |

* ద్రాక్షరసమును నిలవ వుంచిన తరువాత, వాడుకొనడానికి ముందు సీసాల అడుగున ఏర్పడే టార్టారికామ్లపు స్ఫటికములను తీసివేయవలయును. ఈ స్ఫటికములు రసముతోకలిస్తే ప్రమాదం.

రసంతో పంచదార, ప్రిజర్వేటివ్ మొదలయినవి పై విధంగా కలిపిన తరువాత శుభ్రపరచిన సీసాలలో నింపవలయును. ఖాళీ



(పటం 3) క్రౌను కార్కింగ్ పరికరం.

సీసాలను శుభ్ర పరచడానికి, వేడిగావున్న నీళ్ళలో 15—20 నిముషములుంచి, తరువాత తడి ఆరిపోయేవరకూ నీడలో పెట్టవలయును. పొడిగావున్న సీసాలలో రసాన్ని నింపి, తరువాత "క్రౌనుకార్కింగు" పరికరంతో సీలు చేయవలయును. లేదా బిరుగబెండుతో, గాలి చొరకుండా వుండేట్లు కరిగిన మైనంలో ముంచి సీలు చేయవలయును. సీలువేసిన సీసాలను చల్లని ప్రదేశములలో నిలువ వుంచవలెను.

పండ్లను ఎంచడం, శుభ్రపరచడం, రసం తీయడం, సీసాలలో నింపడం మొదలైన పనిఅంతా రసములు తయారు చేసినటులనే చేయవలయును. షర్బత్‌ల తయారీలో పండ్ల రసాలకు పంచదార, నీరేగాక రంగు, 'ఎస్సెన్సు' అవుసరమైతే నిమ్మఉప్పు కలపవలయును. తరువాత ఈ మిశ్రమమును వడకట్టి, ప్రిజర్వేటివ్ కలుపవలయును. నారింజ‌-నిమ్మ జాతులలో రసములకు, ఎస్సెన్సు బదులు పండ్ల పైతోలునకు కొంచెము నీరుకలిపి వెచ్చబెట్టి, పిండగా వచ్చిన రసమును కలుపవచ్చును. ప్రిజర్వేటివ్ కలిపిన తరువాత రసమును సీసాలలో నింపి, పై మాదిరిగనే సీలు చేయవలెను.



(పటం 4) నిమ్మఉప్పు, రంగు, ఎస్సెన్సు. పండ్లనుకోసే కత్తులు, రసం వడకట్టే వల.*

వివిధ జాతుల పండ్ల షర్బత్‌లను తయారుచేయడానికి పండ్లరసము, చక్కెర, మొదలైనవి ఈ క్రింది పాళ్ళలో కలుపవలయును.

## పండ్ల షర్బత్ (స్క్వాష్)ల తయారీలో కలుపవలసిన వివిధ పదార్థముల పట్టిక

(గ్రాములలో)

| వివిధ పదార్థముల వివరములు | నారింజ | నిమ్మ | దబ్బ | ఫాల్స | నేరేడు | ఫాషన్ ఫ్రూట్ | అనాస | మామిడి |
|---|---|---|---|---|---|---|---|---|
| పండ్ల రసము | 2270 | 2270 | 2270 | 2270 | 2270 | 2270 | 2270 | 2270 |
| చక్కెర | 2840 | 4540 | 3290 | 2740 | 1700 | 3400 | 5100 | 2840 |
| నీరు | 2270 | 1135 | 1700 | 1130 | 2270 | 1700 | 1135 | 1700 |
| నిమ్మ ఉప్పు | 140 | — | — | — | 420 | 35 | 140 | 70 |
| ప్రిజర్వేటివ్ | 85 | 90 | 80 | 112 | 120 | 80 | 95 | 75 |
| (గ్రెయినులలో) | (పొ. స) | (పొ. స) | (పొ. స) | (సో. బె) | (సో. బె) | (పొ. స) | (పొ. స) | (పొ. స) |
| ఎస్సెన్సు | నారింజ | నిమ్మ | దబ్బ | | | | | |
| రంగు | డిటో | డిటో | డిటో | | | | పసుపచ్చ రంగు | |

సూచన : 1. ప్రిజర్వేటివ్ గ్రెయినులలో వేయవలయును.
2. ఎస్సెన్సులను, రంగులను, రుచినిబట్టి కావలసినంత వేసుకొనవలయును.
3. పండ్లరసములను వుపయోగించడానికి ముందు 3-4 రెట్లు నీళ్ళతో కలిపి వాడుకొనవలయును.
4. పొ. స = పొటాషియమ్ మెటా బై సల్ఫైట్; సో. బె = సోడియమ్ బెంజోయేట్.

* ఈ వ్యాసంలో ఫోటోలు—శ్రీ మురళీధర్‌కు కృతజ్ఞతతో—రచయిత.

## బాలానందం

# రాజకీయబాధితుల పిల్లల విద్యాభ్యాసానికి పభుత్వ సహాయం

వాసిరాజు ప్రకాశం

తమ్ముళ్ళూ ! చెల్లాయిలూ !

1947 వ సంవత్సరం ఆగస్టునెల 15 వ తేదీ ప్రాముఖ్యత మనందరికీ తెలుసు. ప్రతి సంవత్సరం యీ తేదీన మనం పండుగ చేసికొంటూ వుంటాం. కొత్తబట్టలు వేసికొని ప్రొద్దున్నే స్కూలుకు వెడుతాం. అక్కడకు మనవూరిలో వుండే ఒకగొప్ప వ్యక్తి వచ్చి మూడురంగులు, అశోకచక్రం కలిగివుండే మన జాతీయ జెండాను ఎగురవేస్తారు. మన పాఠశాల ప్రధానోపాధ్యాయులు, మరికొందరు ఉపాధ్యాయులు ఉపన్యాసాలు ఇచ్చి, మనందరినీ ఆనందపరుస్తూ వుంటారు. మనకు స్కూల్లో "మిఠాయిలు, బిళ్ళలు" కూడా పంచిపెడుతారు.

ఏ దేశచరిత్రలోనయినా స్వాతంత్ర్యం వచ్చినరోజు చాలా ప్రధానమైనది. మనకు 1947 ఆగస్టు 15 న స్వాతంత్ర్యం వచ్చింది. కాబట్టి, ఆ రోజును మనం చాలాముఖ్యమైనదిగా భావిస్తూవుంటాం. స్కూల్లోనే కాకుండా మనవూళ్ళోకూడా ఆ రోజున ఎన్నోవేడుకలు జరుగుతాయి. మన నాయకుల ఫొటోలను పెద్దపెద్ద కార్లమీద, కొన్నిచోట్ల బండ్లమీద పెట్టి, పెద్దవూరేగింపు జరుపుతారు. ఆ వూరేగింపులో మనఇంట్లో వుండే పెద్దవాళ్ల కూడా పాల్గొంటూ వుంటారు. మనంకూడా చొక్కాకు చిన్న 'రిబ్బనుజెండా' తగిలించుకొని, చేతిలో కర్రకు మరొక జెండా తగిలించుకొని వూరేగింపులో తిరుగుతూ వుంటాం. ఆ విధంగా ఊరంతా వూరేగిన తరువాత ఊళ్ళో వున్న బహిరంగ ప్రదేశం వద్దకువెళ్ళి, అక్కడ వూరిపెద్ద లంతా ఉపన్యాసాలు ఇస్తారు. మనమంతా శ్రద్ధతో వాటిని విని మనకు అంతకుపూర్వం తెలియని ఎన్నో కొత్త విషయాలను తెలిసికొంటాం "మన దేశానికి స్వాతంత్ర్యం లభించటానికి ఎంతకష్టాలుపాలు కావలసివచ్చిందో ? మన నాయకు లందరూ తెల్లదొరల దౌర్జన్యాన్ని ప్రతిఘటించి, ఎన్నెన్ని ఇబ్బందులకు గురిఅయ్యారో ?" ఆలాంటి విషయాలను మనం మనపుస్తకాలలోను యితరపుస్తకాలలోను చదువుకోవటమే కాకుండా, పెద్దవారు చెబుతున్నపుడుకూడా విని, తెలిసికొంటాం.

మనదేశాన్ని మనమే, ఎన్నికలద్వారా మనం యెన్నుకునే ప్రతినిధులు పరిపాలించటానికి అవకాశం ఇచ్చేది స్వాతంత్ర్యం. అంటే పరోక్షంగా, మనమే మనదేశాన్ని పరిపాలించుకొంటూ వుంటాం. మన అవసరాలు ఏమిటో, మన మంచీ-చెడ్డలు ఏమిటో ఇతరులకంటే మనకే బాగా తెలుసు. వాటి ప్రకారమే మనకు కావలసిన సౌకర్యాలను మన ప్రతినిధులద్వారా సమకూర్చుకొంటూ వుంటాం. చిరకాల దాస్యంలో మగ్గిన తరువాత మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చి పదిహేను సంవత్సరాలు దాటింది. ఈ నెల 15వ తేదీతో, పదహారు ఏళ్ళు నిండుతాయి. ఈ పదహారు సంవత్సరాల కాలంలో మన దేశాన్ని, మన నాయకుల మార్గదర్శకత్వంతో అన్నివిధాలా అభివృద్ధి చేసికొంటున్నాం. కుల, మత వ్యత్యాసాలకు తావులేకుండా, మన రాజ్యాంగం మనందరికీ సమానమైన హక్కులు కల్పించింది. మన హక్కులను కాపాడేందుకు, కట్టుదిట్టమైన ఏర్పాట్లుకూడా చేశారు. పంచవర్ష ప్రణాళికలు — ఒకదానివెంట ఒకటి — క్రమేణా అమలు జరుపబడుతున్నాయి. ఉప్పునేలతో నిండివున్న మన పొలా లన్నీ యీ ప్రణాళికలువచ్చినప్పటినుంచీ క్రమంగా సస్యశ్యామలంగా రూపొందుతున్నాయి. పచ్చని పైరుల పంటలతోబాటు, భారతీయులు కన్న కలలు కూడాపండుతున్నాయి. దేశంలో కార్మికులు, కర్షకులు మొదలైన అన్నివర్గాలవారినీ అభివృద్ధి చేసేందుకు ప్రభుత్వం అమలు జరుపుతున్న పథకాలు సాయపడుతున్నాయి. మనం యీనాడు యీ అభివృద్ధి పథకాలనైతేనేమి ప్రణాళికలనైతే నేమి అమలు జరుపుకొనగలుగు తున్నామంటే, అది కేవలం మన స్వాతంత్ర్యంవల్లనే.

ఈ స్వాతంత్ర్య సంపాదనలో యెంతోమంది యెన్నెన్నో విధాలుగా త్యాగాలు చేశారు. అనేక కష్టాలుపడ్డారు. నష్టాలకు గురిఅయ్యారు. ఇంతగా దేశ స్వాతంత్ర్యానికై బాధలను అనుభవించినవారికి తోడ్పడి, వారి త్యాగానికి ప్రతిఫలంగా సహాయంచేయాలని ప్రభుత్వం దీక్షవూనింది. వారినే రాజకీయ బాధితులని అంటారు. వారికి అన్నివిధాల సౌకర్యాలు కలుగ చేయ

(మిగతా 88 వ పేజీలో)

# పిచ్చుక-పాయసం

—వేటూరి ఆనందమూర్తి

ఒక ఊళ్లో ఒక పిచ్చుక ఉండేది.

ఆ పిచ్చుకకి ఒకసారి పాయసం చేసుకొని తాగాలని ఆశపుట్టింది. అందుకని అటు ఎగిరి ఇటు ఎగిరి రవ్వ తెచ్చుకొంది. మళ్లా ఇటు ఎగిరి అటు ఎగిరి చక్కెర తెచ్చుకొంది. ఆ తర్వాత కోమటి దుకాణానికి వెళ్ళి బాదంపప్పూ, ద్రాక్ష, ఏలక్కాయలూ, లవంగాలూ అన్నీ తెచ్చుకొంది.



కాసిని పాలు తెచ్చుకొని, పొయ్యి రాజేసి, కమ్మగా పాయసం వండుకొంది.

గిన్నెలో పాయసం ఇంకా కాగుతూ ఉండగానే చిన్న గరిటెతో కొద్దిగా తీసుకొని రుచి చూసింది. ఆ వేడికి దాని నోరు కాస్తా కాలింది.



అప్పుడు పిచ్చుకకు కోపం వచ్చి గిన్నెలోని పాయసమంతా తీసుకువెళ్ళి ఒక కొలనులో పారబోసి వచ్చేసింది.



ఇంటికి వచ్చి, మళ్ళా ఆశపుట్టి గరిటెకు మిగిలినపాయసాన్ని కొద్దిగా రుచి చూసింది. అది ఎంతో బాగుంది. అప్పుడు పిచ్చుక రివ్వున ఎగిరి వెళ్ళి పాయసం కలిపిన ఆ కొలనులోని నీళ్లన్నీ కడుపునిండా తాగి వచ్చేసింది.



‘ఆ తరువాత ?’

‘పిచ్చుక పొట్ట కాస్తా ఉబ్బి పోయింది !’



‘ఆ తరువాత ?’

‘ఏముందీ! కథకి కాళ్లూ వచ్చాయి. పాపకి నిద్రా వచ్చింది.’

# ప్రబోధము

— వింజమూరి శివరామారావు

నేటికొక శతాబ్దము దాటె - నాటి మాట
వేడినెత్తురు పొంగగా, వాడికత్తి
చేతపట్టె ఝాన్సీరాణి చేవమీర -
దేశమునకు స్వేచ్ఛ నొసంగు నాశలూర!
వందే మాతరమంచు నొక్క శ్రుతిగా
ప్రారంభమై నాదముల్
మందే రాజ్య మటంచు నాల్గుదెసలన్
మార్మ్రోగె - స్వాతంత్ర్యమున్
పొందన్ భారతజాతి కోరి దొరలన్
ఘోద్రోలగా నెంచ, వే
గం దేశమ్మున విప్లవమ్ము చెలరేగన్
సాగె తీవ్రంబుగా!
అది యెవ్వరు నెఱుగనిది శాంతి సమరమ్ము
పరుల కందరకు నచ్చెరువు గొలిపె -
ద్వేషమ్ము లేకయే రోషమ్ము రాకయే
సత్యాగ్రహమ్ముతో సాగె పోరు -
బెదరించినను కొట్టి యదలించినను పట్టి
చెరనుంచినను ప్రజల్ చెదరలేదు -
స్వాతంత్ర్యదీక్షతో సామ్రాజ్యశక్తినే
ప్రతిఘటించిరి కష్టశతము లోర్చి-
ఆంగ్లసామ్రాజ్య భాస్కరుం డస్తమించె -
భారతము శుభోదయముతో భాసమాన
మయ్యె - స్వచ్ఛమై వీచె స్వేచ్ఛానిలమ్ము -
ఆశ లపు డందుకొనియె నూత్నాశయాల!
అన్నలు తమ్ములీ జగము
నందలి యందరు చేరి శాంతి సం
పన్నులుగా చెలంగవలె -
భాసురమౌ సహనమ్ముతోడ త్యా
గోన్నతులై మెలంగవలె -
ఉత్తమ ధర్మపథమ్ము బట్టి దీ
వ్యన్నయులై వెలుంగవలె
నన్నది లక్ష్యము భారతాంబకున్!
త్రోలినాము చీకట్ల మా నేలనుండి -
వెన్నెలల నింపితిమి యెల్ల తెన్నులందు -
కరవులేక, ఏగుండెలో బరువురాక -
పుడమి బ్రతుకగోరితిమి ముందడుగు వైచి!
పాయక భారతమ్ము క్రమ
పద్ధతి నభ్యుదయమ్ము నందుచున్
హాయిగ నుండ నీర్ష్య పడి
రక్కట! ముష్కరులైనవారు చై
నీయులు; దుర్మదాంధు
లవినీతిపరుల్; వడి దాడి చేసినా
రీయెడ మంచుకొండపయి -
ఈశపదాంకిత దివ్యభూమిపై!
దురహంకారముతో దురాక్రమణ
కుద్యోగించు దుర్మార్గులన్
పరిమార్పన్ సమయంబు నేడు;
విలసద్భావో బలోత్సాహులై
త్వరగా రండు రణాంగనమ్మునకు;
సద్ధర్మంబె సాహాయ్యమౌ;
భరతోర్వీ జనులార! శీతనగ
భూభాగంబు రక్షింపుడీ!

---

(74 వ పేజీ తరువాయి)

యిచ్చారు. యీ అప్పుసొమ్మునుమాత్రం ఉత్పత్తి కేంద్రాన్ని నడుపుతూ వాయిదాల వారీగా తీర్చుకోవలసివుంటుంది.

ఇదే పద్ధతులపై నరసాపురంలో ఒక చేనేత ఉత్పత్తి కేంద్రం శాంక్షను అయింది. దీనిఅంచనా 89,564 రూపాయలు. మగ్గములు, మొదలైన వాటిక్రింద 26,084 రూపాయలు, నూలు మొదలైన ముడి సరుకులకు 11,000 రూపాయలు, జీతాల నిమిత్తం 12 మాసములకు 9480 రూపాయలు, అచ్చట శిక్షణ పొందే స్త్రీలకు 30 లేక 35 మందికి స్టయిఫండుగా ఇవ్వడానికిగాను 18,000 రూపాయలు మంజూరు చేశారు. మొత్తం 64,564 రూపాయలు కేంద్రానికి లభించింది. ఇంతేగాక ఈ కేంద్రాన్ని ప్రారంభించి నడుపడానికిగాను షెడ్డులు ఏర్పాటు చేసుకోడానికి వేరే 25,000 రూపాయలుకూడా బోర్డువారు యిచ్చారు. ఇటీవలే షెడ్డులు పూర్తి అయ్యాయి. కేంద్రం ఇంకా ప్రారంభించ బడలేదు.

ఈ విధంగా స్త్రీల ఆర్థిక పరిస్థితిని అభివృద్ధి పరచడానికి బహు ప్రయత్నాలు సాగుతున్నాయి. ప్రభుత్వం అనేక రీతులలో ఈ అవకాశాలను కల్పించి ఆర్థిక, సాంకేతిక సహాయ సహకారాలను కూడా ప్రజల కందించుతున్నది. ఇట్టిఅవకాశాన్ని పురస్కరించుకొని సేవాపరులైన పెద్దలు సంస్థల ద్వారా నడిపించడానికి ముందంజ వేయగలరనీ, తద్వారా స్త్రీల సంక్షేమాభివృద్ధికి తోడ్పడగలరనీ ఆశించుతున్నాము. అవసరమైన సోదరీమణులు పైన చెప్పబడిన కేంద్రాలతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి యీ అవకాశములను సద్వినియోగం చేసుకొనవచ్చును.



# మంచుగుహలో ఎనిమిదినెలలు దుర్భర జీవితం గడపిన భారత సైనికుని సాహసగాథ

లడఖ్ భారత గస్తీ కేంద్రానికి చెందిన ఒక సైనికుడు ఆ ప్రాంతాన్ని చైనీస్ దళాలు ఆక్రమించుకున్న సమయంలో శత్రువులబారినుంచి తప్పించుకుని ఒక మంచుగుహలో ఎనిమిది మాసాలపాటు దుర్భర పరిస్థితులలో జీవించిన ఉదంతం ఒకటి ఇప్పుడు తెలియవచ్చింది.

అతనిపేరు దోర్జీకాల్జంగ్. లడఖ్ స్కౌట్స్ దళానికి చెందిన లెఫ్టినెంట్ నాయక్ అతడు. ప్రస్తుతం లే పట్టణంలోని మిలిటరీ ఆసుపత్రిలో అతడు చికిత్స పొందుతున్నాడు.

దోర్జీ వయస్సు 42 సంవత్సరాలు మాత్రమే. కాని, శత్రు బారినుంచి తప్పించుకోవడానికి మంచుగుహలో అతడు అనుభవించిన అష్టకష్టాలు అతనిరూపాన్నే పూర్తిగా మార్చి వేశాయి. మనిషి పూర్తిగా కుంచించుకుపోయి నూరేళ్ళ వృద్ధుడులా మారిపోయాడు. జుట్టు పెరిగిపోయి జడలు కట్టింది. కాలివ్రేళ్ళను మంచు తినివేసింది.

తమ స్థావరంపై చైనీస్ దాడిజరిపిన తరువాత దోర్జీకాల్జంగ్ అతని సహచరులు అయిదుగురు దౌలత్‌బాగ్ ఓల్డీవద్దగల ప్రధాన స్థావరానికి వెళ్ళిపోవడానికి నిశ్చయించుకున్నారు. ఈ ప్రయాణంలో దోర్జీ ఒక పర్వతపాదం దగ్గర విశ్రాంతి తీసుకొనడానికి కొంతసేపు ఆగవలసి వచ్చింది. మిగతావాళ్ళు అతన్ని అక్కడే వదలి ముందుకు వెళ్ళిపోయారు. కొంతసేపటికి చీకటి ఆవరించింది. ఎటు వెళ్ళడానికీ దారి తెలియక దోర్జీ ఆ రాత్రల్లా అక్కడే కాళ్ళు ముడుచుకుని మంచులో పడుకున్నాడు. తెల్లవారిన తరువాత పదిమైళ్ళ దూరంలో ఉన్న ఒక భారత స్థావరానికి నడిచివెళ్ళాడు. కాని, అక్కడ భారతసైనికులెవరూ లేరు. అది పూర్తిగా విసర్జించబడింది.

మంచులో నడచివచ్చాడేమో, దోర్జీ



కాళ్ళు అప్పటికే బాగా వాచి, కొయ్యబారి పోయాయి. చాకుతో కాలిబూట్లను అతడు కోసివేశాడు. ఇక ముందుకు నడవడానికి వీలులేక ఆ నిర్జన స్థావరంలోనే అతడు ఉండిపోవడానికి నిశ్చయించుకున్నాడు.

మంచు కొరికివేయడంవల్ల పాదాలు పుండ్లెక్కిపోయాయి. కాలివ్రేళ్ళపై కొన్నిచోట్ల మాంసం కుళ్ళడం ప్రారంభించింది కూడా.

శరీరంలో యికఎంతమాత్రం సత్తువ లేక ఆ స్థావరంలోని ఒక బంకర్‌లో దూరి అతడు తలదాచుకున్నాడు, ఇంతలో తీవ్రమైన హిమపాతంవల్ల ఆ స్థావరంయావత్తు పూర్తిగా మంచుతో కప్పబడిపోయింది.

రోజులు, వారాలు, నెలలు గడచిపోయాయి. శీతాకాలం యావత్తు అతడు అక్కడే ఆ మంచుకందకంలోనే ఉండిపోయాడు. స్థావరంలో మిగిలిన రేషన్లతో ఎలాగో ప్రాణాలు నిలుపుకున్నాడు.

మట్టిమీద కిరసనాయిల్ చల్లి, క్రింద ఒక పొయ్యి తయారుచేసి, దానిమీద వండుకుని తినేవాడు. రానురాను అతనికి కాలంతో సంబంధం తెగిపోయింది. సూర్యోదయాన్నిగాని, సూర్యాస్తమయాన్ని గాని చూడనే లేదు. ఇలా ఆరునెలలు గడిచిన తర్వాత నెమ్మది నెమ్మదిగా మంచు కరగడం ప్రారంభించింది. దోర్జీ మంచుగుహనుండి బైటికి అడుగు పెట్టగలిగాడు.

కోటుగుడ్డను చించి దోర్జీ తన రెండుకాళ్ళకు కట్లుకట్టాడు. రెండు కొయ్యముక్కలను వూతకోలలుగా తయారుచేసి వాటి ఆధారంతో ఎంతో కష్టంమీద కుంటుకుంటూ, అతడు బైటికివచ్చాడు. అలా నెమ్మది నెమ్మదిగా అతడు ఒక భారతీయ స్థావరాన్ని చేరుకున్నాడు. కానీ, అదికూడా నిర్జనంగానే వుంది. చైనీస్ సైనికులు అక్కడ సమీపంలో ఉన్నదీ, లేనిదీ అతనికి తెలియదు. ఆ స్థావరంలోనే మరొక బంకర్‌ను ఆశ్రయంగా చేసుకుని మరికొన్నాళ్ళు అక్కడ ఒంటరిగా గడిపాడు.

అయితే, ఈసారి మంచుబాధలేదు.

వాతావరణం వెచ్చగా వుండడంవల్ల పక్షులు, చెవులపిల్లులు బైటికివచ్చి తిరుగుతూండేవి. దోర్జీ వాటినిపట్టి కాల్చుకుతింటూండేవాడు.

ఇంతలో జూలై నెలవచ్చింది. హఠాత్తుగా ఒకరోజున అతనికి అడుగులచప్పుడు విని పించింది. వచ్చేవాళ్ళు చైనీస్‌సైనికులేమో? దోర్జీ తన బంకర్‌లో ఒదిగి కూర్చుని ఆలో చిస్తున్నాడు. ఇంతలో కంఠధ్వనులు కూడా వినిపించాయి. హిందూస్థానీలో మాటలు వినబడుతున్నాయి. దోర్జీకి ప్రాణంలేచివచ్చి నట్లయింది. బ్రతుకుజీవుడా అని అతడు తన బంకర్‌నుండి బైటికివచ్చాడు. కష్టాదుట భారత గస్తీదళానికి చెందిన సైనికులు ప్రత్యక్షం కావడంతో అతనికష్టాలన్నీ ఒక్క సారి పటాపంచలై పోయినవి.

గస్తీదళం సైనికులు అందరు దోర్జీ కాజ్జంగును ఒకరి తరువాత ఒకరు కౌగ లించుకొన్నారు. ఆతరువాత గుర్రంపై అత నిని సైనికశిబిరానికి తీసికొని వెళ్ళారు. అక్కడనుంచి లేచి కాస్టర్‌లో లే నగరానికి తీసికొనిపోవడం జరిగింది.

వారంరోజుల తరువాత దోర్జీని లే నగ రానికి దగ్గరలోవున్న అతని గ్రామానికి తీసి కొనివెళ్ళారు. దోర్జీపై ఆశలు వదలుకొన్న అతని కుటుంబంవారు మొదట అతన్ని చూసినప్పుడు వారి సంభ్రమాశ్చర్యాలకు అంతులేదు. దోర్జీతల్లి, అతని సోదరుడు ఆప్యాయంగా కౌగలించుకొని ఇంట్లోకి ఆహ్వానించారు. ★

---

(12 వ పేజీ తరువాయి)

కోట్లు వడ్డీలేని ఋణంతోనూ, రిజర్వుబ్యాంకు తదితర షెడ్యూల్డ్ బ్యాంకులవంటి భాగ స్వామిక సంస్థలు చెల్లించే అయిదుకోట్ల రూపాయలతోనూ ఈ కార్పొరేషను ప్రారంభిస్తారు. ఇప్పటివరకు భూమి తనఖా బ్యాంకులు దీర్ఘకాలిక ఋణాలను ఇస్తు న్నాయి. అయితే ఈ ఋణాలను, పాత అప్పులనుంచి విముక్తులు కావడానికి మాత్రమే లభింపజేయడమవుతున్నది. అందుచేత సర్వతోముఖమైన వ్యవసా యాభివృద్ధికి దీర్ఘకాలిక పరపతి సౌక ర్యాల కొరతను ఇవి పూర్తిగా తీర్చలేదు. కాగా ఈ కొత్త కార్పొరేషను ఈ కొరతను తీర్చగలుగుతుంది. పరపతి సౌకర్యాలకు సంబంధించిన మన దీర్ఘకాలిక అవసరాన్ని తీర్చడంలో ఈ కార్పొరేషను స్థాపన కేవలం ఆరంభచర్య మాత్రమే. ఇప్పటి వరకు రైతులకు పరపతి సౌకర్యాలు తగి నంతగా లేవు. వున్న కొద్దిపాటి అవకా శాలుకూడా పరపతి సంఘాల దుర్నిర్వ హణ, బినామీ పద్ధతి మొదలైన దీర్ఘకాలిక మైన అక్రమ విధానాలవల్ల సరిగా పొంద లేని స్థితిలో వున్నాయి. విస్తరింపజేసిన పరపతి సౌకర్యాలను సక్రమంగా లభింప జేయడానికై పై అవకతవకలన్నింటినీ వివరించే విషయంలో ప్రాతిపదికగా చాలా కృషి జరగాలి.

## అణు యంత్రాంగానికి అమెరికా సహాయం

తారాపూర్‌లో నెలకొల్పబడే తొలి భారత అణుశక్తి కేంద్రానికి రూ. 45.24 కోట్లు (95 మిలియన్ డాలర్లు) మేరకు విదేశీ మారక ద్రవ్య సహాయం చేయడానికి అమెరికా అంగీకరించింది. ఈ మొత్తంలో రూ. 38.1 కోట్లు ఈ పథకం విదేశీమారక ద్రవ్యం ఖర్చుకు సరిపోతుంది. రూ. 7.14 కోట్లు, ప్రారంభంలో ఇంధనానికై ప్రత్యే కించిన దీర్ఘకాలిక పరిపాలనా సౌకర్యంగా వుంటుంది. ఈ ప్రాజెక్టుకు రూపాయిలలో చేయవలసిన వ్యయాన్ని భారత ప్రభుత్వం భరిస్తుంది. భారత ప్రభుత్వం చేయవలసిన ఖర్చు రూ. 16.23 కోట్ల వరకు వుంటుంది. అంతర్జాతీయాభివృద్ధి సంస్థ రూ. 38.1 కోట్ల విదేశ మారకం ఋణాన్ని తక్కువ వడ్డీకి ఇస్తుంది. ఈ ఋణం తిరిగి చెల్లింపు చాలా కాలంపాటు జరుగుతుంది.

తారాపూర్‌లో నెలకొల్పబడే అణుశక్తి కేంద్రాన్ని అణుశక్తి సంఘంవారు నిర్వ హిస్తారు. ఇది 380 వేల కిలోవాట్లశక్తిని కలిగివుంటుంది. 1967 నాటికి ఈ అణు శక్తి కేంద్రం పూర్తవుతుంది. అప్పుడు ఇది ప్రపంచంలోని రెండు ప్రధానమైన అణుశక్తి కేంద్రాలలో ఒకటిగా రూపొందు తుంది. ఈ కేంద్రం ద్వారా అణుశక్తిని మహారాష్ట్ర, గుజరాతు రాష్ట్రాలలోని విద్యుత్ ప్రసారాలకు సరఫరాచేసి రెంటినీ కలుపుతారు. ఈ అణు కేంద్రంలో 190 వేల కిలోవాట్ల శక్తిగల రెండు అణురియాక్టర్లను నెలకొల్పుతారు.

## చైనీయుల కిరాతక చర్యలు

స్వదేశానికి తిరిగివచ్చిన సైనికుల కథ నాన్నిబట్టి, చైనీయులు మనకుమృతదేహాలు లేదా అస్తిక రూపంలో అప్పగించిన 26 మంది మృతులలో కొందరు చైనావారి కిరాతక చర్యలవల్ల నిహతులైనట్లు స్పష్ట మవుతున్నది. చైనీయులు యుద్ధ విరమణను ప్రకటించిన తరువాతకూడా దొంగచాటుగా అనేకమంది భారతీయ జవానులను వధిం చారు. పట్టుబడిన కొందరు జవానులను వారు రహస్యంగా చంపారు. మరణించిన, క్షత గాత్రులైన భారత సైనికుల చేతిగడియారా లను ఇతర వస్తువులనుకూడ చైనావారు తస్కరించారు. గాయపడిన తమసైనికులను వారు యుద్ధరంగంలోనే విడిచి వెళ్ళారు. గాయాలుతగిలిన తమసైనికులను వారు వధించారుకూడా. రక్షణశాఖ ప్రతినిధిఒకరు ఇంకా 800 మంది జవానుల ఆచూకీ తెలియవలసి వున్నట్లు ప్రకటించారు. ★

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

21 జూన్ : హైద్రాబాదులో జరిగిన జాతీయ పొదుపు పథకం రాష్ట్ర సలహా మండలి సమావేశంలో కేంద్ర ఆర్థికశాఖ ఉపమంత్రి ప్రసంగించారు.

22 జూన్ : రాష్ట్ర సహకార మహాసభను కేంద్ర సమాజాభివృద్ధి శాఖా మంత్రి హైద్రాబాదులో ప్రారంభించారు.

25 జూన్ : సహాయ పరిశ్రమలను నెలకొల్పేందుకుగల అవకాశాలను పరిశీలించే నిమిత్తం పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషను బోర్డు ఇద్దరు సభ్యులతో సంఘాన్ని నెలకొల్పింది.

29 జూన్ : ముఖ్యమంత్రి అధ్యక్షతన హైద్రాబాదులో వివిధ శాఖల కార్యదర్శుల సమన్వయ సంఘం సమావేశం జరిగింది.

1 జూలై : కొత్తపేట పంచాయతీ సమితిలోని రావులపాలెంలో ప్రణాళికా, పంచాయతీరాజ్ శాఖలమంత్రి ఫుట్‌పాత్ వంతెనకు ప్రారంభోత్సవం చేశారు.

సవరించిన సాంద్ర వ్యవసాయ కార్యక్రమానికి రాష్ట్ర వ్యవసాయమంత్రి తెనాలిలో ప్రారంభోత్సవం చేశారు.

6 జూలై : మహబూబ్ నగర్ జిల్లా ఆమనగల్‌లో ముఖ్యమంత్రి ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని ప్రారంభించారు.

8 జూలై : హైద్రాబాదు సమీపంలో రామచంద్రాపురంవద్ద భారీ విద్యుత్పరికరాల సాంకేతిక శిక్షణ పాఠశాలకు మద్రాసు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

13 జూలై : ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర చర్మకార మండలి, సప్లిమెంటరీ బడ్జెటు క్రింద రూ. 61,72,296 ల గ్రాంటుకై ప్రభుత్వసహాయాన్ని అభ్యర్థించింది.

18 జూలై : కర్నూలు సమీపంలో తంగడంచ వద్ద నెలకొల్పిన 1600 ఎకరాల విస్తీర్ణంగల ప్రభుత్వ యాంత్రిక విత్తనాల క్షేత్రాన్ని రెవిన్యూ మంత్రి ప్రారంభించారు.

20 జూలై : రాష్ట్రపతి మూడు వారాల పర్యటనపై హైద్రాబాదుకు విచ్చేశారు.

## భారత దేశంలో

23 జూన్ : రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్ అమెరికా, ఇంగ్లాండులలో అధికారికంగా పర్యటన ముగించుకొని భారతదేశానికి బయలు దేరారు.

25 జూన్ : కేంద్రమంత్రులు శ్రీయుతులు కె. డి. మాలవియా, హఫీజ్ మహమ్మద్ ఇబ్రహీం, గారలు తమ మంత్రి పదవులకు సమర్పించిన రాజీనామాలు ఆమోదించబడినాయి.

27 జూన్ : విద్యాశాఖ కార్యదర్శుల సమావేశం న్యూఢిల్లీలో ఆరంభమైంది.

3 జూలై : భాక్రా కుడివైపు విద్యుత్కేంద్రానికి అవసరమైన పరికరాలన్నింటినీ రష్యా సరఫరాచేసే విషయంలో జరిగిన ఒప్పందంపై న్యూఢిల్లీలో సంతకాలు జరిగాయి.

13 జూలై : న్యూఢిల్లీలో జరిగిన భారత కార్మిక మహాసభ సమావేశంలో పారిశ్రామిక శాంతిని కొనసాగించడానికి నిశ్చయించారు.

18 జూలై : లోకసభ సభ్యులు డాక్టర్ కె.ఎల్. రావు కేంద్ర ప్రభుత్వ విద్యుచ్ఛక్తి, సేద్యపు నీటివనరులశాఖ స్టేట్ మంత్రిగా నియమించబడినారు.

## విదేశాలలో

20 జూన్ : అత్యవసర పరిస్థితిలో ఉపయోగపడే నిమిత్తం, వాషింగ్టన్, మాస్కోల మధ్య వార్తా సంబంధాలను నెలకొల్పే విషయంలో జరిగిన ఒప్పందపై అమెరికా, సోవియట్ యూనియన్ ప్రభుత్వ ప్రతినిధులు సంతకాలు చేశారు.

21 జూన్ : కార్డినల్ గియోవన్నీ బాటిస్టా మోంటినీ కొత్త పోప్–పాల్–VI–గా ఎన్నిక అయ్యారు.

24 జూన్ : బ్రిటిష్ పరిపాలన క్రిందవున్న జాంజిబార్‌కు స్వయం పరిపాలనాధికారం లభించింది. ఆఫ్రికా తూర్పుకోస్తావైపు హిందూ మహాసముద్రంలో గల ద్వీపాలు జాంజిబార్ పరిపాలనా వ్యవస్థ క్రింద వున్నాయి.

29 జూన్ : అంతర్జాతీయ కార్మికసంస్థ తనకు సంబంధించిన ఎన్నికైన సంఘాలనుంచీ, సమావేశాల నుంచీ దక్షిణాఫ్రికాను బహిష్కరించడానికి నిశ్చయించింది.

15 జూలై : మాస్కోలో అణ్వస్త్ర పరీక్షల నిషేధంపై చర్చలు ప్రారంభమయ్యాయి.



## గ్రంథ సమీక్ష

# ఆంధ్ర చ్ఛందస్సుల పరిశీలన గ్రంథం

# "తెలుఁగుభాషలో ఛందోరీతులు"

తెలుగులో ఛందస్సుకున్న ప్రాముఖ్యం వ్యాకరణాలంకార శాస్త్రాలకు ప్రాచీనం నుంచీ లేదు. ఛందఃపరమైన యతి ప్రాసలు, తెలుగుకు సహజాలంకారాలు. ఎరువు తెచ్చుకున్న బరువులు కావు. ఇవి మన ఆంధ్రభాషా జన్మజీవన తత్త్వంతోనే అవినాభావసంబంధం కలిగి ఉన్నట్లు లోతుగా పరిశీలిస్తే తెలుస్తుంది. కాగా వ్యాకరణాలంకారశాస్త్రాలను త్రోసిరాజన్నట్లుగా తెలుగులో ఛందశ్శాస్త్రం ప్రాముఖ్యాన్ని, ప్రాశస్త్యాన్ని వహించటంలో అబ్బురం లేదు.

ఇంతగా భాషతో పెనవేసుకున్న ఛందశ్శాస్త్ర విషయాలను ముఖ్యంగా అక్షర మైత్రికల యతిప్రాసలను సక్రమంగా తాత్త్వికంగా అవగాహన చేసుకుని సవ్యమైన చారిత్రక పద్ధతిలో పరిశీలించినప్పుడు మన భాషా పరిణతి, తత్పరిణామస్వభావం ప్రమాణపురస్సరంగా వెల్లడికావటం సహజం. కాగా ఛందశ్శాస్త్ర గ్రంథాల పరిశోధనంనిత్యనూతనంగా జరగటం అత్యంతం వాంఛనీయం. ప్రాచీన శాస్త్రగ్రంథాలను మౌలికంగా అధ్యయనం చేసి క్రొత్తలోతుల్లోకి చూడటమన్నది, ఇటీవల నూటికీ కోటికీ ఒక్కటిగా రూపొందింది. ఇటువంటి అధ్యయనాన్ని ప్రోత్సహించటానికి నాందిగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ వారు "తెలుగులో ఛందోరీతులు" అన్న శీర్షికతో పరిశీలన గ్రంథరచనకు పోటీనినిర్వహించారు. ఈ పోటీని పురస్కరించుకుని అవతరించిన ఛందోరీతుల పరిశీలనా గ్రంథాలలో విద్వాన్ శ్రీ రావూరి దొరసామి శర్మగారు రచించిన "తెలుఁగు భాషలో ఛందోరీతులు" ఒకటి.

("తెలుఁగు భాషలో ఛందోరీతులు" గ్రంథకర్త: విద్వాన్ శ్రీ రావూరి దొరసామి శర్మ. ఎం. ఏ., బి. ఓ. ఎల్. పుటలు 469 వెల : పదిరూపాయలు, ప్రతులకు : రచయిత పేర, సీనియర్ తెలుగు పండిట్, హిందూహైస్కూల్ ట్రిప్లికేన్, మదరాసు-5)

ఛందశ్శాస్త్ర రహస్యాలను తత్తత్త్వాలను అవలోకించిన పరిశోధకులు లెక్కలో నేడు వేళ్ళమీదకు రారు. అటువంటి పరిశోధకులలో ఒకరుగా గణనకెక్కిన రావూరివారు ఛందశ్శాస్త్ర వేత్తలలో ప్రామాణికులలో ఒకరుగా పరిగణింపబడుతున్నారు. రావూరివారు తెలుగు ఛందస్సు ఉత్పత్తిమొదలు, "నవ్యకవిత్వం - క్రొత్త ఛందోరీతులు" తోసహా సింహావలోకనం పరిశిష్ట అనుబంధాలతో కలిపి పదిహేను భాగములుగా ఆంధ్రచ్ఛందోగ్రంథాల తీరుతెన్నులను వివరిస్తూ ఈ పరిశీలకగ్రంథాన్ని రచించడం ప్రశంసనీయమైన విషయం. ఛందోరీతులనగా దేశీయ, సాంస్కృతిక పద్యముల స్వరూప నిరూపణంకంటె స్వభావ నిరూపణమే ప్రాముఖ్యాన్ని వహిస్తుంది. స్వరూపాలు భిన్నాలైనా అంతే, పద్యనామగణాలు భిన్నాలైనా శయ్యలో ఏకత్వంకల, లయలో ఏకత్వంకల ఛందస్సులు పెక్కులుంటాయి. వాటిని పృథక్కరించి ప్రయుక్తాలైన, లేదా ప్రోక్తాలైన పద్యాలలో స్వభావ వివేచన చెయ్యడమే ఛందోరీతుల సమీక్షకాగలదు. ఈ రీతుల గతులకు గణాలు మూలమైనందున అక్షరాలకు తద్రూపంగా శబ్దాలకు, గురు లఘువులకు గణాలకు అవినాభావసంబంధ మున్నందువల్ల గణ వివేచనం తప్పనిసరికాగలదు. మాత్రమారినచో మాటమారినంతగా లయ-ఛందస్స్వభావమే మారిపోగల ఘట్టాలు అనేకమున్నాయి. ఛందస్సుకుప్రత్యేకించి తెలుగు ఛందస్సుకు సహజసౌందర్యాపాదకములు,లయ శబ్దప్రభాప్రభాకరములు అయిన యతిప్రాసల స్వభావ పరిశీలనంకూడాసమీచీనమూ, సమంజసమూ కాగలదు. కేవల రీతుల పరిశీలనలో పచ్చిశాస్త్రీయాలైన అక్షర గణ నక్షత్రగ్రహరాశి విషామృతత్వాదివిశేషాల పరిశీలనతో తదితర ఛందశ్శాస్త్ర విషయాలతో పని లేదు. కాగా ఈ రీతుల స్వభావ పరిశీలనం విడచి కేవల పద్య లక్షణ లక్ష్య సమన్వయప్రదర్శన

మాత్రమేచేసినపుడు అది రీతి పరిశీలన కాబోదు. ఈ దృష్ట్యా 440 పుటలున్న ఈ గ్రంథంలో గణపద్య లక్షణ లక్ష్యపరిశీలనకు సుమారు 200 పుటలు, యతిస్వభావ పరిశీలనకు 150 పుటలు వినియోగింపబడటం గమనింప దగినవిషయం.

2

పాటగాని, పద్యంకాని, పద్యధోరణిగల గద్యంకాని, ఆహ్లాదాన్ని గలిగించేదిగా రూపొందినపుడు నియమించుతున్నా నన్ని నియమించినా నియమించకపోయినా, అది ఛందోనిబద్ధమే కాగలదు. శ్రవణ సుభగత్వాన్ని కలిగించే లక్షణం కలదే ఛందస్సు. గీతాలలోకాని అశేష విషమ వృత్తాలలో గాని నియమిత సంఖ్యాక్షర పాద సంవృతత్వానికి అవకాశాలు తక్కువ. విభిన్న నియమాలకు అవకాశాలు ఎక్కువ. అది మాత్రా సంఖ్యా పరిమితంకలదైతే నియమిత సంఖ్యాక్షర వృత్తం కాదు. కాబట్టి సంవరణార్థకమైన "ఛది" ధాతువుకన్న ఆహ్లాదార్థకమైన "చది" ధాతువే, ఛంద శ్శబ్దమునకు మూలమనటం సమంజసంగా ఉంటుంది. మన చతుర్వేదాలూ ఛందోబద్ధాలే నని పరిశీలించిన వారికి తెలియగలదు. యజుర్వేదం కేవలం గద్యాత్మకం కాదు. వేదం ఒక్కటే నని, వేదవ్యాసుడు దాన్ని నాలుగుగా విభజించాడని వ్రాక్కుచ్చే పురాణ వాక్కు అసంబద్ధమైనదికాదు. అర్థవిషయ భిన్నత్వంతో ఋగ్యజుస్సామాధర్వాలు నాలుగింటిలోను ఏకైక స్వరూపంగా కనిపించే మంత్రాలు ఈ విషయాన్ని సత్యంగా నిరూపించటానికి గీటురాళ్లుగా ఉపయోగపడగలవు. ఋగ్వేదం వృత్తబద్ధ మైనప్పుడు అర్థాంతరాలతో ఋగ్వేద మంత్రాలే కొన్ని సందర్భాల్లో పునరుక్తంగా ప్రతిబింబించిన యజుర్వేదం, గద్యాత్మకం ఎట్లు కాగలదు? ఇప్పటివరకూ పరిశోధకుల నందర్నీ స్వతంత్ర దేశీయ ఛందస్సులని భ్రమింపజేస్తున్న ద్విపద — త్రిపద—చౌపద—షట్పదివంటి ఛందస్సులకు మూలం యజుర్వేదమేనని హసం గుర్తించగలిగినప్పుడు యజుర్వేదం గద్యాత్మక మెట్లు కాగలదు?

గాయిత్రీ త్రిష్టు బ్జగత్యనుష్టు ప్పఙ్త్యా సహ।
బృహత్యుష్ణి హాకకుప్పూచీభిః శమ్యన్తుత్వా॥
ద్విపదాయా శ్చతుష్పదాస్త్రిపదాయాశ్చ
షట్పదాః।
విచ్ఛన్దాయాశ్చసచ్ఛన్దాః సూచాభిః శమ్య
న్తుత్వా॥
(యజు-23 అ. 33-34)

ఇవి ద్విపదాది ఛందస్సులను పేర్కొన్న యజుర్వేద మంత్రాలు. ఈ ద్విపదాదులు అనుష్టుప్ భేదాలు. కాగా భిన్న భాషల్లో వివిధ లక్షణాలు రూపొందడం సహజమే.

వేదమునకున్న అలౌకికస్థాయిని పురస్కరించుకుని క్రమ పరిణతి నందిన లౌకిక భాషతో దాని కేర్పడిన సుదూరత్వమును దృష్టిలో వుంచుకొని భాషాపరమైన విభేదంతో లౌకిక, అలౌకిక భావా లేర్పడ్డాయి. సంస్కృత భాషా చరిత్ర దృష్ట్యా అనంతర కాలమున వేద భాష అలౌకిక భాష యైనదే కాని వేదకాలంలో అది లౌకిక భాషే నన్న సంగతి మనం మరచిపోరాదు. కాగా లౌకిక భాషా ఛందస్సులకు మూలం వైదిక భాషా ఛందస్సులే నని సత్య నన్నిహితంగా గుర్తించటం మంచిది. వైదిక ఛందస్సు నుండి పింగళాచార్యాదుల లక్షణ గ్రంథాలను స్పృశించి ఛందశ్శాస్త్ర సంజనన తద్వికాస చరిత్రను చక్కగా క్రోడీకరించిన రావూరి వారు అభినందనీయులు. గణని ర్వచనా పద్ధతిలో ఉన్నత పాఠశాలా విద్యార్థులకు సయితం బోధపడునంతటి సులభంగా వివరించటం రావూరివారికి నిత్యానుభవంగా సాధ్యమైనది. "యాప్పరుంగలం" కారికా గ్రంథమైన (ప్రాచీన తమిళచ్ఛందం) "యాప్పరుంగలక్కారికై" లో "రేచియార్ సెయిదవదుగు చ్ఛందం" విషయంపై రావూరివారు రేచియార్‌కు మారు వాంచియార్ ఉండనగునని పేర్కొన్నారు. రేచియార్, వాంచియార్‌లకు ఆధునికమైన లిపిలో విస్పష్టమైన, అసదృశమైన విభిన్నత్వం ఉండవచ్చునుగాని వెయ్యి సంవత్సరాలనా డున్నదని చెప్పలేము. ప్రాచీన లిపి స్వరూపమును ఎరిగినవారు రేచియార్‌గా పేర్కొన్నారని వేటూరివారు చెప్పిన విషయం గమనించతగ్గది. కవిజనాశ్రయ కర్తరేచనాకాదు,వేములవాడ భీమన్నాకాదు- మరొకడు. అది రేచన కృతంగా అవతరించటానికి కారణం వేరుగా ఉన్నది. ఇది ఒకపెద్ద గాథ. కవిజనాశ్రయం, రేచనల అనేకత్వమున్నంత కాలం, నన్నయకు పూర్వపు ఛందస్సు కాదనటానికి అవకాశం లేదు.

3

సంపూర్ణమైన పరిశీలనం కొరవడినకారణంగా కవిజనాశ్రయంలోను, కావ్యాలంకార చూడామణిలోను సూర్యగణాలు 4, ఇంద్ర గణాలు 8, చంద్రగణాలు 16 గా పేర్కొనబడినట్లు ఒక విచిత్రాభిప్రాయం ఇటీవల రూపొందింది. ఈ అభిప్రాయాన్ని రావూరి వారు (43,44,45 పుటలు) అనుమాన ప్రమాణాలతో త్రోసిరాజన్నారు. కవిజనాశ్రయకర్త

భరతనగనల సలంబులు
వరుసన్నియాఖు నెన్న వాసవగణముల్;
మరి నహములిన గణంబులు,
సరవింద క్తినవియెల్ల (జంద్రగణంబుల్.

(కవి జనాశ్రయం. సంజ్ఞ 22 పద్యం-పరిషత్ప్రచురణ-6పుట, వావిళ్ళ ప్రచురణ)

అని రవీంద్ర చంద్రగణాలను స్పష్టంగా పేర్కొన్నాడు. రవీంద్రగణాలననుసరించి చంద్రగణాలను కూడా 14 గుకు తగ్గింప

వలసివున్నది. కవిజనాశ్రయ కర్తపరంగా జరిగిన ఈ వివాదం నేలవిడిచినసాము. ఈ పద్యం అన్ని ప్రతులలోను ఉన్నదన్న సంగతి మనం మరచిపోరాదు. రావూరివారన్నట్లు కావ్యాలంకార చూడామణికర్త నలనామక గణాలారింటిని మాత్రమే ఇంద్రగణాలుగా పేర్కొన్నాడని సూర్యగణాలుగా రెండింటినే పరిగణించాడని సత్య సన్నిహితంగా గుర్తించడానికి మరో ఆధారంకూడా ఉన్నది. సీసలక్షణంచెప్పడానికిముందుమొట్ట మొదటిసారిగా నలనామక గణాలను పెద్దన పేర్కొన్నాడు. (నల నగ సల భరతగణంబులు నసహంబులను నన౹గ...8వ ఉల్లా. 29 పద్యం) ఈ పద్యానికి తర్వాత ఇంద్ర గణాలను యెక్కడ పేర్కొనడం జరిగినా నలనామక గణాలని పేర్కొనడం జరిగింది. 29 వ పద్యంలో నలనగసలభరత గణాలని పేర్కొన్నందువల్ల ఆ తర్వాత ఆ ఆరు గణాలను యెక్కడ పేర్కొనవలసి వచ్చినా నలనామకగణాలనే పేర్కొన్నాడు. ఈ 29వ పద్యానికి పూర్వం యెక్కడా నలనామక గణాలని పేర్కొనక పోవడం కూడా గమనించవలసిన విషయం. నలనగసలభరతలు సీసంలో మాత్రమే వాడబడుతాయని పెద్దన చెప్పలేదు. "సీసంబులు గీతులు" వాటితోనే కూర్చబడాలని పేర్కొన్నాడు. (8 ఉల్లా-29) గీతులంటే పెద్దనమతంలో తేటగీతి ఆటవెలదులు మాత్రమేకాదు.

ఇంక సూర్యగణాల విషయకంగా యెక్కడ పేర్కొనవలసివచ్చినా నగణమనో, హగణమనో పెద్దన పేర్కొంటాడు. నగణ హగణాల్లో దేన్ని పేర్కొన్నా అది ఆ రెంటికీ గ్రహణమే—ఈ విషయాన్ని విస్పష్టంగా "ఒక గురువు రెండు లఘువులు, నకలంకత సమము కాన హనములందకులో, దమలో నొక౹డొకడు పీడుపడుచున్, వికటింపక చెల్లు నొక్కవృత్తము తక్కన్'' (కా-8 ఉల్లా-30) హగణంలో ఒక గురువు (౧.1) ఒకలఘువు—నగణంలో మూడూ లఘువులే (111) ఆ గురువుకు మారు రెండు లఘువులు. ఒక గురువూ రెండు లఘువులూ సమానమే గదా. కాబట్టి హగణమంటే హగణంతోపాటు నగణాన్ని నగణమంటే నగణంతోపాటు హగణాన్ని గ్రహించవచ్చు అని పెద్దన పేర్కొన్నాడు. ఈవిధంగాచూస్తే లగం (1౧) కూడా హనగణాలతో సాజాత్యం కలదేగదా :— అయినా ఈ రెండింటితో లగాన్ని పెద్దన కలపలేదంటే దాన్ని యీ రెండింటికీ దూరంగా ఉంచాడనీ లగాన్ని (వగణాన్ని) రవిగణంగా భావించలేదనీ తేల్తుంది. సమత్వ సహితమైన వగణాన్నే విడిచిన పెద్దన సమత్వ రహితమైన గగాన్ని సూర్యగణంగా గ్రహిస్తాడనడం సత్య విదూరం—కాగా రావూరివారు రవీంద్ర చంద్ర గణాలపరంగా కవిజనాశ్రయ కావ్యాలంకార చూడామణి కర్తలవిషయంలో వెల్లడించిన భావం పూర్తిగా సమర్థనీయం.

—"వాఙ్మయ మహోధ్యక్ష"

( 80 వ పేజీ తరువాయి )

టానికి ప్రత్యేకమైన పథకాలున్నాయి. వాటిల్లో, వారి పిల్లలకు ఉచిత విద్యాభ్యాసం లభింపచేయటంకూడా ఒకటి.

రాజకీయబాధితులపిల్లలకు విద్యనిమిత్తం ప్రతిఏటా కొంత ఆర్థిక సహాయం చేసే విధానాన్ని మన రాష్ట్రప్రభుత్వం ఇటీవలనే ప్రవేశ పెట్టింది. 1960 ఆగస్టు 4 వ తేదీన మంజూరయిన ప్రభుత్వ వుత్తర్వులప్రకారం రాజకీయ బాధితుల పిల్లలుగాని, మనుమలు గాని యీ సౌకర్యం పొందటానికి అర్హులు. భారతదేశాన్ని స్వతంత్ర దేశంగా చేసేందుకు నడిపిన జాతీయోద్యమాలలో పాల్గొన్న రాజకీయ బాధితుల పిల్లలు, మనుమలు మాత్రమే యీ సౌకర్యం పొందవచ్చును. ఇదిగాక, యిలాంటిదే మరొక పథకం వున్నది. 1947–48 లో హైదరాబాదు సంస్థానాన్ని భారతప్రభుత్వంలోవిలీనంచేసేందుకు జరిపిన పోరాటంలో ప్రభుత్వం తరపున పాల్గొన్న రాజకీయ బాధితుల పిల్లలకు, మనుమలకు యీ రెండవ పథకం వుద్దేశించబడివున్నది.

దరఖాస్తు పెట్టుకునే విద్యార్థి తనతండ్రి లేకతాత జాతీయోద్యమాలలో పాల్గొన్నట్టు 'సర్టిఫికేటు' పంపాలి. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు లేదా కార్యదర్శి యీ సర్టిఫికెట్టును ఇవ్వవలసివుంటుంది. అలాంటి సర్టిఫికెట్టు జతపరచకుండా పంపే దరఖాస్తులను ప్రభుత్వం పరిశీలించదు.

ప్రభుత్వం రాజకీయ బాధితుల పిల్లలకు జీతంఖర్చు, పుస్తకాలఖర్చు ఇస్తుంది. ఈ ఇచ్చే మొత్తం వృత్తి కళాశాలల్లో చదివే వారికి వేరుగాను, డిగ్రీతరగతుల్లో చదివే వారికి వేరుగాను, హైస్కూళ్ళలో చదివే వారికి వేరుగాను వుంటుంది. ఒకటవ తరగతినుంచి ఎనిమిదవ తరగతివరకూ మన రాష్ట్రంలో ఉచిత విద్యావిధానం అమలులో వుంది. కాబట్టి తరగతుల్లో చదివేవారు జీతం కట్టనవసరంలేదు. వారికి కేవలం పుస్తకాలకు అయ్యేఖర్చు ఇస్తారు. దరఖాస్తు ఫారాల నమూనాలుగాని, లేక ఫారాలుగాని ఆయా విద్యాసంస్థలలోనే లభిస్తాయి. విద్యార్థులు నిర్ణీతతేదీలలోగా దరఖాస్తు ఫారాలనుఆయా విద్యాసంస్థలద్వారా ప్రభుత్వానికందజేయాలి.

విశ్వవిద్యాలయాలలోను, కళాశాలల్లోను చదివేవారికి రాష్ట్రప్రభుత్వ విద్యాశాఖ డైరెక్టరే (హైదరాబాదు) యీ 'స్కాలర్ షిప్పు' లను పంపిణీ చేస్తారు. హైస్కూళ్ళలో చదివేవారికి ఆయా జిల్లాల్లో వుండే విద్యాశాఖాధికారులే యీ ఉపకార వేతనాలను మంజూరు చేస్తారు.



Edited & Published by the Director of Information and Public Relations, Andhra Pradesh, Hyderabad-1.
Printed at Yuva Press, Public Garden Road, Hyderabad.

1963 జులై 8 వ తేదీన శ్రీ కామరాజ్ నాడార్, రామచంద్రాపురంలోని ఖాదీ విద్యుత్పరికరాల కర్మాగారంలో సాంకేతిక శిక్షణ పాఠశాలకు ప్రారంభోత్సవం చేశారు.



నిర్బంధ పొదుపు పథకం : 1963 జూన్ 21 వ తేదీన హైద్రాబాదులో కేంద్ర ఆర్థికశాఖ ఉప మంత్రిణి శ్రీమతి తారకేశ్వరిసిన్హా, చిన్న మొత్తాల పొదుపు వ్యవహారాల రాష్ట్ర సలహా సంఘం సమావేశంలో నిర్బంధ పొదుపు పథకాన్నిగూర్చి ఉపన్యసించారు.

